C

శ్రీః

శ్రీ దామరల వేంగళభూపాలవిరచిత

# బహుళాశ్వచరిత్రము

(విస్తృతపీఠికతో)



స్వప్న పబ్లికేషన్స్
పెరిదేపి, వేములపాడు (పోస్ట్), ప్రకాశంజిల్లా.
పిన్ : 523 273

శ్రీః

శ్రీ దామరల వేంగళభూపాలవిరచిత

# బహుళాశ్వచరిత్రము

(విస్తృతపీఠికతో)



స్వప్న పబ్లికేషన్స్
పెరిదేపి, వేములపాడు (పోస్ట్), ప్రకాశంజిల్లా.
పిన్ః 523 273

2

శ్రీః

శ్రీ దామరల వేంగళభూపాలవిరచిత

# బహుళాశ్వచరిత్రము


రావి మోహనరావు, *M.Sc., M.A., (Sanskrit)*
4-103, ఐఎల్‌టిడి కాలనీ ఎక్స్‌టెన్షన్,
కొత్తపేట, చీరాల-523 157.
ఫోన్ నెం. 9440 115411

ప్రథమముద్రణః
విరోధి ముక్కోటి 28-12-2009
ప్రతులు : 500
పుటలు : 128
వెల : రూ.50-00

ప్రతులకు :- ఉన్నం జ్యోతివాసు
పెరిదేపి,
వేములపాడు (పోస్ట్)
ప్రకాశంజిల్లా-523 273.

ముద్రణ :
సూర్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
స్టేషన్‌రోడ్, చీరాల
సెల్ : 9346911249
9030616960

*D.T.P.:*
పి. విక్రమ్
నూతలపాడు.
సెల్: 9492080750

3

# వాచవి



మన తెనుగు సాహిత్యములో నాయికానాయకుల శృంగారవర్ణన లేని ప్రబంధములను వేళ్లమీద లెక్కించవచ్చును. అట్టివానిలో బహుళాశ్వచరిత్ర ఒకటి. దీనికర్త దామరల వేంగళభూపాలుడు. ఇందులో నాయికానాయకుల శృంగారము లేకపోయినా కవి సందర్భాలను సృష్టించుకొని వసంతఋతువు, పుష్పాపచయము, వనవిహారము, విరహవర్ణనలను చొప్పించి ప్రబంధము చేసాడు.

దామరల వారిది ప్రసిద్ధ కుటుంబము. వేంగళభూపాలుడు వేంకటాద్రి, గురవమ్మల పుత్రుడు, అందగాడు, సంగీతసాహిత్యాలలో అందె వేసిన చెయ్యి. ఎందఱో కవులకు ఆశ్రయము కల్పించాడు. శత్రురాజులచేత సేవలు చేయించుకొన్నాడు. ఇనగాల గోత్రజుడు. ఇతని అన్న చెన్నభూపాలుడు. ఇతని కొడుకు అంకభూపాలుడు ఉషాపరిణయము అను కావ్యము వ్రాసాడు. ఇందులో చిత్రకవిత్వమెక్కువ. ఇందులో అంకకవి తన పినతండ్రి వేంగళభూపాలుని గుఱించి ఇలా చెప్పాడు.

ఉ॥ వేంగళమేదినీ విభుఁడు-విద్యల నెప్పుడుఁ బ్రొద్దు పుచ్చుచుం
జెంగటఁ జేరి సత్కవులు-చిత్రగతిం దను సన్నుతింపఁగా
నంగజుఁడో యటంచు వన-జాయత నేత్రలు కాంక్ష సేయఁగాఁ
బొంగుచు నుండు రాజ్యరమఁ-బూని సురేశ్వర భోగవైఖరిన్॥ (ఉషా. 1-53)

దీనివలన వేంగళవిభుడు నిరంతరం విద్యలతోను, కవితాగోష్ఠులతోను ప్రొద్దుపుచ్చేవాడని, విలాసమైన జీవితాన్ని గడిపేవాడని తెలుస్తుంది. అప్పటి కవులు ఆయనను సన్నుతించిన పద్యాలు ఇప్పుడు దొరకడం లేదు. ఈ కృతికి ముందు తాను కృష్ణకథాకావ్యము వ్రాశానని (బహు. 1-15) కవి చెప్పుకొన్నాడు కాని అది నేటికి కూడా దొరకలేదు.

ప్రస్తుత కావ్యము బహుళాశ్వచరిత్రకు మూలము భాగవతములో 25 గద్య పద్యాలలో (దశమ. ఉత్తర. 1176 నుండి 1200 వఱకు) ఉంది. ఆ కథను చూడండిః-

"మిథిలా నగరములో శ్రుతదేవుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు విష్ణుభక్తుడు, సచ్ఛీలుడు. ఆ నగరాన్ని పాలించే బహుళాశ్వుడు కూడ ఆ బ్రాహ్మణునిలాగే ధర్మమార్గములో చరిస్తూ ఉండేవాడు.

వాళ్లను చూడవలెనని ఒకనాడు కృష్ణుడు మునులతో మిథిలా నగరానికి బయలుదేరాడు. దారిలో సామంతులిచ్చిన కానుకలు స్వీకరించాడు. నగరం చేరగానే బహుళాశ్వుడు, శ్రుతదేవుడు కానుకలతో ఎదురువెళ్లి పాదాభివందనము చేశారు. తమ ఇళ్లకువచ్చి పూజలను స్వీకరింపమని కోరారు. కృష్ణుడు అంగీకరించి ఏకకాలములో రెండురూపాలతో ఇద్దరి ఇళ్లకు వెళ్లాడు. బహుళాశ్వుడు స్వామివారి పాదాలు కడిగి, ఆ నీళ్లను తను, తన భార్య, బంధువులు నెత్తిన చల్లుకొని, విందుభోజనం పెట్టాడు. స్వామివారి పాదాలు ఒత్తుతూ 'నీ పాదధూళి నా ఇల్లు సోకగానే ధన్యుడనైనాను. ఇంకొన్ని రోజులు ఇక్కడే ఉండ'మని అభ్యర్థించాడు. స్వామి కరుణించాడు.

అక్కడ శ్రుతదేవుడు కూడ స్వామివారి పాదాలను కడిగి ఆ నీటిని నెత్తిన చల్లుకొని, మందిరమంతా చల్లించాడు. పూలతో పూజ చేసాడు. స్వామి తనఇంటిలో ఉన్నాడని, తన జన్మ ధన్యమైనదని ఆనందించాడు. భార్యాబిడ్డలు స్వామిని సేవిస్తుంటే, తాను స్వామివారి పాదాలు ఒత్తుతూ నీ పాదదాసుడిని ఆజ్ఞాపించమని కోరాడు. అప్పుడు స్వామి "జీవకోటిలో బ్రాహ్మణులు ఉత్తములు. వాళ్లు నాకు ఇష్టమైనవారు. వారిని పూజించమన్నాడు. శ్రుతదేవుడు స్వామివెంట వచ్చిన మునులను పూజించాడు. తుదకు స్వామివారిని వీడ్కొలిపి తన నగరం చేరాడు"- ఇది భాగవతకథ.

విష్ణుకీర్తనను, బ్రాహ్మణపూజను ప్రబోధించే ఈ కథలో కవి విష్ణుకీర్తనను స్వీకరించి, సందర్భము దొరికినప్పుడల్లా కావ్యవర్ణనలను చేసికొంటూ కావ్యాన్ని 683 పద్యగద్యాలకు పెంచాడు. ప్రబంధములోని కథ సంగ్రహంగా ఇలా ఉంది.

ప్రథమాశ్వాసము :-విదేహదేశంలో మిథిలానగరం ఉంది. ఆ ఊరిని బహుళాశ్వుడు పరిపాలిస్తున్నాడు. అతని పురోహితుడు శ్రుతదేవుడు. ఒకనాడా రాజును చూడటానికి వ్యాసవశిష్ఠాది ఋషులు వచ్చారు, చూశారు. వెంటనే ద్వారకకు వెళ్లారు. ఆ నగరాన్ని వర్ణించారు. కృష్ణుని దర్శించారు, ప్రస్తుతించారు. ఆయన వారి యోగక్షేమాలు అడిగాడు. తాము బహుళాశ్వుని నగరంనుండి వస్తున్నామని చెప్పారు. ఆయన మాకూ తెలుసు, అతనిని చూడడానికి రేపే బయలుదేరుదామన్నాడు కృష్ణుడు. (125 పద్యగద్యాలు)

ద్వితీయాశ్వాసము :-కృష్ణుడు భార్యలతో, మునులతో, పరివారముతో మిథిలకు బయలుదేరాడు. హూణ, కాశ, కురాశ దేశాలు దాటి కోసలదేశానికి వచ్చాడు. అక్కడ విడిది చేసారు. ఇంతలో ఆమని వచ్చింది. ప్రయాణములోనే కృష్ణుని అంతఃపుర కాంతలు వనవిహారం చేశారు. జలక్రీడలాడారు. వనభోజనాలు చేశారు. సంగీతసాహిత్యాలతో ప్రొద్దుపుచ్చారు. (77 పద్యగద్యలు)

**తృతీయాశ్వాసము** :-స్త్రీలను అంతఃపురములో ఉంచి, బలగాన్నంతా పురప్రాంతాలలో దించి శ్రీకృష్ణుడు గరుత్మంతునిపై మిథిలకు వెళ్లాడు. అక్కడ స్వామివారికి ఒక చిక్కు వచ్చింది. బహులాశ్వుని ఇంటికి ముందు వెళితే శ్రుతదేవుడు వేరుగా అనుకుంటాడు. శ్రుతదేవునింటికి ముందువెళితే బహులాశ్వుడు నొచ్చుకుంటాడు. అందుకని స్వామి ఏకకాలములో రెండురూపాలతో వారి ఇళ్లకు వెళ్లాడు. స్వామిరాగానే బహులాశ్వుడు పొంగిపోయాడు. కన్నీళ్లతో పాదాలు కడిగాడు. సేవలు చేసాడు. స్వామి మెచ్చుకొన్నాడు. విడిది గదిలో స్వామి ఆడువారితో సరసాలు మొదలుపెట్టాడు. చూసినా బహులాశ్వుడు చెక్కుచెదరకుండా స్వామినే సేవించుకొన్నాడు. స్వామి అతని నిష్ఠకు పరవశించాడు.

ఇంతలో చీకటి పడింది. జారులు చెలరేగారు. వెన్నెల వచ్చింది. అక్కడ గోపికలు తమను విడిచిపెట్టిపోయిన కృష్ణుని విరహంలో పడ్డారు. చంద్రదూషణ వగైరాలతో రాత్రి గడిచింది-తెల్లవారింది. (105 పద్యగద్యాలు)

**చతుర్థాశ్వాసము** :-కృష్ణుని భోజనాలకు ఏర్పాటు జరిగాయి. 52 పద్యాలలో విందుభోజనం చేశారు. మిథిలలో తాను పూర్వజన్మలో సీతను పెండ్లి చేసికోవడం గుర్తుచేసికొని, ఆ కళ్యాణకథను చెప్పమని కృష్ణుడు విశ్వామిత్రుని కోరాడు. 58పద్యగద్యాలలో సీతారాముల పెండ్లి జరిగింది. (138 పద్యగద్యాలు).

**పంచమాశ్వాసము** :-మిథిలానగరంలో బహులాశ్వుడు, శ్రుతదేవుల కన్నా స్వామి మెప్పు పొందిన కలానిధి అని కోమటి ఒకడు ఉన్నాడు. అతని తండ్రి రత్నాకరుడు. రత్నాకరుడు కొడుక్కి గుడిసేవ చూడకూడదని చెప్పాడు. కాని కొడుకు ఒకరోజు దానిని చూడనే చూశాడు. ఆ గుడిలో స్వామిని సేవించే వేశ్యలు చాలామంది ఉన్నారు. వారిలో మణిమంజరి అందమైనది. దాన్నిచూసి కలానిధి మనసు పారేసుకున్నాడు. ఆమె పొందు కోరుకున్నాడు. ఆ వేశ్య గురువును పిల్చి, డబ్బిచ్చి ఆమెను కూర్చమన్నాడు. పొత్తు కుదిరింది. ఆస్తి కరిగింది. తండ్రిబుద్ధులు చెప్పాడు. అవి తలకెక్కలేదు. ఒకరోజు డబ్బు లేకుండా వచ్చిన కలానిధిని వేశ్యమాత గెంటివేసింది. తల్లి, తండ్రి ఇంటికి రానివ్వలేదు. డబ్బు పుట్టలేదు. అత్తవారింటికి వెళ్లి కమ్మలు, కడియాలు తెచ్చి సానికిచ్చాడు. అవి అయిపోగానే మళ్లీ వెళ్లగొట్టింది. దేవళం దగ్గర చేరాడు. డబ్బంతా సానికే పెట్టానని బాధపడ్డాడు. నిద్రపోయాడు. కలలో స్వామి అనుగ్రహించి సిరులు అనుగ్రహించాడు. తల్లిదండ్రులు అతనిని తిరిగి ఆదరించారు. (238 గద్యపద్యాలు)

మూడు ముక్కల్లో వ్రాయదగిన ఈ కథను కవి ఆఱువందల పైచిలుకు (683) పద్యాలలో వ్రాశాడు. కథకాని ఈ కథను కవి ఎంతో నైపుణ్యంతో కథనం చేసి రసవంతం చేశాడు.

ప్రథమాశ్వాసము అంతా కవి స్వకపోల కల్పితమే. ఋషులతో కృష్ణుడు బహుళాశ్వుని దగ్గరకు వెళదాము అని మాత్రమే మూలము. దానిని కవి సీరియల్‌లాగా సాగదీశాడు. నాటి సాంఘికవిషయాలను చాలా చెప్పాడు. తన కాలమునాటి సమాజాన్ని బాగా చిత్రించాడు. ఆ రోజులలో మాన్యులకైనా, సామాన్యులకైనా సభాప్రవేశంకాని, రాజదర్శనంకాని అంత సులువుగా దొరికేది కాదు. అందువలననే కృష్ణుని సందర్శనానికి వచ్చిన ఋషులకు కూడ కవి సులువుగా దర్శనం చేయించలేదు. నాటి పద్ధతుల ననుసరించి వారిని చావిడిలో ఉంచి సచివుడు వచ్చి పిలిచిన తర్వాతే దర్శనం కల్పించాడు. ప్రభుదర్శనానికి వెళ్లే ఋషులు ఇలా జాగ్రత్త పడ్డారు.

సీ. ప్రభుగోష్ఠి వేగిరపడకు విశ్వామిత్ర!
వాల్మీకివాణిలో వత్తుగాని!
భరత ప్రపంచంబు హరి యెక్కడదుగునో
జడియక యుత్తరం బిడుము పులహ!
యొక్కచోఁ దర్కోక్తిఁ ద్రొక్కుడు వడుదీవు
తెచ్చుకో నెమరున కిచ్చ వత్స!
యొక్కొకరె ప్రసంగ మొసఁగెడుచోఁ గొంద
అడ్డ గట్టిలు వల దత్రి మౌని!

గీ. శాస్త్ర సాహిత్యములు మాకె చాల జితమ
టంచుఁగలగూరగంప సేయకుము బాద
రాయణ! కవిత్వ సందర్భ రసము నిలుపు
మనుచు దౌవారికా ద్వార మపుడు దాఁటి. (బహు. 1-110)

తన కాలంనాటికే ప్రసిద్ధమైన వ్యాసుడు భారతాన్ని కలగూరగంప చేశాడన్న భావనను కవి ఇక్కడ చూపించాడు. భరతప్రపంచము (నాట్యశాస్త్రము), తర్కోక్తి, శాస్త్రసాహిత్యాలు, కవిత్వ సందర్భరసాలు ఇవన్నీ దామరల కవి వ్యాసంగాలు. వీటిని ఆ ఋషులకు ఆపాదించి ఇక్కడ కూడ కవి తన ముచ్చట తీర్చుకున్నాడు. ఒకవిధంగా చూస్తే విద్యలతో, కవి గోష్ఠులతో ప్రొద్దుపుచ్చే దామరల కవి దగ్గరకు వచ్చే ఆశ్రిత కవి పండితుల హడావుడి కూడ ఇదేనేమో నన్పిస్తుంది.

ద్వితీయాశ్వాసమంతా కూడ కవి స్వకపోల కల్పితమే. మిథిలకు ప్రయాణమైనాక దారిలో కృష్ణబృందానికి కోసలలో విడిది. వృద్ధగౌద్ధాళికుడు ఫలపుష్పాలను తెచ్చి కృష్ణునికిచ్చి వనవిహారానికి రమ్మనడంతో ప్రారంభమై సంగీతసాహిత్యాలతో ముగుస్తుంది.

అంతఃపురకాంతలు, చెలులు వనవిహారములో ఏ విధంగా లీనమయ్యారో చూడండి.

చ. చిలుకలలోనఁ జిల్కలయి చెల్వఁపుఁబొన్నలలోనఁ బొన్నలై
యలరులలోనఁ దామలరులై నునుదీవలలోనఁ దీవలై
తలిరులలోనఁ గెందలిరుతండములై మృదువాణు లగ్ర్యనా
భులు దరహాస లుజ్జ్వలవపుల్ మధురాధర లాటలాడుచున్॥ (బహు. 2-38)

ఈ పద్యాన్ని చూడగానే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "ఆకులో ఆకునై, పూవులో పూవునై"- అన్న భావగీతం చప్పున స్ఫురిస్తుంది. దామరలకవి దేవులపల్లికి ఒరవడి పెట్టాడా అనిపిస్తుంది. అయితే ఆ పూర్వకవి తాత్పర్యము వేరు-ఈ అభ్యుదయకవి ఆర్తి వేరు. ఇద్దరూ భిన్నకోణాలలో తమ పద్యాలను రసవంతము చేశారు.

తృతీయాశ్వాసములో కృష్ణుడు గరుత్మంతునిపై మిథిలకు బయలుదేరాడు. ఆకాశవీథిలో గరుత్మంతుని విన్యాసాలు చూడండి-

సీ. చుట్టువేడెము బట్టుచూపుచోఁ గడగట్టి
ఘటకారచక్రసంగతి భ్రమింప
నడ్డవేడెంబింత యిడ్డవేలుపుఁజెట్టు
పన్నగ గమన సంపదలఁ గదల
నట్టు నిట్టు దువాళి హవణింప నాసులోఁ
గ్రోవి నా వలిమెట్టు గునిసియాడ
జోదనల్ జూఁటించుచోఁ గవ్వపుంగొండ
వెనువెంటఁ బట్టి చెందనువు మొనప

గీ. నిడివి నడతెంచు చోటను జడద పటలి
గాలిపటముల రహిఁదెల్ప గగనవీథిఁ
బలుఁగు బొల్లఁడు గాద్పు చాద్పున జగంబుఁ
జౌరఁజాలు గరున్మరు జ్జవము నెఱపె. 3-6

చుట్టువేడెము, అడ్డవేడెము, దువాళి, జోదన- ఇవన్నీ గుఱ్ఱపు నడకలలోని భేదాలు. ఈ పదాలకు సీసపాద ద్వితీయార్ధములో అర్థాలున్నాయి. చుట్టువేడెము అంటే-కుండలు తయారుచేసే చక్రభ్రమణమువంటి గుఱ్ఱపు నడక. అడ్డవేడెము అంటే-పామునడక వంటి గుఱ్ఱపు నడక. దువాళి అంటే-ఒకే వేగముతో పరుగెత్తడం. జోదన అంటే-నేల తగలకుండా నాలుగుకాళ్లు గాలిలో లేపి పరుగెత్తు అశ్వధార. ఈ ఫీట్లన్నీ పులుగుదొర గాలిలో చేసాడు. వాటిని మనసులో ఊహించుకుంటే మనోహరంగా కన్పిస్తాయి. ఈ అశ్వగతులన్నీ ప్రభావతీప్రద్యుమ్నములో కూడ కన్పిస్తాయి. ప్రభావతిప్రద్యుమ్నకావ్యములో ఇంద్రుడు ఆకాశవీథిలో మాతలిరథం తోలుతూ ఉంటే ద్వారకానగరానికి వస్తూ నగరవర్ణన

చేస్తాడు. వేంగళభూపాలుడు ఆ మూసలో పడి కృష్ణునిచే మిథిలానగర వర్ణన చేయించలేదు కాని, అక్కడ రాముడు శివధనుస్సు విఱిచినచోటు, సీతను పెండ్లిచేసుకొన్న ఇల్లు చూపించి పాఠకులను పులకరింపజేస్తాడు.

ఇంకా ఈ ఆశ్వాసములో సూర్యాస్తమయము, చంద్రోదయము, నక్షత్రాలు, విరహవర్ణనలు, ఉషోదయాది వర్ణనలు విపులంగా చేయబడ్డాయి. ఇందులో శబ్దార్థాలంకారాలు ఒకదానితో ఒకటి పోటీ పడ్డాయి.

చండకర(సూర్యుని) సైన్యము, అక్కడక్కడ వండుకొన్న తెల్లరాళ్లు లాగ నక్షత్రాలు (3-51)న్నాయట. ఇది ఆ కాలంలో యుద్ధానికి దూరప్రాంతం వెళ్లే సైనికులు దారిలో రాళ్లుపెట్టుకొని అన్నం వండుకొని తినే సందర్భాన్ని స్ఫురింపజేస్తుంది.

91వ పద్యములో శీతాంశు సారంగ శృంగరంధ్రీకృతాచ్యుత జాండ ఘటలిప్త సుధయనంగ (చంద్రునిలోని జింక కొమ్ముతో బ్రహ్మాండమనే కుండకు రంధ్రము చేయగా కారిన అమృతములాగ) వేగుచుక్కను కవి తెల్లగా వర్ణించాడు. వేగుచుక్క శుక్రగ్రహము. నవగ్రహస్తోత్రములో 'హిమకుంద మృణాళాభం'-అని శుక్రగ్రహము వర్ణింపబడింది. అందుకు అనుగుణంగా కవులు కూడ-'అరుణాగ్ర నిబిడ వాద్యములలో ఁగనుపట్టు సమయశాఖికు చేతి శంఖమనఁగ' (మనుచరిత్ర 3-54) అనీ, -'వెన్నెల ముసుంగు దొలఁగ మేల్కొన్న తూర్పు కలువకంటి వజ్రంపు ముంగర యనంగ' (చంద్రాంగదచరిత్ర 5-114) అనీ, - 'వెండి గుండన నుదయించె వేఁగు'జుక్క' (తపతీసంవరణము3-104) అనీ వేగుచుక్కను తెల్లగా వర్ణించారు. కాని పింగళి సూరన-'విస్ఫురితమగు రత్నమోయన'-(ప్రభావతీప్రద్యుమ్నము 5-51) అనీ, ముక్కుతిమ్మన-'కాలఫణ భృత్ భోగోల్లసద్రత్నమై' పారిజాతాపహరణము (2-54) అని వేగుచుక్కను రత్నమని ఎఱ్ఱగా వర్ణించారు. ఈ భేదానికి కారణాలు దురూహ్యము.

చతుర్థాశ్వాసములో కవి భాగవతములోని -'భక్తిఁగావించి పరిమృష్ట బహువిధాన్న/ పాయసాపూప పరిపక్వ ఫలములోలి/ నారగింపఁగఁ జేసె'-(దశమ. ఉత్తర. 1179)-పద్యాన్ని ఆధారముగా చేసికొని, 52 పద్యాలలో విందుభోజనం వడ్డించాడు. నైషధములో శ్రీనాథుడు బువ్వపుబంతి (6-120 నుండి 140వరకు) పెట్టించాక అనంతరకవులు కూడ కొద్దో గొప్పో తమశక్తికొలది బంతికూడు పెట్టారు. వారిలో పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, దామర్లకవులు, కాకమాని మూర్తికవి ప్రసిద్ధులు. శ్రీనాథుడు, పినవీరభద్రుడు నంజుళ్లు (మాంసము) కూడ పెట్టారు కాని దామర్ల కవులు స్వచ్ఛమైన శాకాహారమే వడ్డించారు. నీచు అసలు తగలనీయలేదు. శ్రీనాథుడు నైషధములో ప్రత్యేకముగా వండించిన నూటిడి (నైషధం 8అ) దామర్లకవులలో కనపడకపోవడం విచిత్రం.

పంచమాశ్వాసములో కలానిధికథను ప్రధానకథాసూత్రానికి కవి జారుముడి వేశాడు. అయితే అందులో సహజత్వము, సజీవభాష ముందు ఆశ్వాసాలలో కనిపించవు. అందులో కోమట్ల పిసినారితనము, ఎదుటి అంగళ్లలో కొనబోయేవారిని కంటిసైగతో పిల్చి ఎక్కువ ధరకు అమ్మడం, ఎక్కువ వడ్డీలు గుంజడం, సరుకులను కల్తీచేయడం, క్రొత్తనాణాన్ని పాతనాణెమని, పాతనాణాన్ని క్రొత్తనాణెమని ఇచ్చి తఱుగు తీసికోవడం వంటి ఆనాటి కోమటి బజారు సంగతులను కవి బాగా చిత్రించాడు.

కలానిధి మోజుపడిన మణిమంజరిని 28 పద్యాలలో (5-31 నుండి 58వఱకు) కవి వర్ణించాడు. ఆ కాలపు మోజులో పడి శబ్దాలంకారాలు వాడినా, వాటికి సమాంతరంగా అర్థాలంకారాలను కూడ పోషిస్తూ ఆమె అందాలను ప్రదర్శించాడు.

గీ. ఒడలి జిగిబిగి కడలి, నెన్నడుమఁగట్టు
రామసేతువె యీ రామ రోమరాజి,
కట్టఁదీఱిన దరివైచు గట్లు గుబ్బ
లవలఁ దిరిగెడు సుడి నాభి యనఁగరాదె. (5-40)

ఎడారిలో ఒయాసిస్సువంటిదీ పద్యము. రొటీను కవి సమయాలతో విసిగిపోయిన పాఠకులకు ఈ ఉపమానాన్ని చూస్తే ప్రాణము లేచివస్తుంది. స్త్రీల నూగారును నాచు, పొగ, తుమ్మెదలబారు, లత, చీమలబారులతో పోల్చడం కవి సమయం. కాని ఈ కవి రామసేతువుతో పోల్చి చక్కని చిత్రం గీశాడు. ఆమె ఒంటి జిగిబిగి సముద్రమట. నడుము గట్టట. ఆమె నూగారు రామసేతువట. కట్ట తెగిపోతే వేసే గట్టు రొమ్ములట. అవతల తిరిగే నీటిసుడి ఆమె నాభి అట. ఎంత మనోహరమైన కల్పనాచాతుర్యము. నేను చూసిన ప్రబంధాలలో ఇంత నవ్యతగల పద్యమింకొకటి కనబడలేదు.

మణిమంజరి నాట్యము చేయడానికి వేదికనెక్కినప్పుడు మన్మథుడు ఒరనుండి దూసిన మణికుంతము (మణిఖడ్గము) లాగ ఉందట. కుబుస మూడ్చిన నాగకన్యలాగ ఆమె నగల కాంతి యవనికమీద (5-66) తళుక్కుమందట. కుంతము అంటె బల్లెము, ఈటె అని నిఘంటువులు. కాని ఇక్కడ కవి కత్తి అనే అర్థంలోనే వాడాడు.

మణిమంజరి నాట్యమును వర్ణించుటలో (5-69 నుండి 77వఱకు) కవి తన నాట్యశాస్త్రపరిజ్ఞానాన్ని బాగా చూపించాడు. ఆమె పాటకు మోడు చిగురించిందట. ఉయ్యెల కోపు, నిల్కడ, పుటాలము వంటి నాట్యాభినయ విశేషాలు అతని నాట్యజ్ఞానానికి నికషోపలాలు.

ఈ కలానిధి కథలో కవి ప్రయోగించిన జీవద్భాష కమ్మగా ఉంది.

క. నీవా! నీవని యెఱిఁగిన
నావంటిది తలుపువైచునా! యల్లా

కోవెల బాపడటంచున్
భావించితి దేవరాన - (5-196)

ఇటువంటి పద్యాలే ఆధునిక పద్యానికి బాటవేసిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి ఒరవడి పెట్టినవా అన్పిస్తుంది.

బహులాశ్వచరిత్రనుండి కూచిమంచి తిమ్మకవి తన లక్షణసారసంగ్రహములో సుమారు డజను పద్యాలను ప్రయోగాలుగా స్వీకరించి, కృతికర్త కాకమాని మూర్తికవి అని చెప్పాడట. ఆ విషయం ముద్రిత లక్షణసారసంగ్రహములో లేదు. పోనీ మూర్తికవి ఇంకొక బహులాశ్వవిజయం చెప్పాడా అనుకుంటే ఉదాహరింపబడిన పద్యాలన్నీ దామరల కవిగ్రంథములోనివే. అందువలన ఈ కావ్యాన్ని మూర్తికవి వ్రాసి దామరలకవి పేరుపెట్టాడేమోనని స్థూలదృష్టికి అన్పిస్తుంది. మూర్తికవి గ్రంథాలను ఈ కావ్యముతో తైపారు వేస్తే కొన్ని అనుకరణలు కన్పిస్తున్నాయి. మూర్తికవి పాంచాలీపరిణయము కన్నా బహులాశ్వచరిత్ర పరిణతిస్థాయిలో పక్వంగా ఉంది. ఇందులోని ప్రసన్న సుకుమార శైలి, పదలాలిత్యము, సౌకుమార్యము పాంచాలీపరియణకావ్యములో కన్పించవు. మూర్తికవి ఇంకొకకృతి రాజవాహనవిజయము బహులాశ్వం కన్నా ప్రౌఢమైనది. చేమకూరకవిలాగ ప్రతిపద్యములో, పదములో చమత్కారం సాధించాలన్న తపనతో వ్రాయబడిన ప్రబంధమది. అందులో శబ్దాలంకారాల చపలము బాగా కన్పిస్తుంది. అందువలన శబ్దసౌందర్యము పెరిగి, శయ్యాసౌభాగ్యము, మార్దవము, ప్రసన్నత, నిగ్గుజగ్గు కొరవడ్డాయి. బహులాశ్వకవి ఉపాలంభములలో యమకాలు, శ్లేషలు చెప్పినా అతని వర్ణనలన్నీ అర్థగాంభీర్యాన్ని కలిగి మార్దవముతో ఒప్పారుతాయి.

బహులాశ్వచరిత్రలోని వనవిహారానికి, రాజవాహనవిజయంలోని వనవిహారానికి కొన్ని సారూప్యాలున్నాయి. ఇవి సమాన ఘట్టాలు కనుక ఇందులో కొన్ని సహజంగానే ఒకే విధంగా ఉంటాయి.

సీ. చూడక యీలేదు సూనంబు తిలకంబు
నవమాటరాక కొమ్మనదుగోఁగు (బహు. 2-36)

సీ. వచనోన్నతికిఁ బ్రసవము గోఁగు గనిపించెఁ
గంకేళి నవపదగతి కొసంగె (రాజ 3-110)

ఉ. క్రోవిఁగవుంగిటం బొదివి గోఁగును నూరిచి మాటలాడియున్ (బహు. 2-35)

మ. జలజాక్షీ సురపొన్నయున్ వకుళమున్ సంపంగియుం గ్రోవి వా
విలి గోఁగుం దిలకంబు... రాజ 3-109.

ఇవి కవిసమయాలు కనుక వీటిని అనుకరణలుగా భావించకూడదు. వీటికి మూలము ఈ క్రింది శ్లోకము.

శ్లో॥ స్త్రీణాం స్పర్శాత్ప్రియంగుర్వికసతి, వకుళః సీధు గండూషసేకాత్
పాదాఘాతాదశోకస్తిలకకురవకౌ వీక్షణా లింగనాభ్యామ్।
మన్దారో నర్మవాక్యా, త్పటుమృదుహసనాచ్చమ్పకో, వక్త్రవాతా
చ్చూతో గీతాన్నమేరుర్వికసతి చ పురో నర్తనాత్కర్ణికారః॥

స్త్రీలు నోటితో ఊదుటవలన మావి పూస్తుందని శ్లోకము చెబుతుంది. కాని బహుళాశ్వునిలోను, మూర్తికవి కావ్యాలలోను తాకుటవలన మావిపూస్తుందని చెప్పారు. అందువలన ఈ కావ్యాన్ని మూర్తికవి వ్రాసాడని చెప్పలేము. అయ్యలరాజు రామభద్రుడు (రామాభ్యుదయము 1-190) రామరాజభూషణుడు (వసుచరిత్ర 3-146) మొదలైన కవులు స్త్రీలు తాకుటవలననే మామిడి పూస్తుందని వర్ణించారు. తెలుగుకవుల వైరుధ్యానికి కూడ కారణాలు తెలియవు. సంస్కృతపాఠానికి పాఠాంతరాలున్నాయోమో వెతకాలి.

క. నాళీకాళీ ధూళిమ (బహు. 2-37)
క. నాళీక మధూళీ (రాజ 3-117)
లయవిభాతి. మిసమిసని చన్నుగవ పసలు (బహు. 2-55)
లయవిభాతి. మిసమిసని చన్నుగవ పసలు (రాజ 3-117)

వీటిలో ఎత్తుగడలు మాత్రమే సమానము. భావాలు, సందర్భాలు కూడ వేరుగానే ఉన్నాయి. ఈ పుష్పాపచయములో కూడ అనుకోకుండా ఒకటిగా ఉన్న సందర్భాలు కూడ తక్కువే.

రాజవాహనవిజయములో కవి శబ్దాలపై చూపించిన శ్రద్ధ సన్నివేశముపై చూపకపోవడమువలన వనవిహార జలక్రీడల వర్ణనలలో సందర్భశుద్ధి తగ్గింది. బహుళాశ్వకవి వర్ణనప్రియుడు కనుక సన్నివేశాలు హృదయఫలకముమీద సాక్షాత్కరించునట్లు ఒక క్రమోన్మీలనముతో వర్ణించి రసభరితము చేసాడు.

బహుళాశ్వచరిత్రలోని విందుభోజనానికి, మూర్తికవి పాంచాలీపరిణయములోని విందుభోజనానికి దగ్గర సారూప్యాలున్నాయి. దామరలకవి 52పద్యాలలో (4-4 నుండి 56వఱకు) విందు చేస్తే, మూర్తికవి 27పద్యాలలో (పాంచాలి4-34నుండి 60వఱకు) పెట్టాడు. అంటే దామరలకవి మూర్తికవికి ఇంచుమించు రెండురెట్లు (వనవిహారంలో లాగానే) విందుభోజనము వడ్డించి పాఠకుల కడుపు నింపాడు.

దొప్పలు, దొప్పలకు తగిన అరటాకులు, ఆకులకు తగిన చెంబులు వేయించిన మూర్తికవి వెడల్పుగా నిగనిగలాడుతున్న ఆ ఆకులను చూస్తేనే భోక్తలకు కడుపు నిండదా

అని (పాంచాలి 4-39, 40) మొదట్లోనే నోరూరించాడు. దామరలకవి మరీ ఇంత ఇదిగా వేయించలేదు గాని, వేయించిన ఆకులుగాని, జాళువా దొప్పలుగాని, గిండ్లుగాని బాగానే ఉన్నాయి.

శా. అప్పాబోఁడుల కొక్క రొక్కరికి స్వర్ణాపాత్రముల్ జాళువా
దొప్పల్ గొన్నియుఁ గొన్ని గిన్నియలు గిండ్లుం గూర్చి నల్వంకలన్
గొప్పల్ విప్పులు లేఁతలౌ నరఁటి యాకుల్ వైచి వైచిత్రి రాఁ
జొప్పుల్ గా నడలేర్పరింప హరి కూర్చుండెన్ వధూయుక్తుఁడై. (బహు. 4-7)

మూర్తికవి వైదికులకు ముక్కలిపీట్లమీద, మూర్ఖులకు తగినచోట్ల భోజనాలు (పాంచాలి 4-41) పెట్టించాడు. దామరలకవి భోక్తలందఱు గోవిందుని భక్తులు కనుక ఆ అవసరము రాలేదు.

మూర్తికవి తమ్మిపూల తెలుపు అనిపించే అన్నాన్ని (పాంచాలి 4-43) వడ్డిస్తే, దామరలకవి మల్లెపూల తెలుపు, తమ్మిపూల తెలుపును పరిహసించే కలమాన్నాన్ని (బహు. 4-18) వడ్డించాడు.

మూర్తికవి, దామరలకవి కందను ఒకేరకంగా వండారు. కాకపోతే దామరలకవిలో ఒక దినుసు తగ్గి, మూర్తికవి కందవేపుడే రుచిగా ఉందనిపిస్తుంది.

క. ఉడికిన పిమ్మట మిరియము
పొడిబెల్లము చల్లి యుద్దుపొడి రాలిచి నే
తిడి నెఱ్ఱఁగ వేఁచిన వేఁ
పుడుఁగంద మిళిందవేణి పొందుగ నిడియెన్ (పాంచాలి. 4-47)

క. అందందఁ దిరుగబోఁత ఱు
గం దింపఁగ గుడము నిగుడ ఁగమ్మని నేతం
బొందుగ వేఁచిన వేఁపుడుఁ
గంద ముకుందాదులకు నొకతె వడ్డించెన్. (బహు. 4-13)

మూర్తికవిలా దామరలకవి ఉద్దిపొడి (మినపపొడి) చల్లించకపోయినా పద్యము రుచిగానే ఉంది.

గుమ్మడి దబ్బలను కూడ ఇద్దరూ ఒకేరకంగా వండించి వడ్డించారు.

క. ఇడఁదగిన పులుసు మిరియము
గుడముం గల వేఁడి వేఁడి గుమ్మడి తునకల్
బెడిదంపు రసము గూడఁగఁ
బడఁతుక వడ్డించె నొకతె బడలిక దీఱన్. (పాంచాలి 4-48)

గీ. అమ్లు మారీచ లవణ గుడాదికములు
దండిగా వండి గొప్ప పసిండి గరిటె
వేఁడి వేఁడిది వడ్డించె వేఁడి వేఁడి
నాతి కూష్మాండ ఖండ కాండంబు లోకతె. (బహు. 4-26)

మూర్తికవి చెప్పని గెణుసు వంటి మరికొన్ని పదార్థాలు అదనంగా వడ్డించి దామరలకవి చేతులు కడిగించాడు.

ఈ విధంగా ఒకటిరెండు అనుకరణలు ఈ కావ్యాలలో కన్పిస్తున్నాయి. ఈ కొండను త్రవ్వితే ఇంకా ఇటువంటివి రెండోమూడో అనుకరణలు దొరకకపోవు. అంతమాత్రము చేత మూర్తికవే ఈ కావ్యాన్ని రచించాడని నిరూపించలేము. మూర్తికవి దామరల ప్రభువులకు ఆశ్రితుడు కనుక, అతని ప్రభావము ఆ కవులపై ఉండి ఉంటుందని మాత్రము ఊహించవచ్చును.

దామరలకవి తన కృతిలో అక్కడక్కడా నాటి సమాజాన్ని ప్రతిబింబించినా, మూర్తికవిలా కూనలమ్మకోకలు (పాంచాలి 1-75), కోవెల కుంటకొమ్ములు (పాంచాలి 5-68) వంటి జానపదసంస్కృతిని చూపించలేకపోయాడు. దామరలకవి రాచబిడ్డ కనుక జానపదుల జీవనశైలితో పరిచయం తక్కువ అనుకోవాల్సి ఉంది.

దామరలకవి సంస్కృతాంధ్రాలలో అసమాన పాండిత్యము కలవాడు. శబ్దార్థగుణాలు సమపాళ్లలో ఒప్పారిన ఇతని రచనలోని అచ్చతెనుగు సొగసులు చూడండి.

నేలచెల్వ కూతురు (సీత) 1-8. రెక్కల తేజి (గరుత్మంతుడు) 1-14, పంటవలంతి అల్లుదొర (రాముడు) 1-82, చిగురు విల్తు గురుడు (కృష్ణుడు)2-6, పిట్టదొర (గరుత్మంతుడు) 3-3, పులుగు బొల్లడు (గరుత్మంతుడు) 3-6), గుండు పులుగు (చక్రవాకము) 3-59, చిందువెలది (నర్తకి) 3-59, తొగరాచ ఎండలు (వెన్నెల) 3-61, అలరుంగత్తి దొరయ్య (శ్రీకృష్ణుడు)4-6, ద(త?)ల కందు కాన్పు(?) 4-6, రోకలికైదువదొర (బలరాముడు) 4-14, వెన్నముచ్చిలు వేలుపు (కృష్ణుడు) 4-131, చుట్టుఁగత్తి (చక్రము) 4-131, కమ్మవిలుబోయ (మన్మథుడు) 5-28, కొఱనెలతాల్పు (శివుడు) 3-8 మొదలైనవి.

ఈ కవి అచ్చతెలుగు పద్యాలను కూడ సులభగ్రాహ్యంగా శ్రవణసుభగత్వముతో వ్రాసిన తీరు అద్భుతము. మచ్చుకు ఒకటి చూడండి.

సీ. కొలువు లోపలఁ బంట వలఁతి కన్నియ పెండ్లి
కొడుకు పేరెన్నిక విడని వాఁడు
తలఁపులోఁ దవిసి బిత్తరి ఆలివగ త్రోపుఁ
దెలుపు జేజే నిల్పు తలఁపు వాఁడు

పలుకులో మున్నీటి జలుకుటీగిలకోరి
బల్లిదుకత వల్కు బమలవాఁడు
నిదురలో హొంబట్టు నెతికట్టు రావేల్పు
వలచుట్టు జోహారు కలలవాఁడు
తండ్రిపేరిటి దొరబిడ్డ తగులమునకు
విల్లు విఱిచినమేటికి విన్నవించు
కబ్బముల వాఁడు నీవన నుబ్బువాఁడ
తండ పో దేవరకు నమ్మఁదగినబంటు. (బహు. 1-119)

ఇందలి జానుతెనుగు సంస్కృతాన్ని వినడానికి అలవాటుపడ్డ చెవులకు కూడ ఆసక్తిని కలిగించేంత శ్రావ్యంగా ఉంది. ద్వితీయాశ్వాసములో 9,21,22,27, 51 పద్యాలు, చతుర్థాశ్వాసములో 80, 101, 102, 103, 105, 109 పద్యాలు, పంచమాశ్వాసములో 169, 174, 214 సంఖ్యలు గల పద్యాలు కమ్మని అచ్చతెలుగు పద్యాలు. పంచమాశ్వాసము 223వ పద్యములో సీసపాదాలను అచ్చతెలుగులోను, ఎత్తుగీతి సంస్కృతపదాలతోను వ్రాసి కవి వైచిత్రిని ప్రదర్శించాడు. ఒకటి రెండు తత్సమాలతో వ్రాసిన అచ్చతెలుగు పద్యాలు బోలెడు.

అచ్చతెనుగుకే కాక తియ్యని తెలుగు నుడికారానికి, పలుకుబడులకు కూడ ఈ కావ్యమొక కిటారు. అందులో కొన్ని చూడండి. కాసు కప్పర(1-11), గింజగిట్ర (1-54), అడ్డగళ్లులు (1-110), కలగూరగంప (1-110), పుణికిపుచ్చుకొను (1-120), ఆటపట్టు (2-34), కత్తులబోను (2-45), చిచ్చఱకోల(2-45), చెట్టాపట్టాలు (2-54), నోరింత కంటె చేయ (2-61), మిట్టిమీనైపడు (2-61), గగ్గులకాడు (2-63), చీమ చిటుకన్న (3-50), నిలువనీడ (3-61), వెలుంగుకత్తులు (3-77), పిట్టితన్నులు (3-79), తోడునీడ(3-82), పువ్వు బిరుదు (3-85), పిడుగుతునక (3-82), ఒక్కొక్క కడివె యాఱులు సేయున్ (4-52), పట్టెడు (4-63), అరకాసు బేరము పెట్టడు (5-6), చెవికొరుకు (5-98), చిల్లరబేరముల్ (5-155), బేరసారము (5-157), చేనుమేయు (5-172) మొదలైనవి.

ఇన్ని తియ్యని పలుకుబడులు వాడిన ఈ కవి జాతీయాలు, సామెతలను మాత్రము పొదుపు చేశాడు. మచ్చుకు కొన్ని -

నాలుక చేదుదరము మట్టేలాడునటంట (3-64), సత్రపు కూటికి మాధురీ మహిమ కూడదు (3-67), కూయఁగఁ బట్టి గొంతుకలు కోయుట (3-83), భగీరథ ప్రయత్నము (4-61), వచ్చెన్ బ్రాణంబు (5-30), నీళ్లుం గట్టెలు మోయించు (5-55), కంచపు పొత్తు (5-87), పేను జూచు జగడంబులు (5-90), మూసిన ముత్తియంబు (5-100),

చేపట్టు కుంచము, రాజుల చేతి నిమ్మకాయ (5-120), ఉద్యోగ రాఘవుడు (5-134, 151), అడగని వానిదె పాపము (5-149), చేయెక్కడాడె (5-159), కుంచెడు కుంచము కూడ బెట్టినన్ మంచము మాయ సేసె (5-162), కడుపు చుమ్మలు చుట్టెన్ (5-199), రెంటికి కొఱగాని తొంటి రేవణుడయ్యెన్ (5-210), నూటికి నొక్కటియైన (5-222).

వీటిలో సామెతల కన్నా జాతీయాలే ఎక్కువ. అందులో ఉద్యోగరాఘవుడు అరుదైన జాతీయము. దీనిని కార్యసాధకుడు అనే అర్థంలో వాడుతుంటారు. ఇందులో కొన్ని నిఘంటువుల కెక్కని పదాలు కూడ ఉన్నాయి. అందులో కొన్ని-

1) పులుగు బొల్లడు (3-6) గరుత్మంతుడు. 2) ఖల్లావు తోయము (3-45) (3) తమత్రాణము (3-85). (4) శిఖరి (4-32)-పర్వతమని నిఘంటువులు. కాని ఇక్కడ భక్ష్యవిశేషము. (5) గురుంగూర (4-46). (6) వల్పుటకలి (4-73) (?), (7) విచికిలము (4-120)-మల్లెపువ్వని అర్థం. (8) హణాచి (5-13). (9) తిరుపరి, హణ (5-78). (10) కనకై (?) 5-50. (11) కోడి కోక పాకము (?) (5-50). (12) శబ్దము (5-77) నాట్యవిశేషము. (13) తిరుపరి పట్టము, తిరుపరి పాత్రలు (5-78). (14) రవలి దండలు (5-138). (15) కరాబి (5-188) (16) పంకాలు (3-41). (17) పిత్తితన్నులు. (3-79).

ఈ కవి ప్రయోగించిన కొన్ని విలక్షణ ప్రయోగాలు :-

1) దున్నుక-(1-41) (బాల.క్రియా.60). (2) మఱని (మఱువని అనుటకు) (1-92). 3) తలయన్నుయ్యేల (2-32) ద్రుతద్విత్వసంధి 4) తలంచవీవు (3-32) బాల.వ్యాకక్రియా 90. (5) లేకెండకు (లేక+ఎండకు) 3-32. (6) మళ్లి (మరలి అనుటకు) 3-50, 5-191. (7) తామరందంపు (తామర+అందంపు) అకారసంధి 4-6 (8) తోడాకలి (తోడు+అకలి) 4-14 (9) ఊర్గాయల్ (ఊరగాయలు అనుటకు) 4-48. 10) మిరెపు (మిరియపు అనుటకు) 4-50 11) నిర్మలచేతులు (దుష్ట సమాసం) 4-54. 12) ఉంటాదారిన్ (ఉంట+ఆదారిన్) 4-126. 13) గౌరవముకై (నగాగమ లోపము) 5-74. 14) స్నేహింప (5-120) 15) జగడించు (5-188). 16) సిగంది (సిగ+అంది) 5-142. 17) దేవరరగు (దేవర+అరగు) 5-200 (18) వింతంచు (వింత+అంచు) 5-204. (19) దువాలించన్ 5-219 (బాల.క్రియా.90)

విడకు (5-120, పిలన్ (పిలువన్ అనుటకు) 5-192, 217, అంతెకాదు (5-211), ఇది తేవోయన్న (5-212), పిలదాయె (పిలువదాయె అనుటకు) 5-217, చందెంతురు (5-231) మొదలైనవి వ్యాకరణ మంగీకరించిన స్వచ్ఛంద ప్రయోగాలు.

పంచమాశ్వాసములోని శ్రీరామదండకము (5-225) దామరలకవి సంస్కృత

పాండిత్యానికి నికషోపలము. వేశ్యకు పర్యాయపదముగా 'సతి'ని నాలుగుచోట్ల (5-92, 95, 142, 47) ప్రయోగించడము ఔచిత్యమనిపించుకోదు. శ్రీనాథుడు, పెద్దనలు కూడా ప్రయోగించారని సమర్థించవచ్చుకాని అది ఉచితమనిపించుకోదు.

దామరలకవి రుచులు కూడ ఎన్నదగినవే. 52పద్యాలలో విందు భోజనం వడ్డించినా అతనికి అరటిముక్కలు చక్కెరలో అద్దుకొని తినడమే ఇష్టము. కావ్యములో రెండుచోట్ల (2-70, 5-107) దీనిని పాత్రల కాపాదించాడు.

ఉత్తరహరివంశము, మనుచరిత్ర, వసుచరిత్ర, పాండురంగమాహాత్మ్యము, నైషధము కావ్యాలలోని కొన్ని పద్యాలకు అనుకరణ పద్యాలు కొన్ని ఈ కావ్యంలో ఉన్నాయి. విస్తరభీతి వలన వాటిని ఉదాహరించలేకపోతున్నాను.

**పూర్వముద్రణ-పునర్ముద్రణ.**

ఈ కావ్యము మొదట సరస్వతీ పత్రికలో సీరియల్‌గా వచ్చింది. తర్వాత 1906లో ఆ పత్రికాధిపతులు కీ.శే. కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావుగారు తమ సరస్వతీ ముద్రాక్షరశాల (కాకినాడ)లో గ్రంథరూపములో ముద్రించారు. తర్వాత దీని నెవరూ ముద్రించలేదు.

ఆనాడు వారికి దొరికిన తాళపత్రప్రతి సంస్కృతాంధ్రభాషావివేకము లేనివారికి చదవడానికే దుర్లభమైనంత తప్పులకుప్పలతో నిండి ఉంది. వారు దానిని ఎంతో శ్రమించి సంస్కరించారు. దీనికి ప్రాచ్యలిఖితభాండాగారము (చెన్నై)లో బ్రౌన్‌దొరగారు తాళపత్ర ప్రతులనుంచి వ్రాయించిన కాగితపు ప్రతులు డి588, డి589 సంఖ్యలతో రెండున్నాయి. ప్రథమ ముద్రాపకులీ ప్రతులనెఱుగరు. నాటి ముద్రాపకులు తమకు దొరికిన తాళపత్ర ప్రతి శిథిలమైనందువలననో లేక అర్థంకాక వదిలిపెట్టుటవలననో కొన్ని పద్యాలు లోపించి ద్వితీయాశ్వాసము నుండి పద్యగద్యల సంఖ్య ఇవ్వలేదు. అధోజ్ఞాపికలు గాని, పాఠాంతరాలు గాని లేవు. గ్రంథము మొత్తము 98పుటలు. అచ్చుతప్పులున్నాయి. తప్పొప్పుల పట్టిక లేదు. 500 ప్రతులే ముద్రించారు. నేడు ఈ ప్రతులు కూడ అంత సులభంగా లభించవు. అందువలననే కాబోలు కవి చరిత్రకారులు తప్ప ఇతరులెవ్వరూ ఈ కావ్యముపై వ్యాసాలుగాని, విమర్శలుగాని, పిహెచ్.డీలుగాని చేసినట్లు లేదు.

మద్రాసు లిఖితప్రతులను సంప్రదించుటకు అవకాశము లేకపోవుటవలన బ్రౌణ్యము, సూర్యరాయాంధ్ర నిఘంటువు, చిన్నయసూరి నిఘంటువు, (సూర్యలో ఇచ్చినవి), లక్షణ గ్రంథాలలో ఉదాహరించిన పాఠాలను ఈ ముద్రణలో పొందుపరిచాను. వీటిలో కొన్ని చక్కని పాఠాలున్నాయి. కొన్ని చక్కని పాఠాంతరాలు. మచ్చుకు కొన్ని ఉదాహరిస్తాను.

వేశ్యమాత కలానిధి పంపిన విటుకానుకలు చూచి వీటినెవరు పంపారని మణిమంజరిని ఇలా అడుగుతుంది-

క. ఎవ్వరు దెచ్చిరొ కస్తురి
దువ్వట మీ అవికె వెలవతులు సవరంబీ
జవ్వాది-యన్న........ (5-119)

'వెలవతి'- అంటే వేశ్య. ఇక్కడ అర్థము లేనిదీ పాఠము. సూర్యనిఘంటువు 'దువ్వటము' పదము దగ్గర 'నెలవతులు' అను పాఠముతో ఈ పద్యాన్ని ఉదాహరించింది. దీని అసలు రూపము నెలవత్తి. రూపాంతరము నెలవతి. అంటే పచ్చకప్రపు పలుకులు. ఇది కలానిధి పంపిన కానుకలలో ఒకటి. కనుక సూర్యపాఠము సరైనది.

కలానిధి డబ్బంతా దోచుకొని అతనిని వెళ్లగొట్టే సందర్భములో వేశ్య 'నువు ఎదురిం'టి దానిమీద మనసు పడ్డావు. దానిదగ్గరకు వెళ్లు' అని తిట్టిన సందర్భములో-

గీ. దొమ్మరుల వీడొ పల్లి కూటమ్మొ మయిల
సంతొ బెస్తల సాలొ జాజంపు గట్టొ
రచ్చ కొట్టంబొ తన మందిరంబు నీకు........ (5-206)

అంటుంది. ఇక్కడ జాజంపు గట్టు సందర్భపాఠము కాదు. జాజము అంటే పాలికలలో పోసిన నవధాన్యాల నారు. ఇది దొమ్మరుల వీడు. మైలసంత, బెస్తలసాలలతో సంవదించదు. జూజము-పదము దగ్గర చిన్నయసూరి నిఘంటుపాఠమని సూర్యనిఘంటువు-'జూజంపు గట్టొ' అను పాఠమిచ్చింది. జూజము అంటే ద్యూతము అని అర్థము. ఇది సందర్భానికి తగిన పాఠము.

రాముడు పెండ్లికొడుకై నగరవీథులలో యేనుగుపై ఊరేగునప్పుడు ప్రజలు బాణసంచా కాల్చారు. ఈ సందర్భములో పాఠము ఇలా ఉంది.

మ. ద్యుమణింబోలిన పంజులుం బగలు వత్తుల్ మంచి యాకాశబా
ణము వింజామర క్రోవులుం బిరుదులున్ బ్రహ్మాండమున్ నిండఁగన్ (4-75)

బ్రౌన్ ఇక్కడ "వింజామరుటావులున్ బిరుసులున్" - అను పాఠమిచ్చి వింజామరుటావులు- బాణవిద్యలో భేదము అని అర్థం చెప్పాడు. సూర్యనిఘంటువు 'వింజామరక్రోవి'-పదము దగ్గర వింజామరు క్రోవులున్ బిరుసులున్- అన్న పాఠాన్ని చూపించి రాజవాహనవిజయమునుంచి 'వింజామరక్రోవుల చాలుం' అన్న ప్రయోగాంతరమును చూపించింది. కాని రాజవాహనవిజయముద్రిత ప్రతిలో-

క. పంజులును పగలు వత్తుల
పుంజము లాకాశ బాణములు చేబిరుసుల్
వింజామర కోవుల చా
లుం జెలువు వహించె లోకలోచనములకున్. (5-62)

– 'వింజామర కోపు'– అను పాఠమున్నది. వింజామరవత్తులు అని అర్థం చెప్పింది.

బ్రౌన్ చెప్పిన 'వింజామరు టావు' లకు ప్రయోగాంతరము దొరకలేదు. అందువలన సూర్యపాఠాన్ని ప్రధానపాఠంగా స్వీకరించి, బ్రౌనుపాఠము పాఠాంతరముగా చూపించాను. రెండు నిఘంటువులిచ్చిన 'బిరుసు'– పాఠాన్ని (అంటే ఒకవిధమైన బాణసంచు) ప్రధానపాఠంగా స్వీకరించి 'బిరుదు' అన్న ముద్రిత పాఠాన్ని అడుగున చూపించాను.

ఈ విధంగా సాధుపాఠాలను ప్రధానపాఠముగా స్వీకరించి, కాదని తోచిన వాటిని పాఠాంతరాలుగా చూపించాను. అందువలన విజ్ఞులు తమకు నచ్చిన పాఠాలను స్వీకరించగలరు.

కూచిమంచి లక్షణసారసంగ్రహములో ఉదాహరించిన క్రింది పద్యాలు ముద్రిత ప్రతిలో లేవు. శైలిని బట్టి చూస్తే ఇందులోవే అన్పిస్తున్నాయి, చూడండి –

క. ఒకమాట చక్కెరల పా
నకమా చనుసోరు సౌమనస కందుక మా
తృకమా యానాతుక మా
నికమా మొకమా సరోజినీ రిపురకమా (లక్షణ 1–46)

ఇది మణిమంజరి వర్ణనలోనిది కావచ్చు. అందువలన 5వ అశ్వాసములో 58వ పద్యము తర్వాతది అగునన్న భావనతో అధోజ్ఞాపికలో చూపించాను.

సీ. సికపువ్వుటెత్తు తావికి వెంటఁబడు తేంట్ల
ఝుంకృతి మాధవస్వనముగాఁగ (లక్షణ 1–41)

ఇది వనవిహారానికి వస్తున్న సత్యభామ వర్ణన కావచ్చు. అందువలన 2వ అశ్వాసములో 22వ పద్యము తర్వాతది కావచ్చునన్నఊహతో అధోజ్ఞాపికలో చూపించాను. పండితులింకనూ పరిశీలింపగలరు.

పూర్వముద్రణలో కొన్నిచోట్ల యతులు పోయాయి. చూడండి –

1) చల్లగా ద్దుల దిట్ట దతిమెట్ట నీదుగాని (2–65)

– దీనిని 'నిడదు'గా సవరించిన 'లడయో రభేదః' అన్న సూత్రం ప్రకారం 'ల'కు, 'ద'కు ప్రాసయతి కుదురుతుంది. దీనిని అప్పకవి అంగీకరించకపోయినా కస్తూరిరంగ కవి అంగీకరించి నృసింహపురాణంనుంచి, అథర్వణాచార్యుల భారతంనుండి ప్రయోగాలనిచ్చి సమర్థించినాడు. ప్రభావతీప్రద్యుమ్నము 1–57, ఉద్యోగపర్వం 1–220, భీష్మపర్వం 1–93, నైషధము 4–24 లలో ఉన్న ఈ ప్రయోగాలను పరిష్కర్తలు దిద్దారు.

2) నవ రాట్కపాల మాలికలనంగ (3–51)

3) క. ఇలతేఁడు బాదరాయ

వ్యలఘుప్రౌఢిమ నటుందు మనియెన్ మనియె (1-120)

ఇందులో పాదాంతమాత్ర లోపించింది. కావున 'మనియె'- ను 'మనియెన్' అని సవరించాను.

4) చక్రవాకావలోకోత్సవంబు నెఱపె (3-99)

దీనిని - "చక్రవాకావలోకనోత్సవము నెఱపె" - అని సవరించాను.

పూర్వముద్రణ కిది యథాతథంగా పునర్ముద్రణమే. అందలి అచ్చుతప్పులను దిద్దాను. ఇంకొన్ని సవరణలు చేశాను. వాటి వివరాలు -

1) క. ప్రౌఢ కలకంఠి చేరిచె
నాథక సూపంబు నృహరి హరివాణమునన్ (4-16)

ద్వితీయ పాదములో 'హరివాణమున్' -అనుటతో ఛందస్సు పోయింది. అందువలన 'హరివాణమునన్' - అని దిద్దాను.

2) క్రొంజాళువా, తేకుంజందపు దారబందపు సిరుల్ (4-101)

ఈ శార్దూల వృత్తములో 'దారబంపు'- అనుటవలన ఛందస్సు చెడి అర్థం పోయింది. దీనిని 'దారబందపు' అని దిద్దాను.

3) సీ. గమనదోరుపధానగతిఁ గమ్మయొత్తె నా
నున్న చెక్కిలికాటు క్కునిక్క (5-27)

ఉత్తరార్ధములో ఛందస్సు, యతి రెండూ పోయాయి. దీనిని 'చెక్కిలికాటు లుక్కునిక్క' - అని సవరించాను.

ఇంతకుమించి ఇందులో నా చేయి లేదు. ఇందులో ఉన్న దోషాలు మాత్రమే నావి. గుణాలన్నీ కవికి, పూర్వపరిష్కర్తకే చెందుతాయి. ఇంత చక్కని కావ్యాన్ని వ్యయప్రయాసల కోర్చి ముద్రించిన ప్రముఖపండితులు భూగర్భశాస్త్ర ఉపన్యాసకులు శ్రీ రావిమోహనరావుగారి సౌజన్యానికి రసజ్ఞపాఠకునిగా నా కృతజ్ఞతా పూర్వక వందనాలను అర్పిస్తున్నాను.

ది. 11-11-2009 ఉన్నం జ్యోతివాసు
వేములపాడు.

# బహుళాశ్వచరిత్ర

# బహుళాభినందనములు

శ్లో॥ వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్।
దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥

మా గురుదేవులు కీ॥శే॥ బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు (మధురావిజయ, ఉత్తరహరివంశవ్యాఖ్యాత) పాతిక సంవత్సరాల క్రిందట “నరసింహారావ్! నీవు జీవితంలో బహుళాశ్వచరిత్ర ప్రబంధం తప్పకుండా చదువు” అని ఆదేశించారు. అప్పటినుండి యీ ప్రబంధంకోసం ప్రయత్నిస్తున్నాను. ఈ మధ్య విచిత్రపరిస్థితిలో చిరంజీవి జ్యోతివాసుతో పరిచయం కావటం, బహుళాశ్వచరిత్ర అతనివద్ద ఉన్న సంగతి బయటపడటం శ్రీ కృష్ణపరమాత్మలీలగా భావిస్తున్నాను.

ఇంక మఱొక విచిత్రపరిస్థితిలో జ్యోతివాసును శ్రీ రామోరాగారికి పరిచయం చేశాను. అంతే, చకచకా రామోరాగారు ఈ ప్రబంధానికి సర్వాంగసుందరంగా ముద్రణరూపం కల్పించారు. నాకు మహానందం కలిగించారు.

మన తెలుఁగు సారస్వతోపాసకులకు ఈ ప్రౌఢప్రబంధాన్ని మరల అందించిన వీరిద్దఱికీ నా హృదయపూర్వక బహుళాభినందనములు ప్రకటిస్తున్నాను.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావు

ది. 22-11-2009
గుంటూరు.



శ్రీ దామరల వేంగళభూపాలవిరచిత 'బహుళాశ్వచరిత్రము' నకు పోతనామాత్య ప్రణీత శ్రీమదాంధ్రభాగవతదశమస్కంధోత్తరభాగమున ధర్మపరులు, భాగవతులు అగు బహుళాశ్వ, శ్రుతదేవుల కథాభాగము 1176 నుండి 1200 వఱకున్న పద్యగద్యభాగమాధారముగా నున్నది.

**1176-** **సీ॥ నరనాథ........దేవుడనెడి**

**తే॥ భూసురోత్తము......కర్ముఁడగుచు**

నుండి

**1200-** **చ॥** ఎనయగఁ గృష్ణుడంత.........**బ్రమదాంతరంగుఁడై**

వఱకు

ఇబ్భాగమాధారముగ బహుళాశ్వచరిత్రమును శ్రీ వేంగళనాథుడు 683 గద్యపద్యములతో ఐదాశ్వాసముల ప్రబంధముగ రూపొందించినాడు. ఇద్దానిని కీ.శే. కొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావుగారు 'సరస్వతీ' పత్రికలో ధారావాహికగా ప్రచురించి, పిదప 1906లో పుస్తకరూపములో ప్రథమముగా వెలువరించినాడు.

ఇక్కాలమున ఈ ప్రాచీన ప్రబంధప్రభలు నలుదిక్కుల ప్రసరించ వలెనన్న గాఢకాంక్షతో సేకరించుటయేగాక, బ్రౌను నిఘంటువు, సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దరత్నాకరములను అహోరాత్రములు పరిశీలించి, పూర్వ ముద్రణలో దొరలిన స్ఖాలిత్యాలను సవరించి, కఠోరశ్రమకోర్చి, పాఠపరిష్కరణ గావించి చక్కని 'వాచవి'ని అందించి ప్రబంధపఠనానికి పథమేర్పరిచిన శ్రీ ఉన్నం జ్యోతివాసు మఱిన్ని ప్రబంధాలకు వెలుఁగుదివ్వియ అగుఁగాక. శ్రీ వుయ్యూరివారి చేయూత ఈ ప్రబంధమునకు వికాసమును చేకూర్చినది. ఈ ముద్రణ సుశుద్ధమని తలంతును.

ది. 5-12-09, సంపాదకుడు

చీరాల. **'రామోరా'**

గౌరవసంపాదకులు

'ఆత్మజ్యోతి' ఆధ్యాత్మికవైజ్ఞానిక మాసపత్రిక.

22



శ్రీః

# బహుళాశ్వచరిత్రము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీమద్భూమితనూభవా కబరభూసీమంత సీతాలలం
తీముక్తామణి పేరివిత్తునకు జ్యోత్స్నాకాంత కాంతిచ్ఛటా
భూమంబుం బయిఁజిల్కు తళ్కుమనుచూపు ల్పూచుశ్రీరాముఁడీ
దామర్లాన్వయవేంకటాద్రివిభునిన్ ధన్యాత్ముఁగాఁ జేయుతన్. 1

చ. వసుధకు నింపుగా నజభవప్రియ మౌ వరయుక్తిఁ గాంచి తా
నసదృశలీల రాజగురుఁ డౌజనకు న్వెలయింపఁజేసి య
య్యసమ శరాత్మసంభవమహత్త్వమునందగు లోకమాత సా
రసకరవేంకటాద్రి విభురత్నగృహంబున నిల్చుఁగావుతన్. 2

శా. దుర్గాధ్యక్షుఁడ వైతి విప్పు డణిమాదు ల్గాంటి వే మంచు నా
శీర్గాథ ల్పచియింప నేరిచెద మో శ్రీకంఠ యంచు న్మను
ల్గర్గాదు ల్గిరిపుత్రిపెండ్లి నన వేడ్కం జూచుచూడ్కిం గను
న్భర్గుం డాహవభీము వేంకటమహీపాలున్ దయాశీలునిన్. 3

చ. అమరనదీసమేతకమలాప్తభవారుచి శీతభూధరో
త్తమరమణీయ నీలజలదద్యుతివైఖరి వెల్లదీవిపై
నమరిన సింధురాజతనయాధిపదీపితదీప్తి మీఱుచున్
రమణుని యర్ధదేహమున రంజిలు గౌరి శుభంబు లీవుతన్. 4

శా. వాణీపాణివిపంచి కాకలకలక్వాణాప్తికిం జొక్కి వా
క్ప్రాణేశుం డెద వీణకాయ కుచవిభ్రాంతి న్నఖంబొత్తి బ్ర
హ్మాణీహాసముఁగాంచి కచ్ఛపిసమాఖ్యం దానిపై వ్రాయు గీ
ర్వాణజ్యేష్ఠుఁడు ప్రోచు వేంకటనృపప్రద్యుమ్ను నెల్లప్పుడున్. 5

మ. జగముల్మెచ్చ విపంచి మీటితివి నీ సంగీతసాహిత్యము
ల్పొగడ న్నేర్చునె యొక్క రుండు కఠినంబు ల్తత్పరీపాకము
ల్మగఁ డొక్కింత యెఱుంగనేర్చు ననుబ్రహ్మాణీశు నర్మోక్తికి
న్నగుచుం బయ్యెదఁ జక్కఁజెక్కి కొనువీణాపాణిఁ బ్రార్థించెదన్. 6

మ. నిజదంతప్రసవంబు హస్తమధుపోన్మేషంబు హారావళీ
భుజగవ్రాతలతాసమేతము మదాంభోవారమారందము
న్భుజశాఖాశ్రుతిపత్రము ల్ఘశఫలంబుం గల్గి సొంపొందు నా
గజరాజాననకల్పభూజ మొసఁగుం గల్యాణసాఫల్యమున్. 7

చ. తిరముగ వింట వేవెలుఁగుదేవునిఁ గన్గొని వట్టియాస ని
బ్బరముగ నేగి చేఁగడిమిఁ బట్టిన లావరి నేలచెల్వకూఁ
తురి చెలువంపు తేనియెదతుందుడు కెల్లను దీర్చినట్టి యా
కరువలిపట్టి నాదుమదిఁ గల్గినకోరిక లెల్ల నీవుతన్. 8

సీ. ఘన నాకుభవ భుజంగ ప్రయాతం బెన్ని శుకతాతబింబసంశుద్ధి వొగడి
యలకాళిదాసుని యార్యసన్నుతిచేసి దండి వంశస్థవృత్తము గణించి
యిలమయూరకుమారు లలితసంగతి మెచ్చి బాణపుష్పితలతఁ బ్రస్తుతించి
భవభూతి శశికళాభాసురత్వంబెన్ని మతి ధనంజయు వసుమతి నుతించి
గీ. ప్రౌఢిఁగాంచు కవిత్రయీ ప్రణవమహిమ
సార్వభౌముని పృథ్విభాస్కరుని కాంతి
భీము మత్తేభబలమును సోముహరిణి
నటుల నమరేశ్వరుని వజ్రపటిమఁ దలఁతు. 9

సీ. శబ్ద దరిద్రుఁడై శారదాభ్రముఁబోలుఁ బ్రాసంబు విడిచి సంత్రాసిఁబోలు
నపహృతాన్యాలంక్రియతఁదస్కరునిఁబోలుఁ బృథులార్థ దూరుఁడై పేదఁబోలు
విగళితౌ జస్కుఁడై పగలింటి నెలఁబోలు నవిదిత ధ్వనికుఁడై చెవిటిఁబోలు
పద్యానభిజ్ఞతా భంగిఁ బంగువుఁబోలు భిన్న మాధుర్యుఁడై పిప్పిఁబోలు
గీ. ముక్త సూక్త ప్రసాదుఁడై మూర్ఖుఁబోలు
జీర్ణపాదత నది యోర చెట్టుఁబోలు

లుప్త సముదాయ భావుఁడై లోభిఁబోలు
సుకవి వాసర ధవ దివాంధకవి కుకవి. 10

ఉ. అంగడి యంగడిం దిరుగులాడుటకుం బలువిత్తు లిష్టతిం
బొంగుచుఁ గాసుగప్పరకుఁ బోవుచుఁ బెక్కు పదార్థము ల్గ్రహిం
పంగొఱగాక రోఁతలకుఁ బాల్పడి లిట్టుడికింప వ్రోఁత లె
ల్లంగను కూరగాయకవుల న్సరకించుక సేతురే కవుల్. 11

మ. ఉపమా నైపుణిఁగాళిదాసు లఖిలార్థోత్పాదనాభారవు
ల్సుపదస్థాపనరూఢి దండికవిరాజు ల్జాతివార్తారళో
ర్వ్యపదోజ్జృంభణశబ్ద గుంభనకళాశ్రీనాథులే కాక యే
కపదభ్రామ్యదసంప్రదాయకవులా ఘర్షింప మాబోఁటులన్. 12

వ. అని యిష్టదేవతాప్రణుతియు సుకవిసంస్తుతియుఁ గుకవి నిరాకృతియుం గావించి బహులాశ్వచరిత్ర ప్రబంధనిబంధనంబు సేయసమకట్టి యున్నచో నొక్కనాఁడు మదీయస్వప్నంబున. 13.

సీ. అలమించు నలయించు కళనించు దుప్పటిఁ గట్టువాఁడు బలీంద్రు మెట్టువాఁడు
వక్రంబు నక్రంబు చక్రంబుచేఁ ద్రుంచు కరము వాఁడసుర భీకరమువాఁడు
కందంబు చందంబు నందంబు గాదను మేనివాఁడు భవంబు లేనివాఁడు
లలిగ్రమ్ము వెలిదమ్ములను జిమ్ము కనుదోయి డాలువాఁ డవనిజ నేలువాఁడు
గీ. తేజరిల్లెడు ఱెక్కల తేజివాఁడు
చూపులను భక్తులకు సిరు ల్బాపువాఁడు
రామభద్రుండు కారుణ్యరససముద్రుఁ
డాదరంబున నిట్లని యానతిచ్చె. 14

ఉ. దామర వేంకటప్రభు వతంసుని వెంగళభూప మాపయిన్
శ్రీమెఱయంగఁ గృష్ణకథఁ జెప్పితి విప్పుడు నీదుతండ్రియు
న్నామకభక్తుఁ డాతనికి మాకును భేదము లేదు గాన నీ
వా మహిమాధ్యుపేర బహులాశ్వచరిత్రముఁ జెప్పు మొప్పుగన్. 15

క. అని పలికి చనిన మేల్కని, మనమపు డానందరస నిమగ్నముగా మ
జ్జనకుఁడగు వేంకటేంద్రుని, యనఘుని వంశావతార మభివర్ణింతున్. 16

క. ధునిఁగనియె న్పలితలయు, న్మునిఁగొనియెన్ ఫణిఫణామణీఘృణి ఘుసృణా
ప్తిని మనియె న్మునిపెండ్లికిఁ, బని వినియె న్హరిపదంబు భవ్యము గాదే. 17

క. ఆచరణాంబుజమున నా, రాచరణాచరణచలితరాజన్యుఁడు వా
చాచణయాచకఖేచర, నైచికి శ్రీపాదమనుజనాథుఁడు పుట్టెన్. 18

క. శ్రీపతి పదపద్మమున ఘృ, ణాపటిమ జనించి పద్మనాయకమణియై
దీపొండితి నేపారిన, శ్రీపాదప్రభున కబ్బనృపతి జనించెన్. 19

క. ఉబ్బఁడు లిబ్బులు గలవని, రెబ్బఁడు రిపురాజుఁగాని రేఖల వలరా
యబ్బఁడు పరభామినికై, యబ్బఁడు శ్రీపాదవిభుని యబ్బఁడు ధాత్రిన్. 20

క. అబ్బనృపాలాగ్రణికిం, బిబ్బోకవతీవతంసబిసరుహవిశిఖుం
డిబ్బలియుఁ దనఁగ నీవుల, నబ్బలి యన ధర్మనృపతి యతఁడు జనించెన్. 21

శా. కర్మణ్యావన బద్ధకంకణుఁడు కంఖాణాశ్వరింఖాదళ
ద్దుర్మత్తద్విషదుత్కరుండు కరుణాధుర్యుండు ధైర్యాధునా
భర్మాహార్యము నీతి కార్యమురభిత్పర్యంక మార్యాప్తుఁడా
ధర్మక్ష్మాపతి ధర్మమర్మవిదుఁ డేతన్మాత్రుఁడే ధారుణిన్

క. ఆధర్మనృపతి కుధరమ, హోధృతి వెలిగోటితిమ్మయప్రభుసత్పు
త్రీధన్య వేంగళాంబిక, గాధానిధి ధర్మపత్నిగా నుతికెక్కెన్. 23

వ. ఆ వేంగళాంబికయందు.

సీ. వరదయా దాక్షిణ్య వరదయాదవభర్త వరదయాధీశ్వరవజ్రపాణి
యంగ లాట కళింగవంగలాలితకీర్తి వేంగళాధిప పంచ విశిఖమూర్తి
ఝుమ్మ యానకర వాసమ్మయాస్యవిరోధి తిమ్మయావనితలాధీశమౌళి
దీన యాచక చయాధీనయాచ్ఛవితీర్ణి కోనయాఖ్యనృపాలకువలసఖుఁడు
గీ. నలుగు రుదయించి రరవింద నందనాన
నాంబుజంబుల బలెనె ధర్మాధిపునకు
నట్టి ధర్మధు లెఱుఁగు ధైర్యాంబుధులకు
ధాశరథులా చతుర్యు గాధీశు లెనయె. 25

క. వారలలో వేంగళవసు, ధారమణుఁడు ధాత్రియేలె ధాటీపటహో
దారధణంధణనిధ్వని, ధౌరంధర్యాద్రిదావధావద్రిపుఁడై. 26

సీ. తనపదాతిశయంబు తనపదాతిశయంబు కరణి నాళీకసంగతి నటింపఁ
దనసుదృగ్గరిమంబు తనసుదృగ్గరిమంబు గతిఁ గౌముదీప్రసంగంబు నిలుపఁ
దనవిగ్రహోన్నతి తనవిగ్రహోన్నతికైవడి నసమాస్త్రకలన దెలుపఁ
దనకరస్ఫురణంబు తనకరస్ఫురణంబు ప్రఖ్యాతి సగరవైభవము పూనఁ

గీ. బరిధవిల్లుశరద్విషత్పరివృఢ ప్ర
గాఢ భుజపీఠ కుతశాఖికాభిదా వి
ధా కఠోర కుఠారికాధర్మజుండు
నృపతిదామర్ల వెంగళోర్వీధరుండు. 27

సీ. వనధిజ యెనవచ్చుఁ దనగృహశ్రీయన్నకరమున కందిచ్చి మురియకున్న
సతిఁబ్రతి యనవచ్చుఁ బతి మాఱు మా టాడి సవతికిఁ గ్రిందయి నవయకున్న
వాణి నీ డనవచ్చు వరుమొగంబున వ్రేలియును బెక్కుబాసలు గొనకయున్న
నింద్రాణి సరివచ్చు నెలమి మైఁబలుగాకి వగలబిడ్డని గని వగవకున్న
గీ. నచలగతి పూర్ణచాప మితానులాప
సుస్థిరప్రాభవంబుల సొంపుమీఱు
నెంగళక్షోణిపాలు నర్ధాంగలక్ష్మి
యైన లక్ష్మాంబికాపయోజాక్షి కరయ. 28

ఉ. శర్మఘనుండు వెంగళరసాతలభర్తకు లక్ష్మమాంబకున్
ధర్మనృపాలమౌళి వరదప్రభుచంద్రుఁడు వేంకటేంద్రుఁడుం
దిర్మలశౌరి నల్వురు జనించిరి శ్రీహరిబాహులట్ల చా
తుర్ముఖ వక్త్రముల్బలెఁ జతుర్నిగమంబుల చంద మొందఁగన్. 29

శా. ధర్మాధర్మవిధిజ్ఞ భావవిలసద్ధాత్రీ బుధశ్రేణికా
శీర్మర్యాదలు గన్న దామరల మాశ్రీవేంగళేంద్రాత్మభూ
ధర్మానాయని పూర్ణనాయని సుదృగ్దానంబు వర్ణించుచో
ధర్మానాయని జాలయూధములు గాధల్గాధకు ల్మెత్తురే. 30

మ. శరదంబై శరదంబుద ద్యుతరు రుచ్యంబై జితాఖండల
ద్విరదంబై మురదర్పభేది చరణద్వీపిన్యుదారప్రభా
వరదంబై వరదంతివైరి బలె తేవన్వెంగళేంద్రాత్మభూ
వరద క్ష్మావర దర్పకార్జిత యశోవ్యగ్రం బుదగ్రం బగున్. 31

క. దామరల వేంకటేంద్రుం, దేమఱఁడు మురారి చరణ హిత విస్ఫురణం
బేమఱఁడు వితరణంబున, సామర సన్నాహ శత్రుసంహరణమునన్. 32

క. వేంగళవిభు తిమ్మప్రభుఁ, దంగజ నిభుఁ దధిక సులభుఁ దహిమాంశు నిభుం
దంగ త్రిలింగ వంగక, ళింగంబుల నీడుజోడు లేరు వదాన్యుల్. 33

మ. భయవిభ్రాంతి విజాపురీశుఁ దరిగెం బన్నాలకు న్మల్కయుం
బయిగోవం బడియె న్నిజాము చనియె న్మక్కాపురక్షోణికిన్

గయకు న్వెల్వడె నాగరానగరభూకాంతుండు దామర్ల తి
మ్మయదంతావళఘోటికాభటసముద్య ద్ధాటి సామాన్యమే. 34

చ. తదనుజ యైన లోకహిత ధర్మవిశంకట వేంకటాంబికం
గదనకిరీటి యాచవిభు కస్తురి రంగన్నృపాలవర్యుఁ డిం
పొదవ వరించి కాంచె విభవోజ్జ్వలు రంగయ యాచభూవరు
న్విదితగుణాఢ్యు సింగపృథివీ వరచంద్రుని నక్కమాంబికన్. 35

సీ. ఉత్తరమల్లూరి యొద్ద దావలపాపవిభునిగొట్టిన నాఁటి విజయకలన
తిరుమల చేరి ధాత్రిని మన్నెరాజులఁ బాఱఁద్రోలిననాఁటి బాహుబలము
చెంగలి పట్టు వీక్షించి లగ్గలువట్టి యాక్రమించిన నాఁటి విక్రమంబు
పాలెంబుకోట వెల్పట నాజి యతిరాజు జరగఁజేసిననాఁటి శౌర్యపటిమ
గీ. మున్నెతోపూరు జగ్గరాణ్ముఖుల నొంచి
మధురదొర చెంజిమన్నీని మదమడంచి
తిరిచెనాపలి చొరఁదోలు తేజముగల
మేటి వెలిగోటి యాచని సాటిగలరె. 36

క. ఈమన్నీలం గనుకాం, తామణిపుట్టినిలు దానధర్మదయాల
క్ష్మీమహిమల పుట్టిల్లఁట, దామర్లాన్వయముఁ బొగడఁదగదే ధాత్రిన్. 37

ఉ. ఏచతురుండు సాటి మన యేచన్నృపాలుని మేనమామ యు
ర్వీచిరకీర్తి దామరలవెంగళ భూవిభు వేంకటాద్రి హే
మాచల ధన్విమామ ధృతి నంగజుమామ రుచి న్వితీర్ణిఁ బ
ద్మాచణవక్షుమామ యభిమన్యునిమామ ఘృణాగుణాదులన్. 38

సీ. అంచతేజీ నెక్కి యాడు వాగ్బింబోష్ఠిఁ దాతనాతి యటంచు బూతులాడు
నచ్చ ప్రసూన గుళుచ్ఛ కల్పకపల్లి నందనోద్భవ యంచు నవ్వులాడు
భోగీంద్రశయనాంఘ్రిభూతవాహినిఁ బితామహుని చెల్లెలటంచు మఱియుఁగేరు
శుభ్రాంశులోనున్న సుధఁగాంచి జనక మాతృసహోదరి యటంచుఁ దెగడఁ జూచు
గీ. దామరల వేంగళక్ష్మాధవవతంస
నందనుఁడు వేంకటక్ష్మానాథమౌళి
ధేను ధనధాన్య కన్యకాధిక వదాన్య
తా నియతిఁ గొన్న యసపుబిత్తరి ధరిత్రి. 39

సీ. కడలు ద్రొక్కఁగ నిమ్ము వెడలుటల్దింతుఁబోయలపరాంగన పొందుఁ దలఁపకున్న
వలకులోఁగఁగనిమ్ము వెలకు రానిత్తుఁబో యలపంది దగఁ జెంది నిలువకున్న

వలసి న ట్లాడనీ కలసి వర్తింతుఁబో బహుభుజంగిక్రీడఁ బరఁగకున్నఁ
గూర్మి వేఱొడ్డనీ పేర్మి నాటింతుఁబో *తిరుకుళంబులవారిఁ బొరయకున్న
గీ. ననుచుఁ గరిఁ గిరి ఫణిఁగూర్మమును ద్యజించి
ధరణి తరుణీశిరోమణి తరణితేజు
దామరల వెంగళక్ష్మాధవ తనూజు
భోజనిభు వేంకటక్ష్మాబిడౌజుఁ జేరె. 40

సీ. దాని యన్మాట మాత్రమె కాని వివరింప దెసలకుఁ జేచాచు దిగ్గజంబు
ఘనసంపదల నింపు గనుననుటయ కాని నేలదున్నుక తినుఁ గోలభర్త
పడగలెత్తె ననెడు ప్రఖ్యాతియేకాని గాలివట్టించు నాగకులనేత
కచ్ఛపేశ్వర రూఢిఁగాంచి మించుటె కాని యానుఁ బానీయంబు లాది కమఠ
గీ. మేటి నడ కేటి సౌకర్య మేటి భోగ
మేటి కూర్మి యటంచు నాపాటి రోసి
దామరల వేంగళ క్షమాధవ వతంసు
వేంకటేంద్రునిఁ జేరె నుర్వీవధూటి. 41

సీ. అలరౌహిణేయ గుర్వనఘద్యుతుల మంచు ప్రోదినీధారి వాహరుచి మించుఁ
దారకోదార సత్కాంతిపూరముఁ జించు విశదాబ్దదీధితి వెస హరించు
నతనుశరద్యోతు లనిశంబును జయించు నమరనాగేంద్రధామము హసించుఁ
బంచాస్య శోభాప్రపంచముఁ ద్యజియించు దారదార్చులమీఁద నీరసించు
గీ. బలశశి సురాశ్వ వృషరౌప్య భసితపద్మ
దర కుసుమ కాశ శేష దిగ్దంతి సింహ
శంభు ఘనసార వాణులు జంటలైన
సరియె వేంకటఘనుకీర్తి జాతఘృణికి. 42.

సీ. శ్రీసతీశ్వర వాహ భాసురశ్రీఁ గేరి కమనీయ శరజాత గరిమమీఱి
వెలయు ననంత భా విద్రుమాభలఁ బోరి శుచిభాను వైఖరి సొంపుదేఱి
రమణీయతర మహాగజతకాంతులఁ జీఱి గౌరమణి శ్రేణి సారె దూఱి
హంస మండల సముద్యద్దీప్తిఁ బొల్పారి హరిచక్ర విస్ఫూర్తి నలమఁగోరి
గీ. ధాత్రిఁ దనకీర్తి తారుణ్యధామమహిమ
రహి వహింపంగ మించు సంగ్రామ భీము
వేంగళేంద్రుని వేంకటోర్వీ లలాము
భాగ్యసుత్రాము సన్నుతింపంగ వశమె. 43

*తిరుకొళంబుల-చిన్నయసూరి పాఠము. తిరుకొళము=కోనేరు, పుష్కరిణి.

## నవగ్రహ రత్న రస నిధాన సీసము

సీ. పద్మరాగార్క ప్రభా భయానకమయి హిమకర తారాద్భుతము ఘటించి
నీలాప్తగురుచక్ర నిభరౌద్ర గతి మించి శంఖ వజ్రోత్తమోజ్జ్వలత నవ్వి
విద్రుమాళి ముకుంద వీరకేతువు మీఱి కుందతారామందరోప మూని
రక్తాంగ వరపుష్యరాగ బీభత్సమై కవివిదూరజ సూత్ర కచ్ఛపాసి
గీ. వజ్ర రుచులను గరుణించి వసుధ వెలయు
తన ప్రతాప యశంబులఁ దనరు విబుధ
నుత మహాపద్మ గోమేధిక తరళస్ర
గంగ శృంగారుఁడగు వేంకటాద్రి విభుఁడు. 44

గీ. దామరల వేంకటప్రభు దారమణులు, గుణధరణి యయ్యమాంబిక గురువమాంబ
కేస మాంబికయను సతు ల్భాసమాన, లై సమాఖ్యానిధానంబు లైరి జగతి. 45

సీ. తన సహోదరునభ్యుదయమునకు మొగంబు ముదుఁచు పద్మినులపొందెడసె నేని
నధిపుపై సుమనోమయాంబక వ్రాతంబు నించ నల్లునిఁ బ్రతిష్ఠించ దేని
గలహంబె కూడుగా మెలఁగెడు దేశద్రిమ్మరి పట్టి ధౌర్త్యంబు మాన్పె నేని
దను నుద్ధరించు భూదారునీశుని డించి బలవంతులను గూడఁ దలఁచదేని
గీ. శ్రీసతి సతి సరస్వతి క్షితియువతినిఁ
బ్రతి యనఁగ వచ్చు నా జగన్నుతచరిత్ర
కనుచు సాధ్వులు వినుతింప నవని వెలయు
ననుపమ గుణావలంబ శ్రీయయ్యమాంబ. 46

సీ. అలరుల కొఱుకుఁగా నన్నదమ్ములకుఁ గయ్యంబిడు సత్య సత్యయె తలంప
విభునితో నేకీభవించియు నతనిపై జలము మాన్పని సతి సతియె యరయ
నగ్రజుఁ డొప్పని యతివంచకునికి నాలయిన సుభద్ర భద్రయె గణింపఁ
బతి సమ్మతింపని వ్రత మొనరించు సుశీల సుశీలయె క్షితి నుతంప
గీ. ననుచు వారల చర్యల నపహసించి
సకల బంధు జనంబులు సన్నుతింపఁ
దనరుఁ బతిభక్తి నల యరుంధతి యనంగ
భవ్యగుణపేటి గురువమాంబా వధూటి. 47

చ. స్థిరమతి యైన యయ్యమకుఁ జెన్న మహీశుఁడు కేసశౌరియున్
హరితరుణీసమాన గురువాంబకు వెంగళభూమిభర్తయున్

వరద నృపాలమౌళి మఖవ ప్రమదాసమ కేసమాంబకున్
గిరిధృతి కృష్ణధీరుఁడు జనించిరి కల్పకపంచకం బనన్. 48

సీ. తన భుజా భుజగ ప్రతాపానలమునకుఁ బ్రత్యర్థి కీర్తి పారదము గాఁగఁ
దన ధాటి కారటత్పటహ గర్జ కరాతి పార్థివావలి హంసపటలి గాఁగఁ
దన గంధ సింధురోత్తమముల కరిమస్తకంబు లంబుజ కోరకములు గాఁగఁ
దన పదాంగద పురందర నీలమణికి విద్వేషిభూషణములు తృణము గాఁగ
గీ. వఱలు దామర్ల వంశ పావన చరిత్రుఁ
డాహవకిరీటి యర్థిదైన్యాంధ తమస
భాస్కరుఁడు శోభమాన యశస్కరుండు
చెన్న భూపాలుఁ దరిరాజ సన్నుతుండు. 49

శా. ఘోరాజిం దనతేజిఁ దోలి విమతక్షోణీ తలాధీశులన్
నారాజిం దెగటార్చి వీరభట సన్నాహంబుతోఁ జేరు నా
నారీజాగజ మస్తము న్నఱికి నానావస్తువు ల్గొన్న యా
నారీజాల మనోజు దామరల చెన్నక్ష్మాపు నెన్నందగున్. 50

## గూఢపంచమసీసము

సీ. చాపారిజయధైర్యసత్కృపాధర్మము శరజారి ధరహరి స్ఫురణ మించ
ఘనకీర్తి ధామవా క్కాంతిగాంభీర్యము ల్సన్మిత్ర గురురత్న సరణి మెఱయ
వితరణ నైర్మల్య విభవ ధీ పితృభక్తు లభ్రగంగేంద్రాత్మజాఖ్య నమర
బలభూతి శాంతిరూప పరాక్రమంబులు మరుదీశ్వర కుమార మహిమ వెలయ
గీ. మహినిఁ జెన్నొందు నాహిమ క్ష్మాధరేంద్ర
మలయ నగమధ్య మహిత భూమండ లాధి
పత్య నిత్యశుభావాప్తిఁ బ్రణుతి కెక్కు
వేంకటేంద్రుని చెన్నభూవిభు వరుండు. 51

సీ. ఇన చంద్రములు గాని యిన చంద్రములు గారు జోడు సుధామయశో మహిమల
నచలేశ్వరులు గాని యచలేశ్వరులు గారు సరి సమున్నత ధైర్య శౌర్యములను
గోపవృషు ల్గాని గోపవృషు ల్గారు పురుడు దయాగణ్య పుణ్యములను
జనక మను ల్గాని జనక మను ల్గారు సాటి సన్నయకృత్య సత్యములను
గీ. నే ఘనున కనఁ బొగడొందు నాఘనా ఘ
న స్ఫురద్దాన నిమ్న గాన్వహ వివాహ

నిరుపమానంద సన్మాననీయ వనధి
వేంకటేంద్రుని చెన్న భూవిభువరుండు. 52

సీ. తనకీర్తి విధునిరీతినిఁ బొల్పుగనుటనో కలశ వారాశితోఁ గలసి మెలఁగుఁ
దనసాంద్రధామంబు తరణితీ రగుటనో ద్వీపాంతరంబులఁ దిరుగుచుండుఁ
దనవిక్రమము జిష్ణుననువున మనుటనో యెపుడు సుధర్మాప్తి నింపు గాంచుఁ
దనయాగి సురభి చందమున వర్తిలుటనో సుమనో మనోహర స్ఫురణ మించు
గీ. ననుచు జనులనుదినమును వినుతిసేయ
రాయ సింహాసన సముద్ధరణ ధురీణ
శీల దామర్ల వేంకట క్షితి తలేంద్ర
తనయుఁడైనట్టి చెన్న భూధవుఁడు వెలయు. 53

సీ. చేగలవాఁడంచుఁ జెవులవింటయె కాని నాగేంద్రునకు సువర్ణంబులేదు
కాంచన కటకంబు గలవాఁడనుట కాని గతి లేనివాఁడు నగప్రభుండు
కోల ముల్కుత్యాలు గూర్చునంటయ కాని కిటి పొలంబున గింజగిట్రకరుగు
ఘన సరంబుల వాఁడు కమఠుండనుట కాని శిశుపోషణకై చింత సేయుచుండు
గీ. ననుచు వారల దిగనాడి యవనికన్య
సకల వైభవ సుత్రాము సార్వభౌము
దామరల వేంకటాద్రీంద్ర తనయ సోము
చెన్నభూపాలు భుజపీఠిఁ జెన్ను మీఱె. 54

సీ. మునుమున్న యేరాజు మున్నలి బైళ్ళను వేలూరి లింగ భూవిభునిఁ గొట్టెఁ
బంచ వన్నియ డాలు వట్టించె నేరాజు పరవీర భద్రేభ పటలి రెబ్బి
ధీరత గూఢ లాతూరిలో నేరాజు శాత్రవబలముల సంహరించె
శుక్రవారము నాఁడె చౌరఁబాటీ యేరాజు పాండీని బలముల భంగపఱచె
గీ. నతఁడు సామాన్యుఁడే దామరాన్వ వాయ
కలశ వారాశి పూర్ణరాకా శశాంకుఁ
డనఁగ గడికోట మల్ల శుభాంక యుతుఁడు
వేంకటేంద్రుని చెన్న భూవిభు వరుండు. 55

మ. పరిఘా సౌధ గభీరతోన్నతులచే బల్రాయిడిం జెందియుం
దరియం జాలరు పన్నగామరు లన న్భాసిల్లునాదిప్రవ
ప్రరమ న్వేలురి రాజధానిని దృణప్రాయంబుగాఁ గొన్న య
న్నరనాథాగ్రణిఁ జెన్న భూపమణి నెన్నన్ శక్యమే యేరికిన్. 56

క. ఇలవెలయు నేచభూవరు, చెలియల నల యక్కమాంబఁ జెన్నక్షోణీ
తలపతి పరిణయమయ్యెం, జలనిధిసుతఁ బెండ్లియైన శౌరియ పోలెన్. 57

ఉ. శ్రీసతిగీము దామరలచెన్ననృపాలుని సోదరుండు మా
కేసన కీర్తివాసనలకేసరి కేసరి సౌరనిమ్న గా
గ్రేసరి యాసరిద్వర ధటెంచిన మేటియు వాగ్వధూటి ము
క్తాసరి యాసరీసృప జగత్పతియున్ ధరలోన నెన్నఁగన్. 58

సీ. చదువు పద్యమునఁదా సంఘటించిన శంక కవికోటులకు జిగుర్గండి గాఁగ
గమకింపఁ దాఁ గడకంటఁ జూచిన చూడ్కి హస్తినీశ్రేణికి నలుగు గాఁగఁ
గలని కేతేరఁగాఁ గనిపించు హూంకార మరులకుఁ జంద్రోదయంబు గాఁగ
నవరసంబులకు [1]దానవు దానజాలంబు సరసులకునునైన వరవ గాఁగ
గీ. గురువమాంబా మణీగర్భ శరధి శుభ్ర
కరుఁడు ప్రతిపాదన ప్రధా ధరిత కల్ప
తరుఁడు వేంకట భూజాని తనయ పంచ
శరుఁడు దామర్ల వేంకటేశ్వరుఁడు వెలయ. 59

సీ. తన మేధ [2]చక్రభాదంభ సంభ్రమమున మెండొడ్డు కుండలిఁ గుండలించుఁ
దన ప్రతాపము తిర్య గనుపమ ఘృణి కైతవమున భానుని భువివైచి విడుచుఁ
దన దాన పటిమంబు [3]వనహావరణ మిషోద్ధురతమై నుడుపతిఁ దుడుపువెట్టుఁ
దన కీర్తితమి చతుర్థ ప్రహారవ్యాజగతి ఋక్షవర్ణము ల్గట్టిపెట్టుఁ
గీ. దనగుణము వెట్టులేఖిక దశ చెలంగె
నొక్కొ యొక్కొక చోటుల నుక్కు మిగిలి
విబుధ విబుధాధిపతి గాఁడె వేంకటేంద్ర
సుతుఁడు దామర్ల వేంగళక్షోణి ధవుఁడు 60

సీ. బహు లాబ్దములవాఁడు మహిదారతిలకంబు చేల త్రొక్కుడులనె జిగిఁ దొలంకె
ఘన వర్షములవాఁడు గహ్వరీధరమౌళి కప్పుగండములనె గరిమ దొరలె
ద్విరదనంబునవాఁడు కరియూథనాథుండు మురిపెంపు నడలనె మురువు వదలె
ముసలియై తగువాఁడు మును సరీసృపనేత తెలిగోర సిగలనె తెలివి గలఁగె

---

[1] సూర్యనిఘంటు పాఠము. దానిన – పూర్వముద్రణ పాఠం. యతి తప్పింది.
[2] సూర్యనిఘంటు పాఠము. చక్రిదాదంభ – పూర్వముద్రణ పాఠం.
[3] వనదాహరణ – సూర్యనిఘంటు పాఠము.

గీ. రదక వృద్ధులలోఁ బెద్ద మొదల కమఠ
మూర్మికలనే గొనబు వారి నొల్లననుచు
వసుధ దామర్ల వేంకటేశ్వర కుమారుఁ
బంచ శరనిభు వేంగళప్రభు వరించె. 61

సీ. సత్కులంబును సుప్రజము గొన బుధజాల మునకిచ్చి క్రమ్మఱఁ గొనెడు వాని
దను వేఁడు సుమనఃప్రభుని శక్తిఁ గైకొని వీడుకు వీడొదవించు వాని
సర్వజ్ఞుఁడగు నాత్మసఖునకు దుర్వర్ణ మగువాస మొసఁగిన యట్టి వాని
గోత్ర వర్గములచేఁ బత్రము ల్గొని యప్పు లిచ్చుటకై చరియించు వాని
గీ. రాజు రారాజు చెలియును రాజరాజు
ఘనుఁడు ననుబెట్టు లంచు నకారణోప
కారముగ నర్థ మొసఁగును ధీరతతికి
మనుజ మాత్రుండె వెంగళక్ష్మావరుండు. 62

మ. కలనైనం దరమింత పూన కడకింకై యొగ్గఁ డొక్కింత కో
కలు బంగారము చేసికోఁ దదికినం గాంచిం గరంబస్తిగా
నిలకుం దెల్పఁగఁ బోఁడు కంచివరదుం డెట్లోపు దామర్ల వేం
గళ భూనాయకు వేంకటాద్రి వరదక్ష్మానాథుతోఁ బోలఁగన్. 63

శా. కృష్ణాగౌతములం బ్రసిద్ధములు కోకీ బాంధవ ప్రోద్భవా
కృష్ణాకార నికారణ ప్రకటము ల్కృష్ణార్వ గర్వచ్ఛిదల్
[1]కృష్ణాపదరదోర్ధరాభిమతము శ్రీవేంకటాధీశు మా
కృష్ణాధీశ్వరు కీర్తిచంద్రికలు చంద్రీభూత ఖద్యోతముల్. 64

క. ఈపుత్రులఁ గను వేంకట, భూపాలకుఁ దతఁడు వెలయుఁ బుడమిని నుద్య
చ్చాప లతారోప శతా, టోప హతారాతి భుజపటు ప్రాభవుఁడై. 65

క. ఏతాదృశ శుభ చర్యున, కాతత భుజశౌర్యునకు మహౌదార్యునకున్
వాతాశన జాతాసన, జాతాభినవ ప్రతాప చాతుర్యునకున్. 66

క. సంధా భృగు నందనునక, బింధన గంధవహ బంధుహిత తేజో ని
గ్గంధిత గంధాంధ రిపు, స్కంధా వారాంబునిధికిఁ గవిసేవధికిన్ 67

క. శ్రీలక్ష్మీపతి సేవా, శీలున కున్మదవిపక్ష శిక్షణ కలనా
లోలునకు దయాళునకు, న్వాలూరీ పురపతికి నవారిత ధృతికిన్. 68

1 *గణభంగము. 'కృష్ణాపద్ధర'-అని సవరించవచ్చును. కాని పూర్వపరిష్కర్తలు ఊరుకొన్నారు.*

క. జడరాశి గభీరునకు, న్నుదబానల కీల సదృశ బాహు మహునకున్
గడిగోట మల్లబిరుదున, కుదు పరివృఢ కీర్తి తతికి నూర్జిత మతికిన్. 69

క. ఘోర మహోవార మహో, దార మహోన్నత విరోధి హతి చణునకు మం
దారవనీ గౌరవనీ, హారవనీ వంచికీర్తి హార గుణునకున్. 70

క. నాభాగ నిభున కంబుజ, నాభాగమబోధధుర్యునకు దశదిజ్ఞా
నాభాగ తత యశస్సు, నాభా గరిమాతిశయున కధికజయునకున్. 71

క. ఆంధ్ర ధరానాథునకుఁ బు, రంధ్రీ పాంచాలునకుఁ గరకృపాణలగ
త్కంధ్ర పరిపంథి పార్థివ, రంధ్రిత దినమణికి మతిధురంధర ఫణికిన్. 72

క. కోర్కొండ సింహ బిరుదున, కర్కప్రతిబింబ భుజ మహాప్రకరునకున్
గర్కశ రిపు హృతికి శుభో, దర్కునకు న్వేంకటాద్రి ధరణీ పతికిన్. 73

క. కామిత ఫలదాయకునకు, రామామదనునకు దాన రాధేయునకున్
దామరల వేంకటేంద్ర సు, ధీమందారునకు వారిధిగభీరునకున్. 74

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన బహులాశ్వచరిత్రం బను ప్ర
బంధ రత్నంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన. 75

ఉ. శ్రీశుకయోగిఁ గన్గొని పరీక్షి దిలాతల భర్త కర్తయౌ
దాశరథిం దలంచి పరతత్త్వముఁ గన్న ఘనుండు శత్రుశై
లాశన శౌర్యశాలి బహులాశ్వుఁడు తచ్చరితంబుఁ జెప్పవే
దేశికచంద్రమా! యనఁగఁ దెల్పఁదొడంగె మహర్షి హర్షియై. 76

క. ఆహవమోహ వశంవద, బాహవ బలభటము మిథిల పదిలంబగు శ్రీ
గేహంబై భూదేవీ, దేహంబై తగు విదేహ దేశములోనన్. 77

క. ఆవీడు దనకు వేలుపు, దావీఁడు ధరాపురాళిఁ దలఁతురె యనుచుం
దా వీడు భోగవతిని సు, ధావీడున్నత యశఃప్రతాపోజ్జ్వలమై. 78

సీ. అప్రోలి విప్రాళి యాగ శతప్రీతి నందింప విధి శతానందుఁడయ్యె
నవ్వీటి నృపకోటి యసురక్షితికి సేనఁ జేర్ప నింద్రుఁడు సునాశీరుఁడయ్యె
నాయూరి బేహారి హవణించు పొత్తు బేరపుఁగల్మి యక్షుఁ దర్థపతి యయ్యె
నాగ్రామహాలి ప్రేమ హల మొసంగినఁ బ్రలంబధ్వంసకుఁడు సీరపాణి యయ్యె
నచటఁ జదువంగ గీష్పతి యయ్యె జీవుఁ
డచట గణియింప హేమయై యమరె నమరి

యచటి పూఁదోఁటఁ బుష్పాస్త్రుఁడయ్యె మదనుఁ
డచటి నిధి విధి వసుమతి యయ్యె జగతి 79

మ. ఉడు మార్గంబున నిర్గమించుశశిలో నున్నట్టి న్యగ్రోధముం
గడి గొమ్మంచుఁ బెకల్పఁబోయి కిరణౌఘంబు ల్పయిం గ్రమ్మినన్
గడలంచుం గడలన్పడి స్వెడల శుండా దండముం ద్రిప్ప న
య్యెడ నప్పట్టన దంతికిం దొలఁగు రాత్రీశానుఁ డెప్పట్టునన్. 80

చ. సగతులు వట్టి వెంటఁ బరిచారకు లేగి హయంబు మించిపో
జగతి ఖురాగ్రము ల్పదమి జాడ యెఱుంగక వాజివేగముం
దగిలెద నంచు వెన్జను సదాగతి కొట్టునఁ బోవునబ్బటు
ల్పగలిటి కందు కొంద్రు త్రుటిఁ బాఱుచు నిల్చిన తత్పురాశ్వమున్. 81

ఉ. పంటవలంతి యల్లుదొర పట్టము ముట్టిన చిత్రశాటి యిం
టింటను లేని ప్రాణులుఁ గయి గ్రఘువీర జపాక్ష దామకం
బంటనిదేహధారులుఁ బురారి ధనుర్ధమన ప్రచండు పే
రింటను బిడ్డఁ బిల్వని శరీరులుఁ జొప్పడ రప్పురంబునన్. 82

చ. తనపురి ముందు క్రిందు పడదన్న నగద్తకుఁ దేలికొంచు వే
చనియెద నంచు నమ్మిథిలఁ జక్కఁగఁ జుట్టి పురారి చాప మ
ర్దన చణు నత్తవారి నగరం బని యెంచి హితుండ పోలెఁ గా
చిన పలునోటి చిల్వ యనఁ జెల్వగు వజ్రపుఁగోట వీటికిన్. 83

మ. నగరీ సౌధ శిఖా వధూ మధురగాన శ్రీద్రవద్రత్న నీ
రగణం బాత్మ శిరోగృహం బవియ గీర్వాణీతతు ల్వాన క్రిం
దు గృహాధోగతుఁ డిందుఁ డైందవశిలాతోయంబుగాఁ దప్పెరిం
గి గణించు న్సరిగూడు మేత నడుచక్కిం బాడ నక్కొమ్మలన్. 84

క. కన్నులజిగి చన్నులబిగి, వెన్నులయొగి కప్పుగుప్పు విప్పుంగొప్పుల్
వెన్నెల నగవు న్నెలమొగ, ము న్నెలఁత గముల్గను న్నభు ల్మెచ్చఁ బురిఁ 85

ఉ. అందఱు మందగామిను లొయారులు తేటమిటారి కత్తియల్
చందురుకావిమోవి పలుచందనపుం దుక మొందు నందపుం
గెందలి రాకు బోఁదులు శుకీపికవాణులు కంజపాణు లిం
దిందిర వేణు లెందున ననింద్యలు చందనగంధు లప్పురిఁ 86

ఉ. కట్టిన కోకఁగట్ట దొక కాంతయు నొక్క వధూలలామయు
న్బెట్టిన సొమ్ముఁ బెట్ట దొక భీరువుఁ బూసిన పూఁతఁ బూయదొ
పెట్టెఁడు చీర లంగఱుఁడు వెట్టినఁ బిల్చినవానిఁ బిల్వర
ప్పట్టన పణ్యభామినుల భాగ్యమె భాగ్యము భోగ్యవస్తులన్ 87

సీ. తొడ నిగ్గులకు రంభ తోడ్తోడఁ దలవంప శశిరేఖ నొసలికి సగముగాఁగ
దరహాసమునకుఁ జంద్రకళ వెల్వెలఁబాఱ నెమ్మోమునకుఁ గలానిధి కృశింప
ముసు తిలోత్తమ మించుముక్కు తేటకు వాఁడ హేమ మెచ్చుగ నెమ్మెయికిఁ గరంగఁ
దతబాహుల కనంగలతిక కొండలు వ్రాక నరిది చూపుల కింత హరిణి బెదర
గీ. ఫలముఁ గొని పల్లవావలిఁ బాసిపోక
యలఁతి గాక పలుకఁ బార కెలమి విడక
పడక వన్నియ దరుగక పచ్చఁదనము
వీగక వలంద గులకుంద్రు వేశ్య లచట. 88

సీ. వెలయీక విరిబంతి వెలఁది దాఁచఁగ నేల యది హెచ్చు మీబోంట్ల కబ్బుటెట్లు
కొన్న మేమేకాక యున్నవారల కౌనె యింటియతండు నీకంటె భోగి
యటులైనఁ బచరించి యంగళ్ల నిడనేమి యంటిమోడక రొక్క మంపిరొక్కొ
రాలెక్క కిన్మడి యీలేమె వెలయెంత వేడుక కెచ్చోట వెలయుఁ గలదె
గీ. యనుచుఁ బౌరుల యుత్తరంబునకుఁ దగిన
నర్మ గర్భోక్తు లాడి మనంబుఁ గరఁచి
చల్ల ప్రొద్దున నరవిరు ల్సరులు గట్టుఁ
దలిరుఁ బ్రాయంపుఁ గొమ్మ మొత్తంబు లచట. 89

క. అన్నగరిం బహులాశ్వుం, డెన్న గరిష్ఠ ప్రతిష్ఠ నేలు యశో వి
చ్ఛిన్న కరి కంధరుండై, పన్నగ రిపురాట్తురంగ పద భృంగంబై. 90

సీ. అపరంజి గవిసెన త్రిపురాపహారి చాపంబున కెవ్వాని భవన భూమి
యర్ధాంగలక్ష్మి యింద్వర్ధమూర్ధధనుర్విదారి కెవ్వాని యుత్సంగశిశువు
ప్రజ్ఞాన రుచిదాత్రి బాదరాయణ కుమారునకు నెవ్వాని నిర్దోష ధిషణ
ప్రాంచత్కుటీకోటి ప్రాణినేత్రాంబురు ద్వయము లెవ్వాని కూటస్థమణికి
గీ. నిట్టి మహిమల మహివహి కెక్కినట్టి
జ్ఞాన జనకుని వంశరత్నంబు నూత్న
కీర్తి నరకేసరి విజిత కార్తికేయ
జనకుఁ డనమించు బహులాశ్వజనక నృపతి. 91

సీ. పితృశిక్ష కొప్పక వెలయుప్రహ్లాదుండు పోరువెట్టనియట్టి నారదుండు
తనశక్తివోఁ జేసికొనని వసిష్ఠుండు రతిఁ బగల్గొనని పరాశరుండు
కాశికా ఖండోక్తిఁ గైకోని వ్యాసుండు జనకహృద్వృత్తి నొత్తనిశుకుండు
పారణ కొకనిఁ ద్రిప్పని యంబరీషుండు పెరుమాళ్ళ విడని విభీషణుండు.
గీ. హరి చరణ చింత మఱని రుక్మాంగదుండు
పృథుల గురుధిక్కృతికిఁ గాని భీష్ముఁ డతఁడు
శౌరి పదభక్తి లేని భూజాని మగఁడు
తగఁడు బహుళాశ్వ ముదిరాశ్వు ప్రెగడ వొగడ 92

క. అతనికిఁ బురోహితుండగు, శ్రుతదేవుఁడు మఖ ముఖాన్న శుచిరుచి పరిపా
లిత దేవుఁడు నతజీవుఁడు, స్తుతభావుఁడు రచిత నందసుతసేవుఁ డిలన్. 93

మ. శితభాను ప్రతిభానుమూర్తి గిరిజా జీవేశ జూటీతటీ
యుత సూన ప్రతిమానకీర్తి బహుళాశ్వోర్వీబిడౌజః పురో
హిత భావస్తుత భావశాలి శమ భూయిష్ఠ ప్రతిష్ఠాగతిన్
శ్రుతదేవ క్షితిదేవ మౌళి తగువిష్ణుధ్యానవర్ధిష్ణుఁడై. 94

ఉ. ఆ సుజనస్తుతుండు బహుళాశ్వుఁడు కాశ్యపి నేల నొక్కెడన్
వ్యాస వసిష్ఠ కుత్స భృగు వత్స పరాశర ముఖ్య తాపసా
గ్రేసరు లేగుదెంచి నృపకేసరిచే సుమపూజ లొంది త
ద్భూసుర భక్తి కుల్లమునఁ బొంగుచు నిట్లని రందఱుం దగన్. 95

ఉ. చుక్కల రాజవీగి మధుసూదన పాదసరోజపూజలం
దక్కువ గాని మేటి బలి తాతవు ధాతవు హృద్యవిద్యలం
జక్కదనంబునన్ మొదటి చక్కెర విల్తుఁడ వీడు జోడు నీ
కొక్కని విన్న కన్న ప్రజయుం గలదా బహులాశ్వభూవరా. 96

ఉ. ఇంటికిఁ దోడి తెచ్చి తనియించితి పూజల కల్మి కల్మి వా
ల్గంటికి గంటె గట్టుదొరఁ గన్గొన వచ్చిన భాగ్య మిచ్చటం
గంటిమి మేమటంచుఁ దెఱగంటిదణా యనివంటి రాజ ము
క్కంటి నుతించి ద్వారవతిఁ గాంచుటకై చని రమ్మునీశ్వరుల్. 97

చ. చని మునికోటి తేఁటి యెలజవ్వనిపాటలు గాద్పుటాటలుం
బనువడు పూవుఁదోటలను పాటలగంధులు వొల్చుపేటల

న్వనరుహ రాగ హాటక కవాట లసద్ద్యుతిఁ గన్న కోటలం
దనరిన ద్వారకానగరి ద్వారముఁ దూఱి పురంబుఁ జూచుచున్. 98

ఉ. అక్కడ నొక్కగందవొడి యంగడిఁ దొల్లి సుమాపణంబు లీ
చక్కి నమర్చినారు గిరిజాప్రియసూతికి ఁదొంటిరీతి గా
దెక్కుఁడు వైభవంబు పరమేశ్వరు గోపుర మీపురంబునం
జుక్కలఁ జూచె బచ్చులకుఁ జూపిరొ యచ్చటి గచ్చు టోవరుల్. 99

మ. ఇదిగో సాత్యకిమేడ క్రీడిసదనం బీ బ్రాహ్మణశ్రేణిఁ జూ
పదియైదిండులు దాఁట నిట్టటు బలప్రాసాదమాసంది నే
కద గర్గాలయ మశ్వకోటి కరటి గ్రామంబులం గాంచె శౌ
రిదయం గాంచిన వారి పట్లకును శౌరిం బోల నేరీదొరల్. 100

మ. అని పూలంగడి దాఁటి కోటిపడగల్ యత్నంబునం గన్నవై
శ్య నివాసంబుల త్రోవవట్టి యెదుట న్సాంబాలయంబుం గనుం
గొని ప్రద్యుమ్నుని హర్మ్యముం గడచి యక్రూరాంగణం బంటి యొ
య్యన వేయంచుల కైదువయ్య యిలు డాయంబోయి హర్షించుచున్. 101

సీ. గోత్రారి కరికైనఁ గొమ్మిచ్చుటయె గాని యకు కెఱుంగని మదావళ కులంబు
లవణాంబు నిధినైన లంఘించుటయెకాని కుఱుచ దాఁ టెఱుఁగని ఘోట పటలి
గంధవాహము నైనఁ గడువఁ బాఱుటెకాని యని గుంటువడని శతాంగవీథి
కంఠీరవము నైన గరిసించుటయె కాని యొరసి వెన్నీని భటోచ్చయంబు
గీ. ప్రమణ నిబిడ బిడౌజాగ్ర పరిబృఢప్ర
గాఢ సిబికాధికాందోలికా నికాయ
కేతనచ్ఛత్ర సంఘాట ఖేట నిరవ
కాశ మహి బహిరంగణ గరిమఁ గనుచు. 102

ఉ. ఎక్కడి పుష్పకంబు మఱియేటి సుధర్మ సుమేరు కందరం
బిక్కడ విల్విరొక్కొ పొడవెంత యహో నిడివిన్నెడల్పు మే
లొక్కొక యంకణంబె యదియుం బదివేలకుఁ జాలు జాళువా
చొక్కపు టీకు లెక్కడని చూచి హజారములోనఁ జొచ్చుచున్. 103

సీ. రుక్మిణీ పరిరంభరుచిఁ దగుల్కొనినాఁడొ సత్యభామాకేళిఁ జాలినాఁడొ
లక్షణా వీణా కళావాంఛ నున్నాఁడొ కాళింది సందిటఁ గదిసినాఁడొ
మిత్రవిందా లాస్యమే మెచ్చుచున్నాఁడొ భద్రా రతిశ్రాంతి బడలినాఁడొ
జాంబవతీ రదచ్ఛద మానుచున్నాఁడొ యల సుదంతా క్రీడ నలరినాఁడొ

గీ. లేక రాధాసుధాధరాస్తోక ధరణి
ధర పయోధర ధగధగద్ధగిత గండ
తల మృగీమద మకరికా కులకములకు
హరువు గనినాఁడొ యని మునీశ్వరులు వలుక. 104

సీ. సిగమొగ్గ తెలినిగ్గు జిగిదన్ను నిరుచుట్టు వెనుక కట్టు రుమాలు వెలికిఁ గ్రమ్మ
నొసలు క్రొన్నెల కొల్పు పస గన్న యరవిరి కలువనా మృగనాభి తిలక మమరఁ
గుంకుమం బెద దిద్ద గొలుసింత త్రిప్పి యంసమున వై చిన కౌస్తుభము నటింప
డావంక భుజపీఠిపై వింత నడికట్టు చెంగావి బంగారు చెఱఁగు గదలఁ
గీ. దళుకు హురుమంజి నిడుయొంట్ల దాల్చిహాళిది
పట్టె సమ్మాళి గెలకవ మెట్టి పాణి
పాణి ముత్తెంపుఁ బరజుక్కృపాణి పూని
చక్రి దనుదెంచె నపుడు హజారమునకు. 105

గీ. దండ సాత్యకి రాఁగ సైంధవ విరోధి, దండనోద్దండభుజుఁడు కైదండ యొసఁగ
వచ్చి యచ్చక్రి [1] తావు తివాసి మీఁది, పచ్చగద్దియఁ గూర్చుండి ప్రజ భజింప. 106

గీ. ఒక్క చేమ్రొక్కు కేల్దోయిమ్రొక్కు నొక్క
కరము సామ్రొక్కు తలమ్రొక్కు కన్ను మ్రొక్కు
నుచితిగతి మ్రొక్కి దృక్పాణి రచన మూర్ధ
నియతిఁ దగువారిఁ గూర్చుండ దయదలంచి. 107

సీ. ఎదురు చూపునకు దిగీశ్వరు ల్కైదట్టి వెఱచి రెండడుగులు వెనుక కిడఁగ
వలప్రక్క చూడ్కి కవ్వల యాదవా గ్రణు ల్భగ్గున నిరువంకఁ బాయ యొసఁగ
డాచక్కి చక్రి చూడక మానఁడని మున్ను బలగము ల్వారెఁడు బయలు విడువ
వేత్ర మెత్తిన వజ్రి కత్రిదశులు గళన్ముకుటులై యొకరిపై నొకరు వ్రాల
గీ. మునుల గొల్లలు సావిడి నునిచి విన్న
వించ నేతెంచి యుద్ధవుఁ డించు కలికి
చెంగట భజించు దొరల మరుంగుఁ గోర
బలిసి కొలువుండె యదుసార్వభౌముఁ డపుడు. 108

క. శూరకులపావనుండు హ, జారమ్మున కేగుదెంచె సంయమివర్యుల్
రారయ్యా! యని పిలిచిన, వారయ్యాదవుని సచివవచనము వినుచున్. 109

---

[1] కొల్వు–చిన్నయసూరి నిఘంటుపాఠం.

సీ. ప్రభుగోష్ఠి వేగిరపడకు విశ్వామిత్ర! వాల్మీకివాణిలోవత్తుగాని
భరతప్రపంచంబు హరి యెక్క దడుగునో జడియక యుత్తరం బిడుము పులహా!
యొక్కచోఁ దర్కోక్తిఁ ద్రొక్కుడు వడుదీవు తెచ్చుకో నెమరున కిచ్చు వత్స!
యొక్కొకరె ప్రసంగ మొసఁగెడుచోఁ గొంద అడ్డగట్టులు వల దత్రిమౌని!
గీ. శాస్త్రసాహిత్యములు మాకె చాల[1]జితమ
టంచుఁ గలగూరగంప సేయకుము బాద
రాయణ! కవిత్వసందర్భ రసము నిలుపు
మనుచు దౌవారికద్వార మపుడు దాఁటి. 110

సీ. పదిలమ్ము సుమ్ము నీపాణి పాణింధమ నారికేళము దర్భనంబు తఱిని
జతనంబు మీకరాక్షతములు శౌరి యంజలి చూచి జడియ కొసంగు చోట
నిద్దఱు నవధాన మీపూర్ణకలశంబు మురవైరి శిరమున మోపు నపుడు
మీర లెచ్చరిక యీమృదుకాయ మానమృద్వీకానికాయ దాతృత్వవేళ
గీ. నాయు రారోగ్యపుత్ర పౌత్రాభివృద్ధి
రస్తు భవతామటంచుఁ గంసారిఁ జేరి
పెద్ద లాశీర్వదించిన పిదపఁ జిన్న
లనుఁ డటంచును నాస్థాని కరుగుదేఱ. 111

ఉ. చూచి మరీచి ముఖ్యులఁ బ్రసూనశరాసనుతండ్రి దిగ్గన
న్లేచి నమస్కృతు ల్చలిపి లీయపు దీవన లంది కానుకల్
కై చిగురాకు సాచి దయఁ గైకొని తానుచితాసనంబుల
న్మేచక వర్ణుఁ డుంచి మునినేతల కిట్లనియెం బ్రియంబునన్. 112

శా. ఏమీ సంయమ సార్వభౌములు! శుభంబే హవ్యకవ్యక్రియా
సామర్థ్యంబునఁ దొంటి యట్లనె కదా! శక్రాహిత శ్రేణిచే
బాము ల్రావు గదా! ముదాస్పదములై భద్రోన్నతు ల్బ్రాపెడున్
మీమీ మోములె యంతె చాలు నివి సుమ్మీ! నేఁడు మాకిష్టముల్. 113

సీ. భద్రమా! మీయాశ్రమ ద్రుమాంతర ధరాచర తరక్షు కురంగ సఖ్యములకుఁ
గుశలమా! ఫలసమిత్కుశలమాదానదీక్షాపరకీశ విశ్వాసములకు
భవ్యమా! మీనవ్య హవ్య మాద్యద్ధనంజయగ ప్రదక్షిణ జ్వాలికలకు
క్షేమమా! సామజోద్దామ మానత్రాత కైదార నీవార గర్భములకు
గీ. బాలికా పాలికా బాహు పాలితాగ్ర
శాలికా మాలికాసన్న సకలబుతు భ

---

[1] సూర్యనిఘంటు పాఠము. 'జితమంచుఁగలగూరగంప నేయకుము'-పూర్వముద్రణ పాఠము.

రిత సుమకదంబ శాఖికా రేఖికలకు
సుఖమె! యన నిట్లనిరి వ్యాసముఖులు హరికి. 114

శా. రాధావల్లభ! యెల్ల భద్ర గుణముద్ర న్మీరు మన్నింపఁగా
మా ధర్మంబునకుం గొఱంత గలదా మత్తిలి యుష్మత్కథా
బోధం బొందితి మెక్కడం బొడిచితే ప్రొద్దా యటంచున్ సుఖ
శ్రీధన్యస్థితి రామరాజ్యము వలెం జేతొమ్ముపైఁ జేర్చుచుఁ 115

సీ. ఇప్పుడు తెక్కార్చె నీకౌశిక వ్రతి యచలస్థితి వహించె నయ్య! భృగువు
నినుఁగూర్చి చెట్టుకట్టెను గాలవతపస్వి ప్రబలించె రుచి మందపాలమౌని
మంచి నడకఁ గాంచె మన జాలపాదర్షి వగ నెదవదకుండె వత్సయోగి
విరివికాఁడై గాదవిలె వ్యాస జటిమౌళి మది తమం బెదలించె మతి మరీచి
గీ. నడచె భువన ప్రసిద్ధుఁడై నారదుండు
తనరఁ బరికొనె మతి వరతంతు మౌని
నీదు కారుణ్యమున సుఖాన్వితులు వీర
లిందఱు ముకుంద! హరి! ముచికుందవరద!. 116

శా. మీ దాసాగ్రణు లెక్కడం గలరొ భూమిం జూత మన్నట్టి మే
ధాదక్షత్వమె కాని లే వితరచింత ల్రోవ నేతేరఁగా
వైదేహక్షితిఁ గంటి మయ్య! బహులాశ్వక్షోణిభర్తన్ భవ
త్పాదాంభోరుహ భృంగము న్భవభరాభంగద్రుమా సంగమున్. 117

శా. కన్నుల్చల్లఁగఁ జూచినార మతనిం గారుణ్యము న్శాంతిదాం
త్యౌన్నత్యమ్మును జిత్తశుద్ధియుఁ ద్వదీయ ధ్యాన సంశుద్ధియుం
ద్వన్నామార్పిత బుద్ధి వానికి ఁదగుం ద్వన్నాభిఁ గన్నయ్య యీ
యున్నయ్యల్మన సంయము ల్పొగడలే రుర్వీ సుపర్వేందునిన్. 118

సీ. కొలువు లోపలఁ బంటవలఁతి కన్నియపెండ్లికొడుకు పేరెన్నిక విడనివాఁడు
తలఁపులోఁ దబిసి బిత్తరిఱాతివగ ద్రోపుఁ దెలుపుజేజేనిల్పు తలఁపువాఁడు
పలుకులో మున్నీటి జలుకుటీగిలకోరి బల్లిదుకత వల్కు బమలవాఁడు
నిదురలో హొంబట్టు నెతికట్టు రావేల్పు వలచుట్టు జోహారు కలల వాఁడు
గీ. తండ్రిపేరిటిదొరబిడ్డ తగులమునకు
విల్లు విఱిచిన మేటికి విన్నవించు
కబ్బముల వాఁడు నీవన్న నుబ్బువాఁడ
తండ పో దేవరకు నమ్మఁ దగిన బంటు. 119

క. ఇలతేఁడు బాదరాయ, ణ్యలఘు ప్రౌఢిమ నటుండు మనియె [1]న్మనియెన్
బలిబలె శౌనక శమదమ, కులనైపుణి పుణికి పుచ్చుకొనియె మురారీ!. 120

క. నావుడు దేవుఁడు వలికెం, దా వాల్మీక్యాది జనమునకు బహులాశ్వ
క్ష్మావల్లభు నెఱుఁగుదు మ, ద్భావంబునఁ గలిగినదియె పల్కితి రీరల్. 121

శా. చూడం బోదము చుండు తేపు మన మంచుం బల్కి యమ్మౌని స
ప్రమాదుత్తంసులఁ దొంటి యవ్విడిదిఁ జేరం బంచి పైనంబుఁ దో
డ్తోడ న్రాణువ కెల్లఁ జెప్పి కొలువందుం దీఱి సాహోరవ
క్రీడావైభవ మొప్పఁగా నగరు చేరెం జక్రి మోదంబునన్. 122.

-అశ్వాసాంతపద్యములు-

శా. జ్యేష్ఠాషాఢ నిరూఢ తిగ్మకిరణౌజస్పర్ధి దోస్తేజ బిం
బోష్ఠీ లోక విలోక పంచవిశిఖా యుద్దామ దానక్రియా
షష్ఠాఖండలభూజ రావణభుజాసంఛేదనాయోధనా
ధిష్ఠారాధన శ్రీసుయోధన ధనార్థిస్తుత్యనిత్యోదయా 123

క. జంబూద్వీప కవీంద్ర క, దంబ కదంబక నవాంబుధర విశద యశో
బింబీ ఫలాధరాకరి, జంబీరీ కృత సమస్తజలజభవాండా. 124

వి. వితరణజృంభణశక్రతరుక్రమ విక్రమనూతనశాతఘృణీ
తతరణబృందపురందరనందన ధన్యమహీమహిళాగ్రహిళా
యతభుజగాగ్రభుజాగ్రమహోగ్రజయాంక నిజామశహైదులశా
కుతుపనశాహసమాగతహాటకఘోటకఝూటకరిప్రవరా! 125

గద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహశాశ్వతైశ్వర్య ధుర్యతామహేశ్వర రూప
రేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్కవి
రక్షణదక్షవీక్షణ [2]యినిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాంబా
గర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవ శేషభాషామనీషాబల
ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయక ప్రణీతం
బైన బహులాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

[1] మనియె - అని పూర్వముద్రిత & సూర్యపాఠం. 'మనియెన్'- సవరించిన పాఠం.
[2] 'యినగాల గోత్రపావన' - అని విమర్శకులంటున్నారు.

శ్రీరస్తు

# బహుళాశ్వచరిత్రము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీపాద వంశ నృపతి సు, ధాపారావార పూర్ణతర ధవళఘృణీ
శ్రీపరిణీ కరుణా క్రీ, డా పటిమ విశాల వేంకటక్షితి పాలా. 1

క. ఆ మఱునాఁడు మురారి మ, హామహిమ న్మహిత భూషణాలంకృతుఁడై
హేమాంబర ధరుఁడై స, త్యాముఖ శశిముఖుల తోడ హర్మ్యము వెడలెన్. 2

వ. అప్పుడప్పుండరీకాక్షుండు కక్ష్యాంతరంబులు గడచి దౌవారిక ద్వారంబుల నడచి హజారంబు మించి ఘంటాపథంబంటి చిరంటీకురంటికామోదలతో నేతేరఁద్వరోత్తిష్ఠదాన మదాపణవణిగ్గణంబుఁ దదాకూపోదక కుండికాకంఠరజ్జు సంధాన సంజవన నిషద్యాణు మధ్యాసముదాయంబుఁ దదానీం వారి విక్షేపణ క్షిప్రవేశ్యావారంబుఁదత్కాల శోధనీ శోధన పర్యట దర్య భార్యా వర్యంబు సద్యస్సమ్మార్జనీధూత ప్రఘాణపాంసూరవ్యహంసయానావతం సంబుఁ దత్సమయ తోరణ నిర్మాణ సూత్ర సంఘరత్కిరాట సంఘాటంబుఁ దదవసర రంభాస్తంభ సంభ్రమ భ్రమ దూరు సంభవంబు సహసాకరాంభోజ పుటీనిపీడితపటీపటిష్ఠతా యష్టి సంపాదన బహుధా గృహధావ దూరుజవ్రజం బితరేతరస్థల కలహాకులా కుల కలకల కలకంఠీ సవిధ వివిధ సౌధయూథ సందష్టు సర్వసర్వం సహాధిప సారస లోచనా చయంబు కించిదాచ్ఛాదిత కవాట పీఠభాగ భాస్య సామాన్య రాజన్య కన్యకా బింబోష్ఠీకంబు ప్రకోష్ఠనిష్ఠిత నిష్ఠురశ్వశ్రూకిటీల భ్రుకుటీకుటిలాంతర్నివారిత. విలాసినీసువాసినీవిసరంబుఁ బ్రసరత్పల్లవ పల్లవ పుంగ వా పాంగ నటన రంగాయి తాత్మాంగతా నఖరపరిష్కృత కచబంధ బంధకీ వేశ్యానికాయంబుఁ బశ్యద సూర్యంపశ్యాదస్యు మధ్యమా సమాలోకన భ్రమాగత కితవ నివహంబ నేక వేత్రపాణి పలాయమాన మానవ ధావన వినోదన సముత్కటంబగు పుటభేదనంబు నడు వీథి నడతెంచు నెడఁ గలువడంబులు లేనియెడ హసన్ముఖంబుల చామర ముకురంబులు వొసంగించుచు లసన్ముఖంబుల నిరలంకృతి ప్రాంగణంబులకు మౌక్తిక రంగవల్లికలు సింగారించుచు నక్షీణ క్షణక్షణ వీక్షణ క్షణదాధ్యక్షాతపాచ్ఛతరచ్ఛవిచ్ఛటల నమండిత ప్రతోళికిఁ బాందుర తోయజ తోరణంబులు పొంకించుచుఁ దాటంక నిరాతంక ధగద్ధగిత కపోల పాలికలం గనద్ధవళవితాన

పటలంబులకు జిలుఁగు టుదిరిపని పుట్టించుచు హట్టంబులు వట్టివచ్చు చరణఘట్టన సముట్టంకిత ఝుణఝుణ నిక్వణ చిక్కణ మణినూపురకాపురంధ్రులతో గోపురంబుఁ దాఁటి నలువంకఁ దారదారసిలిన దారల నుదారలం గల్యాణులం గల్యాణపల్యంకికారూఢలం జేసి సత్యాముఖ మితవనితా జనతా సమేతంబుగా ఫలితమనోరథుండై రథంబెక్కి చక్రి చనుచు జనపదంబులు గనుచు తపనపదంబులు మనుచు సానురాగకమనఃకమనంబైన మార్గభూమ్యుభయ పాళీభూత భూభువన సవనభుగ్భామినీ డింభక కదంబకంబు భజనంబున కానక దుందుభి నందనుం డభినందించుచు ముందఱం జనిచని మందపట్టులం గడంగి తొంగలించిన చెంగలి మేసి చెంగలించి చెంగక చెంగటఁ జెంగనాలం బొసంగు నాలకదుపుల దయచేతం గనుంగొని జల్లియొడలు పలుచనితొడలు కుఱుచకొమ్ముల తెఱంగు నిడుదవాలంబు బెడంగు గాఁగెడు పాలయొదుగు కాగెడు పాలపొదుగు మొదవులలో మెదుగు యదుకులభర్త కీర్తించుచు వర్మనిం గైకొని కార్తస్వర వికస్వర రత్న శతాంగ సంగత పతంగ రాట్కేతన నూతన చేలాంచలా సంజాత సంఘాత వ్రాత సముత్పత ద్ద్యోతలాన్విత నానా తరంగ రేఖా శిఖాతరణి శశాంకా కరలుఠత్కఠోరకమఠపాథోరాశిదేశీయ తటాక ఘటాకల్లోలినీ పరిఘలు గని పరికించుచు నపరిమిత పరిమళ మిళిత పరిఫుల్ల గిరిమల్లికామతల్లి కావల్లీవేల్లిత మకరంద నికి రేందిరానంది తుందిభేందిందిర బృందగాన కందళ సందోహ సంధాన ధురంధర గంధవహోపహృత ఘర్మ ఘనరస నిబంధ నాత్మ సౌగంధిక కపోల గంధసార మకరికా సంధాయకుండై యాదవగంధసింధురంబు బంధురాటవీవాటికలు దాఁటి ధాటీ లటహ పటహ రటన పాటవ పాటిత దిక్కటాహ కరహాట మరహాట లాట భోటాంగ బంగాళ నేపాళ భూపాలకోపాయనంబుల కతిశయిల్లుచు కతిపయప్రయాణంబుల హూణ కాశ కరూశంబులు వాసివాసిగాఁ గోసలదేశాధీశానుండు విదేశాపురిం జేసిన విడిది ప్రవేశించు నవసరంబున. 3

సీ. బలభద్ర బృంహితా సులభద్ర ధీమరూఢ బలభద్ర భద్రేభపటలి నడచె
మదసార విక్రమాస్పద సారథి తురంగ గద సారణ శతాంగ గణము గదలె
ననిరుద్ధ యుద్ధ శౌర్య నిరుద్ధ విక్కృతి వైర్య నిరుద్ధ యోధ్ధచయంబు చనియె
సరసాంబకై కీకృత రసాంబరాన్వి దంబర సాంబ ఘోటకపటలి వెడలె
గీ. ద్యుమ్న మణినూపురాంఘ్రి ప్రద్యుమ్నుఁ డతఁడు
రతి సతీవేణి సమకళా రసిక పాణి
చక్ర జఘనా ఘనాపాంగచక్రిచాక్రి
జక్కిఁ గుఱుచలు ద్రొక్కించెఁ జక్రి యెదుట. 4

సీ. అదరుఁగ్రోవులఁ దేజి బెదరించి రవితేరు గడియలోఁ బడమటిగట్టుఁ జేర్పఁ
బృథురథ ధ్వజరాజి త్రిదశాంగములు ముంచు తురగఖురోద్ధూత ధూళిఁ గొట్టఁ
జలదిభశ్రవణముల్ శౌరి దర్శనల గద్గగనేచరశ్రాంతిఁ గడకు విసరఁ
గడల చిమ్ము లమర్త్యగణవిలోకవిరోధి జలదంబు దొంతికి తొలలు సేయ
గీ. సకల సన్నాహికలఁ గన్న సైన్య మన్య
మాన్యరాజన్య భృత్య సామాన్య జన్యుఁ
దట్టియెడఁ బాంచజన్యాంకుఁ దరుగు దేఱఁ
బదవి కొకయింత యిరుచెంత బారు దీఱె. 5

సీ. దారూర్ధ్వ పదలంబితామ్రచూడశ్రేణి మసృణ బంధన ఘోష్యమాణ ఘోణి
స్వర్ణ తారాచలచ్ఛణక తండుల రాశి బహుశాక తేమన భాజనంబు
దంతుర తైలాజ్య దధినూతన ఘటంబు వివిధాంశు మత్స్యలావీ వధంబు
గుడ శర్క రాపూర్ణ గోణీ నికాయంబు స్వచ్ఛార్ద్ర ఘోట గుళుచ్ఛకంబు
గీ. నగరిపు శిలావితర్ది కా స్థగితహిమగు
మృగమద పటీర తరుఖండ మగణితోప
ధాభరము లోని చావడి దాఁటి నగరు
చిగురు విల్తుగురుఁడు ప్రవేశించె నపుడు. 6

ఉ. భానుఁడు గ్రుంకెఁ బ్రాచి హిమభానుఁడు దోఁచెఁ జకోరి చంద్రికా
పానము చేసెఁ జీఁకటులు వాసెఁ గుశేశయము ల్ముడింగె భృం
గీ నికరంబు చెంగలువ గీములు చేరె రథాంగముల్ వృథా
దీనములయ్యెఁ బాంధుఁడవిధిన్ విధిదూఱె రసాలవీథులన్. 7

క. ఆరాతిరి విడిదిం గం, సారాతి రిరంసు హంసయానామాద్య
న్నారీ తిలకంబులతో, నారీతి సమస్త భోజనా నందితుఁడై. 8

ఉ. అచ్చటఁ బచ్చటాకు నిలయంబున గొజ్జఁగిసెజ్జఁ గౌఁగిటం
గ్రుచ్చిన మచ్చెకంటి విరిక్రొమ్ముడి వ్రాలుతమిం దలాడగా
నిచ్చినచేయి గుబ్బకొకయింత మరల్చి రదచ్ఛదంబు వి
వ్వచ్చునినేస్తకాఁ డరిది వాచవి చూచుచుఁ గూర్కె నత్తఱిన్. 9

క. క్రుంకె నెల మరుఁడు వేఁటకుఁ, గొంకె నుడూచ్చయము డొంకెఁ గుముదంబుల డా
లింకెఁ దిమిరోత్కరంబు త, లంకె రవిచ్ఛవియుఁ దివిఁ దొలంకెఁ గడంకన్. 10

క. ఆమీఁద మధూళీ ధుని, దా మీఁద మధువ్రతములు దర్పకదర్పం
బామని వచ్చెం బికముల, యామని మెచ్చెఁ గృశంబు యామిని గాఁగన్. 11

ఉ. మావులు పూచె మించెఁ గుసుమంబులు గొజ్జఁగి గుజ్జుపొన్నలున్
దావులు చల్లె మల్లెవిరి దార్కొనియెన్ గనియె స్రసూనముల్
గ్రోవులు పూవులుంచె నిగఁ గుందము లందము చూపెఁ దేనెలన్
మోవులు రావులొద్దుగులు ముందుగఁ గెందలి రొందె నామనిఁ 12

రగడ. అవ్వసంత మఖిలాశాంతములం, గ్రొవ్వించె న్మరుగురు కుంతములన్
జగక్రొవ్విరి వాసంతిక ముడిచెన్, జగ మివ్వలను హసంతిక విడిచెన్
జాజులు తేఁటుల జాడల వీఁగెన్, జాజరపాటల జాగులు రేఁగెన్
మావు లంగజుని మావులఁ దేల్చెన్, తావులీరములు తావులఁబొల్చెన్
తొలఁకు సరళి రవదులె పికగళము, ల్వలరా హత్తికి వదలె నిగళము
ల్కాకము కోకిలఁ గడలకుఁ దన్నెం, గోక విరోధికిఁ గూరిచె వన్నెం
బచ్చవింటిదొర పాళెము వెడలె, న్వెచ్చనూర్చి కడు విరహిణి బడలెన్
అచ్చెఁ బ్రియులచే నతివలబారుం, గుబ్బచన్నులకుఁ గుంకుమనీరు
న్మంచు ముంచుకొన మావులు స్రుక్కె, న్మంచినీళ్ళరుచి మహి వహికెక్కె
న్వలిచలువలు చనువలువలు చొచ్చెం, జలిపచ్చడములు చలిపొర వెచ్చె
న్మాల కొదిగెఁ దుది ముదుఁగుంగోకల్, సాలిఁ దూరసెను సన్నపుఁ బేక
ల్వేవెలుఁగు పస వీడె జనాళి, న్వేవెలుంగు పటురే నునుహోళిం
బండె నధ్వగుఁడు బహుపాచ్ఛాయ, న్నిండెను [1]నలి నలినీతతి చాయన్
దిన మంతంతకు దీర్ఘత మనియెన్, అని చింతను నిశి హ్రస్వముఁ గనియెన్
మలయ మారుతము మన్ననఁ గాంచెన్, మలయజ తపములు మతి ఫలియించెం
దాలవృంత మవతారము దాల్చెం, బాలమొదలుగా ఫలములు రాల్చె
న్గొడిసె తింత్రిణీకులము విదిర్చె, న్వడపింది జనావళి వడఁ దీర్చెఁ
ఇదుమ లొందె నూళ్ళెద్దడివారె, [2]........
చిలుప జెలల నది జలములు మొలిచెన్, ఎలమావికి శుకి యించుక వలచెన్
ధాత్రి ధాన్యముల ధారణ నిక్కెం, జిత్రకారకుఁడు చిందులు ద్రొక్కెన్
ఎత్తె హోలికుండేతపుఁబాట, న్మత్తిలె దిటవతి మడుగుల నీటన్. 13

క. ఆ సమయమున మురాసుర, శాసనుఁడు ప్రభాత నిత్య సత్కృత్యముల
న్వాసిలి సత్యాముఖ బహు, కేసరి మధ్యా వినోద కేళీ రతుఁడై. 14

ఉ. ఒక్కతె గుబ్బచన్నులకు నొక్కతె వాతెర కొక్క కల్కి నున్
బొక్కిలి కొక్క యంగన కనుంగవ కొక్క పొలంతి చొక్కపుం

---

[1] నవినవినీ తతి జాయన్ - సూర్యనిఘంటు పాఠం.
[2] ముద్రితప్రతిలో ఇలానే ఖాళీ విడువబడింది.

జెక్కుల కొక్కలేమ ముఖసీమకుఁ జొక్కి పసిండి రెంటెపుం
జక్కనితండ్రి చక్రి మణిసౌధమునం గొలువున్న యత్తఱిన్. 15

ఉ. చూళికయందుఁ జిందు నవసూన రజంబు కుజంబు శాఖికా
పాళిక దూఱంజీరు నిజబాహుల రేఖలు మేననంటుమా
ధూళిక బిందువుల్ దొరయఁ దోఁట యొకించుక సేయు వృద్ధ గో
ద్దాళిక మౌళి యొక్కరుఁడు తామరసోదరుఁ జేరి మ్రొక్కుచున్. 16

క. సూనక్షేద్రేక్షుద్రా, క్షానానాబదరలికుచ జంబాళీరం
భా నారికేళ ఫలములు, గానుకగాఁ బెట్టి తోఁటఁ గనుఁగొనుఁ డనినన్. 17

క. ఆ కంసవైరి సత్యా, కోక స్తని వాంచ యెఱిఁగి కొంత నగరిలో
రాకకుఁ దోఁటకుఁ జేసిన, వాకిలిఁ దెఱపించి కేలివని కున్ముఖుఁ డై. 18

సీ. తఱచుగాఁ బూచిన తంగేళ్ళ నడుచక్కిఁ దార్కొన్న తాపింఛ తరు వనంగఁ
దరుణ విద్రుమ లతా తరులతో జోకైన పాకభిన్నీల శలాక యనఁగ
నందంపు టాఁబెయ్య మందలోపలఁ జొచ్చి క్రీడించు కఱివన్నె కోడె యనఁగ
నిద్దంపు టంచమన్నియ కన్నియల లోనఁ దలకొన్న మత్తకాదంబ మనఁగఁ
గీ. గొమరు ప్రాయపు దోయంపు గొల్లపల్ల
వాధరలలోన మేల్తరమైన యువతి
బృందము పిఱుంద ముందఱ నందనంద
నూనుఁ డారామ వనసీమఁ జొచ్చె నపుడు. 19

మ. గనిమల్ దీఱిచి కాల్వలేర్పఱచి చెంగల్వ ల్మసల్బావి నీ
రున కేతం బిడి వట్టివేఱు కురువేఱుం బోదికై మంచు చి
న్కిన నిద్దా బొనగూడ వాటుకొని గన్నేరావలంబైరు చే
సిన భద్రాక్షలు ద్రాక్ష లిక్షువులు రాజీవాక్షుఁ డీక్షింపఁగన్. 20

సీ. మారేడు కడనున్న నేరేడుతోఁ గూడి జీడి పోయిన యేఁడె చెట్టు గట్టెఁ
దీరంటఁ బెరిఁగిన గోరంటతో మొన్న చిఱుదివ్వెలకె మావిచిగురులొత్తెఁ
బూపొన్న సురపొన్న యూపొన్న విరిగన్న పున్నమ తొలునాఁడె పూవుమొనపె
గొజ్జంగి యిజ్జాజి పజ్జం గిసల మొందు నెలకె కస్తురియు గన్నేరయుఁ బూచెఁ
గీ. దొగరు టిగురుల ధరగట్టు తోపు రూపు
తోఁపుఁ గనుమని చేఁజూపు తోఁటపాటు
మోపు గొని రూపు చేసిన ముసలికాపు
మొసలి పోగుల యొసపరి కెసఁగ నపుడు. 21

ఉ. అమ్మ పరాకు రాకు చిగురాకు జిరాకతీ మేని పాదుశా
కమ్మరుమీ పిరంగి గడుగం గడుఁ గ్రమ్మిన నీటిజీరుకుం
దమ్మికొలంకు సుంకు విడఁదన్నిన పొన్నల గున్నలం దుమా
రమ్ములు లేఁచె నోచెలి! కురంటక మంచుఁ జిరంటి తెల్పఁగన్.[1] 22

సీ. కురుమావి పొదయెండ గరుకందు కందునో మొగమంచు నరిగెల మగువ లంట
గనిమ లించుక దాఁటిఁగొ నిల్కునో యంచుఁ గైదండఁ జెలులండఁ గాచి తిరుగఁ
బుప్పొళ్ళతిప్పలు గుప్పించ మైచెమర్చునొ యంచుఁ బావడ సుదతు లొదవఁ
బొదఁదూఱ యొరగ్రొవ్వెద యింత చెదరునో యనుచు సైరంధ్రులు వెనుకొనంగఁ
గీ. గుంచె కాళాంజి యడపంబు గొన్న యున్న
రామ లుడిగంబు చలుప నారామసీమఁ
బ్రేమ విహరించె నవహిమ ధామ గర్వ
ధూర్వహన ధామ సత్యావధూలలామ. 23

క. దళవర కురవక వకుల ము, కుళ కుళకోపరి పరీత ఘుమఘుమిత పరీ
మళ లహరీ బహు విహరణ, మలయ మహీనిలయ మహిత మారుత మొలయన్. 24

మ. తపనీయాంతపనీప తత్పరిమళోద్యత్పుష్ప మాధ్వీకపా
ళి పరాగాళి పరాగ రాగ భవమల్లీ వల్లికాజాత శీ
త పలాశీ తరులాశి దిగ్గజని కాంతగ్రావ కోటీ కుటీ
విపులాంతర్విపినాంతరంబు లలినీవేణు ల్విలోకించుచున్. 25

సీ. ఒక చెట్టు చాలుఁ బో యుగ్రాంశు పేరెండ సుడివడ్డ లేగాడ్పు నిడుము కొనఁగ
నొకతేనె చాలుఁ బో మకరాంక హలహలా హలయుక్తగల తిక్తతలు దరల్ప
నొకపూవు చాలుఁ బో యుదధి నందన చందన ప్రసూనముపై మనంబు మాన్ప
నొకచల్వ చాలుఁ బో యుడు పరివృఢ గాఢ రవియోగ తనుతాప రౌద్ర మడఁప
గీ. మమ్మయని మావి కడవ్రాలి మధువు గ్రోలి,
ననకబరిఁ జెక్కి పొదల సీతునకుఁ జొక్కి
మ్రొక్కి చక్రస్తనీమణుల్ నిక్కి గోస్త
నీ ఫలము మెక్కి యామెక్కి నెఱసి రచట. 26

చ. పరువులు వెట్టుచుం జిలుకఁ బట్టుచుఁ బుప్పొడి తిన్నెఁ దొట్టుచుం
దరువులు చుట్టుచుం బుజము తట్టుచుఁ బూఁబొదరిండ్లఁ దెట్టుచుం

---

[1] సీ. సికపువ్వు టెత్తు తావికి వెంటఁ బడుతేంట్ల, ఝంకృతి మాధవ స్వనముగాఁగ-
కూచిమంచి కవిచే ఉదాహరింపబడిన ఈ పాదము ఈ పద్యము తర్వాత ఉండదగినది.

దరువులు ముట్టుచుం న్విరులుదండలు గట్టుచుఁ గేలిగొట్టుచుం
దెరువులు మెట్టుచు న్ననలఁదేనియ యొట్టుచుఁ గూర్మిఁ దిట్టుచున్. 27

చ. పొగడలు దూసి పుట్టికలఁ బోసి రసాలయ సద్రసాలపుం
జిగురులు డాసి చీరికలు చేసి విభాసిలు బొందుమల్లియ
ల్మొగడలు కోసి పావడలు మూసి విరాజిల కన్నెజాజి తీ
వ గములఁ బాసి పూఁబొదలు వాసి పెనంగిరి మత్తకాశినుల్. 28

సీ. పన్నీటికాలువ పంతంబునకు దాఁటి జడఁద్రొక్కి వెనుకకు జాఱె నొకతె
పూఁదేని దొన దాఁటఁ బొరలి యొద్దురలిన నివ్వలి కింత లాగెత్తె నొకతె
బావి దాఁటెద నంచుఁ బరతెంచి లివ దప్పి జడిసి పై తరుశాఖ కొడిసె నొకతె
పదరి పందెమువైచి పొదదాఁట నెగయుచో వేణిచుట్టినఁ గొమ్మ వ్రేలె నొకతె
గీ. తరుణ సహకార శిఖ బిట్టు దన్నె నొకతె,
లీల విటపంబుపైఁ జొకళించె నొకతె
మ్రొక్కి చివచివ పోఁక మ్రానెక్కి నిక్కి
కొంత [1]పిన్నం మింపుగాఁ గొనియె నొకతె. 29

చ. మన మొక మాటె యెల్ల యెలమావుల నీడలఁ బవ్వళింపమా
చనిచని యొక్కమారి కెలచల్లని మావులనీరు ద్రావమా
నన లొకసారి యన్నియు ఘనధ్వనవేణి కలంకరింపమా
యని యన మానసం బెసఁగె నవ్విరితోఁట వెలందిమందికిన్. 30

క. అయ్యాలకాపు తొయ్యలు, లుయ్యేలలం దూఁగఁ గుచభరోద్ధతి రాలెం
బయ్యెదలో ముక్తావళు, లొయ్యారుల యడుగు లూడ్చె నుడుగణ మనఁగన్. 31

క. మిన్నంటఁ బదములుం దల, యన్నుయ్యేల మీఁద నుండి యటు నిటుఁ దూఁగెన్
వెన్నుని పాదము మదమునఁ, దన్నిన దోసంబు దొలఁగఁ దలమోచె ననన్. 32

చ. తిలకము సొంపు మించెననఁ దీర్చితి నేర్చినమాత్ర యంచుఁ దాఁ
బలికె నొకర్తు రంగలరెఁ బాపట నాకొనగోటనే సుమీ
యలవడుటంచు నాడె నొక యంగన పాటలరీతి మేలనన్
బెళకుగఁ బాడనేరనని బిత్తరి యోర్తు తరుస్తుతస్థలిన్. 33

సీ. హిమగంధ సంధాయి సుమనో ముహుర్ముహుఃపతన లతాగృహాభ్యంతరములు
కదళీ దళపుటీవిగళదామ్ర మకరంద శీతల భూమిభూమీతలములు

---

[1] గణభంగం జరిగింది. 'కొంత పన్నిద మింపుగా గొనియె నొకతె'- అని సవరించవచ్చును.

నాళాగ్ర ధారా పునఃపునరుత్పతజ్జంబీర జలసూత్ర సౌధశిఖలు
నరహరి దచ్చదా వరణలామజ్జ కోజ్జ్వల కాయమానైక సైకతములు
గీ. మధుకరీ గీర మాధవీ మంటపములు
మదన బిరుద కథాసుధామత్త శుక ని
నాద భేద ప్రసన్న పున్నాగ వాటు
లాటపట్టయ్యె గోపికాకోటులకును. 34

ఉ. క్రోవిఁ గవుంగిటం బొదివి గోఁగును నూరిచి మాటలాడియు
న్మావిని ముట్టి వంజులము మట్టి తుదిం దిలకంబుఁ జూచియు
న్పావిలి నూర్చియుం బొగడ వారుణి గ్రాసియుఁ బ్రేంకనమ్ముఁ దా
మావలఁ బాడి పొన్న నగి యాస్యము సంపఁగి కింత యెత్తియున్. 35

సీ. చూడక యాలేదు సూనంబు తిలకంబు ననమాట రాక కొమ్మనదు గోఁగు
ముట్టికొనక మావి ముకుళంబు చూపదు నగక కూర్పదు పొన్న నవ్య సుమము
పాటేరు పడక నింపదు ప్రేంకనము విరుల్పొగడ పై నుమియక పూవు గనదు
మొగ్గ సంపఁగి పైకి మోమెత్త కీనదు కంకేలి తన్నక కళికలిడదు
గీ. క్రోవి గౌఁగిటఁ జేర్పక కుసుమ మొసఁగ
దలరు నిట్టూర్పు విడక వావిలియుఁ గురియ
దౌర యొకదారి నివి తెగుదారులనుచుఁ
గిసలయోష్ఠులు ప్రసవము ల్గొసరి కొసరి. 36

క. నాళీకాళీ ధూళిమ, ధూళీ ధునిధోరణీ మధువ్రత మౌళీ
తాళీడగ నప్పాళీ, పాలిత కంకేళి కేళి భళిభళి యనుచున్. 37

చ. చిలుకల లోనఁ జిల్కలయి చెల్వఁపుఁ బొన్నల లోనఁ బొన్నలై
యలరుల లోనఁ దామలరులై నును దీవల లోనఁ దీవలై
తలిరులలోనఁ గెందలిరు తండములై మృదువాణు లగ్ర్యనా
భులు దరహాస లుజ్జ్వలవపు ల్మధురాధర లాట లాడుచున్. 38

శా. రావే శౌరిశిరోమణీ హరిమనోరాజీవసంజీవనీ
గోవిందప్రియభాషిణీ విధునిధీ కుబ్జావిటప్రేయసీ
యోవిష్ణూత్సవదాయినీ మధురిపుప్రోత్సాహినీ యంచు న
ప్పూవుందోఁట మురారి వారిజముఖుల్ పుష్పగ్రహవ్యగ్రలై. 39

శా. కొమ్మా పాదిరికొమ్మ కమ్మవిరిఁ గైకొమ్మా చలమ్మేల రా
నిమ్మా నిమ్మలనీడ నిమ్మగువ దానిమ్మాసఁ జేరంగ దా

చూత పరిఫుల్ల భల్లాతకీ తమాల
తరులఁ దరుణులు విడివడి విరులు చిదిమి. 47

లయగ్రాహి

కుందములు ద్రుంచి యరవిందములు గాంచి మకరందములు నించి నిజతుందములకున్నా
కందములు చేరి చిగురందములు దూఱి మధుబృందములఁ గోరి తమి డెందముల నాదా
నందముల వ్రాలి విరిగందములఁదేలిన మిలిందములఁ ద్రోలి రొక చందమున వేఱిం
గందములు మీటికని చిందముల నేటికని కుందములఁ జాటిన ముకుంద ముకురాస్యల్.

ఉ. త్రుంచిన మోసులు న్విరిచి త్రోచిన కొమ్మలు చించి నాకులుం
దించిన కాయలు న్సగము ద్రెంచిన తీఁగలు రాల్చుపూవులు
న్వంచిన లేఁతమ్రాకు లయి వాటపుఁ దోఁట కపివ్రజంబు సం
ధించిన నాఁటి యమ్మధువనిం దలపించె వెలంది రాయిడిన్. 49

మహాస్రగ్ధర. మధురానాథు న్వధూటీ మధు మధుమథను న్మాధవుం గూడి యంత
న్మధుపాళీ మాధుపాళీ మధుర నినదము న్మాధవీ సౌధ వీధీ
విధు రంభాస్తంభ శుంభద్వివిధ విహృతులన్వీటి వీటిష్ఠకాసా
ర ధర ల్బింబాధర ల్చేరఁగఁ జనిరి మహాస్రగ్ధరల్ ముగ్ధగాత్రల్. 50

చ. తటములఁ జుట్టుకొన్న బిగిదన్నిన క్రొన్నన పొన్న గున్నలం
జిటపొట మంచు మంచుజడి చిల్కెడి గొజ్జఁగికి న్రసాలపుం
జిటిపొటి తేనెవానలకుఁ జేసిన కాల్వల తేటనీటి ప
ల్లటముల నిక్కు నక్కొలఁకులచ్చికి మెచ్చిరి వచ్చి నెచ్చెలున్. 51

ఉ. గాత్రము మోయలేని యుదకంబుల కోర్వక పద్ద మబ్బునాఁ
జైత్రుని పూవుఁదేనె కణజంబన శీత ఘృణీ స్ఫురన్మణీ
ధాత్రి జనించు దైవతపథ ప్రతిబింబ మనంగ వచ్చులో
కత్రయభర్త కిద్ద జముకాణ మనం గొల నొప్పె నెంతయున్. 52

క. కలకల హసదంబుజ నిజ, కల కలహంసీ రథాంగ కలకల కులకో
మలమలయ నిలయ మధురా, నిల నిలయము కొలను వలను నెలఁతలకొసఁగెన్.

క. అట్టి యెడ నైందవోపల, పట్టికలం గట్టినట్టి పలుమెట్టికల
న్మెట్టి డిగి కొలను జొచ్చిరి, చెట్టాపట్టాలు వట్టి శీతాంశుముఖుల్. 54

**లయవిభాతి.**

మిసమిసని చన్నుఁగవ పసలు గని జక్కవలు బిసబిస బిసప్రసవ వసతి డిగిపాఱ
నొసలి పయి ముంగురుల యొసపరితనంబునకు భసల విసరంబులును దెసలఁ బరువెత్తన్
గుసుమ విశిఖాస్త్రములఁ గుసులకు నడంచు కను మిసిమి సిరి బేడిసల నిసువుల నదల్ప
గిసలయ విభాతి రుచి లసితపదము ల్కమఠి కసరి విసర న్సరసి మసలిరి కృశాంగుల్. 55

క. అల్లేమ చను హళాహళి, వల్లనె కా దల్లవళి వివాదావళి రా
నల్ల వళావళిగల యా, కల్లోలము లెసఁగె హల్లకల్లోలముగన్. 56

క. గుభులు గుభుల్లని దుమికిన, రభసంబున నెగయు నీరు రాజీవముచే
నభమిభ వరదుని పదమని, యిభగామిని యొకతె గడిగి యిడియెం బాజల్. 57

క. దరిమెట్టి జిరుకుఁజట్టులఁ, జరణంబులఁ జక్కఁజాచి జాఱిరి చామల్
సరియే మాపదముల కని, యరుణాబ్జము శిరము ద్రొక్క నరిగిన కరణిన్. 58

చ. కొలఁకు కెలంకుఁ జేరి మఱికొందఱు జీరుకుఁజల్వరాచరా
పలకల వెంట జాఱి మొలబంటి జలంబుల నిల్చి రింతు లిం
పుల హరిదృక్పరంపరల ముంచిన యాత్మ గభీర భవ్య నా
భులకు సరోవరంబు సరిపోదని లోఁ దెలిఁగించు కైవడిన్. 59

సీ. ఒకచక్కి మోలకు లికుచ కుచా కచోచ్చయ మింత యొడిసి కేశవుఁడ వైతి
వనిత చేకొలఁది వైవఁగఁ దుందమంటిన తమ్మిచేఁ బంకజోదరుఁడ వైతి
తనజోడు మత్స్యయోధరమంచుఁ గోకంబు వడఁ బట్టుకొని చక్రపాణి వైతి
పూఁదేనె యరవింద పుటిఁజెంద సఖికేల నుందట్టి మధుమథనుండ వైతి
గీ. కమ్మ తామర పుప్పొడు ల్కంబుకంతు
లొండొరులు చల్లఁ బీతాంబరుండ వైతి
నేఁడు నిజమంచు నగఁజొచ్చె నీటిలోన
మగని గుణపేటి సత్యభామావధూటి. 60

సీ. మీఁదఁ జల్లకమాన మిట్టిమీనై పడ్డ ముంతు నింతకు మోము ముడుచుకొనినఁ
గూడనిత్తునె మాఱుకొని మోరయెత్తినఁ గదిమెద నోరింత కంటెఁ జేయ
నేఁజిక్కు వడుదునే యెటకుఁ జేచాచినఁ బంత మిత్తునె యెంత భంగపడిన
డీకొందు నెంత నీటికి నడ్డగట్టినఁ బాఱఁబట్టుదు నెంత బలిమిఁ గన్న
గీ. ననియె సాత్రాజితీదేవి తనదు ప్రియ స
ఖీ లలామలఁ గాసార కేలిఁ గొట్టి

కేలి గురువట్టి వసుదేవు మేలిపట్టి,
పీలి నెట్టెంపు జగజెట్టి గేలిగొట్టి. 61

సీ. నునుకురుల్ శైవాలమనుచు లాగితిఁ గాని కుటిలత్వ మెఱుఁగనే కుముదగంధి!
మించు గుబ్బ రథాంగమంచు మీటితిఁ గాని కాఠన్య మెఱుఁగనే కంబుకంఠి!
పొస మంభోరుహం బంచు గిల్లితిఁ గాని యతిరాగ మెఱుఁగనే హంసయాన!
గట్టివాలుగ వాలుగనుచు ముట్టితిఁ గాని చపలత్వ మెఱుఁగనే సైకతకటి!
గీ. భంగముఁ దలంపవలదు తరంగవళిక
వలదు వడిసుళ్ళమాట లావర్తనాభి
యేల యిటులాడ నాళమృణాలబాహ
యనిరి భృంగావలోక లయ్యంబుకేళి. 62

చ. కలకల గొగ్గతోయముల గగ్గలకాడగు హంసచక్రము
ల్కెలఁకులఁ జేరు శైవలము క్రేవల వెల్వడు కల్వతేకులం
దెలివి దొఱంగు తామరల తెట్టువ గట్టిన తమ్మిపుప్పొడు
ల్గలిగి కొలంకు వోలెఁ గలకంఠులచే గిరిఘూర్ణితాంబుధిన్. 63

క. ఉదక వినోద క్రీడం, జెదరిన సారంగమదముచేఁ జేతి శత
చ్ఛదమున మైపుప్పొడితో, యదుకులకుంజరము సరసిమైౖ వడివెడలెన్. 64

సీ. చేయీఁత చాలింపఁ జెల్లుఁబో చల్లగాడ్పులదిట్ట దఱి మెట్ట నిడదుగాని
యోలవీడఁగనాడు టొప్పుఁబో హిమగంధ పాథోధరం బొడఁ బడదు గాని
తగిలిపట్టుట మానఁ దగవెపో మరుతేఁటి తెగ పాట వగ సమ్మతిలదు గాని
మునిఁగి తేలుట డించఁ దనరుఁబో రాయంచ కోడె నెన్నడ యీయకొనదు గాని
గీ. యనుచు నొకభంగి కాసార మపుడు వెడలి
రొదలి బదలిక కైటభద్విడలికచలు
కదలుదురె నాఁటి కెగ్గడికత్తె కేలి
చికిలి బెత్తంబు తరు లింత చేసెఁగాక. 65

క. చాలించి కేళి పొన్నన, చాలించిన వలువఁ గట్టి చామీకర వ
చ్చేలాధర జితమణులకు, చేలాధర హావభావ హేలాధరలై. 66

సీ. ఒడ్డాణ మిదినాది యొడ్డార మేటికే యొడ్డా యయో దీని కువిద నీకుఁ
గట్టాణి సరి యీక కట్టా చెలియ తలకట్టాయె జగజెంత కట్టదులకుఁ

గడియాలడంచుట కడియాలములకె యెక్కడియాలమబ్బె నీగబ్బితోడ
ముంగైమురారి నాముంగైని నిదుమన్న ముంగై పలుకవే కురంగనయన

గీ. పేరు దెమ్మన దూఱెదు పేరు గ్రుచ్చి
తాళి యడిగినఁ గసరెదు తాళికొనక
యనుచుఁ గైసేసి మత్తకాశినులు డాసి
రాశఁ గోసి పలాశి భిదాసితాశి. 67

ఉ. గచ్చు టరంగులం బసిఁడికంబముల న్వెలయెచ్చు పచ్చరా
లిచ్చిన డాకులం బని రహిన్ రహి దెచ్చిన కొల్చు కెంపు మే
ల్మచ్చుల ఖేచరీ చతురలాస్య విచిత్రచరిత్ర చిత్ర చే
తోచ్చయ రుక్చకచ్చకల నొచ్చెముద్రోచిన మేడ చెంగటన్. 68

క. వనితలతోఁ గాసారా, వనితలతోయజ సమగ్ర వాసన సనుత్రో
వన భోజనందనాపతి, వనభోజన మొక రసాలవాటిం జేసెన్. 69

సీ. రంభా దళంపు టోరల నుప్పుపొడులపై సాహకార శలాటు సమితి వడియెఁ
గడల వడ్డన లిడ్డ కమ్మని వడలపైఁ దరుబృంద మకరంద ధార కురిసెఁ
జేకొలందిగ వంచు చీనిచక్కెరలపై నంశుమత్ప్రల చయం బవిసిత్రావెలె
నతి శీతలతఁ గన్న హంసోదకంబుపైఁ బాటలీ కుటసూన పటలిత్రావెలె

గీ. సిగలపై శారదజలంబు చిందెవల్లి,
తనులపైఁ బర్హతాలవృంతములు దిరిగె
సంతతాయత్న కృతవస్తు సౌఖ్య మొసఁగె,
నేజనం బెంచ దీవనభోజనంబు? 70

శా. ఆక్రమాసవ తామ్రపల్లవ నవామ్రావాస భూభోజనం
బా కూలంకష దీర్ఘికా సురభి కల్హారాంబు సంసేవనం
బా కర్పూర కదళ్యుదార మృదు వాత్యానర్తనాత్యాదరం
బా కౌంతేయ సహాయ కామినుల కాహోహో యొనర్పింపదే. 71

క. జాంబూ నదపుం బూనిక, డంబూరు మఱుంగు పచ్చడంబాని కటిం
బింబోక కదంబోజ్జ్వల, బింబోష్ఠీ కుముదినీందు బింబోదయుఁడై. 72

శా. వీణావాద్యము గద్యపద్య కవితా విద్యా వినోదంబు క
ల్యాణీ కన్నడ పారసీ ముఖ ముఖాలాపంబు లానద్ధ క
ల్యాణీ భూత విచిత్ర లాస్యము ప్రశస్యాంభోరుహాస్యామణుల్
త్రాణంజూప మురాపహారి హరి యుద్యానోర్వి నుండెం దగన్. 73

వ. అనిన విని మురాసురారాతి తరువాతి వృత్తాంతం బెఱిఁగింపుమని యడుగుటయు 74

శా. భాషా వాక్య విశేష శేష భువన ప్రచ్ఛాది ఘోటచ్ఛటా
హేషా హస్తిక ఘోష ఘోషమహితాప్యద్వల్లభప్రాపితా
శేషారిక్షితియోగ యోషధిపతి శ్రీపూర్తికీర్తిప్రభా
తోషాపూరిత దిక్చకోర చయ పాథోధీశ ధీషణ్ముఖా! 75

[1]ఉత్సాహము. కటక ఢిల్లిపుర మతల్లి కాలిజాగ రాము దా
కటక మాహు రీశిరాజి ఘటకలంబ మండువా
ఛట చకోర లోచనా కుచద్వయీాల సత్తటో
త్కట పటీర శాద సదృశ దశదిశా విశదృశా 76

క. కదన త్రినేత్ర వాణీ, మదిరాక్షీ నటన రంగ మందిర వదనా
మదనాగ కామినీజన, మదనా మదనాగతురగ మానితసదనా! 77

గద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్ర కరుణానుగ్రహ శాశ్వతైశ్వర్య ధుర్యతా మహేశ్వర రూప రేఖా విజిత రతీశ్వర సరస సంగీత సాహిత్య సకల కలావిచక్షణ సమాశ్రిత విద్వత్కవి రక్షణ దక్షవీక్షణ యినిగెల గోత్రపావన పరిపంథి రాజకల్పితపాదసేవన దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాంబా గర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవ శేషభాషామనీషాబల ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయక ప్రణీతం బైన బహుళాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



[1] సుగంధివృత్తమని పూర్వముద్రణము. కాని ఇది ఉత్సాహవృత్తము.

శ్రీరస్తు

# బహుళాశ్వచరిత్రము

## తృతీయాశ్వాసము

క. శ్రీతరుణీ రమణ పదా, బ్జాతరుణీ భూతహృదయ పరమద హృదయా
నీత సుధీవ్రాత దయా, యాతత విభవేంద్ర వేంకటాధిప చంద్రా! 1

ఉ. అంతట గోపికాహిత హృదంబుజమా బహులాశ్వమేదినీ
కాంతునిపై ఘటించి రతికాంతుని తండ్రి నిజాంగనా గణం
బంతిపురంబున న్నిలిపి యచ్చట సర్వబలంబు లప్పుర
ప్రాంతములందు డించి గమనాప్తికి సప్తి నెదం దలంచినన్. 2

గీ. చట్టుపలఁ బుట్టులేగాడ్పు కొట్టునకును, జెట్టుకాయలు రాల్చిన యట్టు నిట్టు
తొట్టు తొట్టునఁ దారక ల్పిట్టుడుళ్ళఁ బిట్టదొర శౌరికట్టడ కుట్టుపడియె. 3

గీ. ఉట్టిపడి మ్రొక్క గతిఁ దెల్ప నురగవైరి, వెన్ను వెన్నునఁ గొని విన్నువీథి కెగసె
నగశిఖరులెల్ల సిగవట్టి దిగిచినట్లు, హల్లకల్లోలముగఁ బ్రాఁతు పెల్లగిల్ల. 4

గీ. ఎగసి మిథిలానగరి బాయ నిగిడి గరుడి, చక్క నడతెంచి జవమెక్క తిక్కత్రోవఁ
దనదుపైఁ జక్కు గరుడ కేతనము గదలఁ, గడలిపైఁ బాఱు కప్పలి కరణినపుడు. 5

సీ. చుట్టువేడెము బట్టుచూపుచోఁ గడగట్టి ఘటకారచక్రసంగతి భ్రమింప
నడ్డవేడెంబింత యిడ్డవేలుపుఁ జెట్టు పన్నగ గమన సంపదలఁ గదల
నట్టునిట్టు దువాళి హవణింప నాసులో [1]క్రోవినా వలిమెట్టు గునిసియాడ
జోడనల్ దూటించుచోఁ గవ్వపుంగొండ వెనువెంటఁ బుట్టచెండనువు మొనప
గీ. నిడివి నడతెంచు చోటను జడద పటలి
గాలిపటముల రహిఁ దెల్ప గగనవీథిఁ
బులుఁగుబొల్లఁడు గాడ్పు చాడ్పున జగంబుఁ
జౌరఁజాలు గరున్మరు జ్జవము నెఱపె. 6

[1] సూర్యనిఘంటు పాఠము. క్రొచ్చి-పూర్వముద్రణ పాఠం.

క. సింగాణికోలవారిన, రంగునఁ దన గరులు రింగురంగుల మెరయన్
బంగరుచాయపతంగ తు, రంగము హరి మోచి నిబ్బరంబునఁ బఱచెః 7

చ. పఱచి మురారి చేల నిజపక్షరుచిచ్ఛట లభ్రకోటికి
న్మెఱపులు గుమ్మరింతలయి మిన్నొఱగంటికి మచ్చగీఁతలై
చుఱుకు వెలుంగు రంగు జిగి సోఁకనిచోటికి లేఁతయెండలై
కొఱనెలతాల్పు దుప్పటులకుం దొగరంచునునై రహించఁగన్. 8

మ. కరిరాట్పట్టన హట్టనారుల నిరీక్షా తాళతళ్య ద్యుతుల్
హరి కన్గొంటివె మింటికెత్తిన మొగం బమ్మక్క మ్రొక్కించె ము
క్కర చేర్చుక్కకుఁ జేరు చుక్కజడతోఁ గాత్రద్వెడిం జిత్తభూ
తరవారిక్రియ ధాత్రి కీలుజడయుం దర్పించి కోరాడెడిః. 9

సీ. అదె భానుఁడు ప్రతీచి నుదయించితమము చిక్కెనఁ దెచ్చెననుచుఁ బల్కెడు నయోధ్య
యదె తటిల్లతిక పూర్వాబ్ధిపానార్థమై యద్దంబు గొనివచ్చె ననియె మధుర
యిదె హాటక విమాన మెక్కించి కరి వజ్రి కప్పతి యంపినాఁ డనియె మాయ
యిదె హేమ సుమ రథంబెక్కి కంతుఁడు సుధాంశుని గూడుకొనివచ్చె ననియెఁ గాశి
గీ. వాసిగా నోషధీ శైల వరము నుతికి
పెతికికొని తెచ్చుచో నింత పితికి గాని
హరికి సరివచ్చు నని యనినది యవంతి
నిన్ను మోచిన ననుజూచి నీరజాక్ష. 10

మ. అదె వాహ్యాళి బహిర్మహీ మహిత హర్మ్య స్వర్ణకుంభంబుపా
న్నదె ప్రాక్కచ్ఛప గామ్యగాధ పరిఘా ప్రాంచన్మణీ వప్ర మ
ల్లదిగో ధూర్జటిధర్మ ధూర్వహన సమ్యక్చంద్రశాలా ధ్వజం
బదె వైదేహ వివాహ గేహతిలకం బంచుం బ్రశంసించుచుః 11

క. చేతోగతిచే భుజగా, రాతి వియత్పదవినుండి వ్రాలె న్మిథిలా
భూతలమున వాతాహతి, చేతంబడు నాఁటి మేరు శృంగం బనఁగః 12

క. జననీ దాస్యముఁ ద్రోచె, న్మనుపమ్మృతముఁ దెచ్చి పక్షిమూర్ధన్యుఁడు నేఁ
డునుపేంద్రామృత దాతృత, జనకుని దాస్యంబు నిలిపె జగమరు దనఁగః 13

మ. శతపత్రాక్షుఁడు ప్రోలుచేరి బహులాశ్వప్రాంగణం బంటినః
శ్రుతదేవుండది వేఱచూచు బహులాశ్వుం ద్రోచి మున్మున్న యీ
క్షితిదేవోత్తము నిల్లుసేర నృపుఁడుం జింతించు నంచు న్రమా
పతి యందిర్వుర కేకకాలమున రూపద్వంద్వముం దాల్చినః 14

క. శ్రుతదేవు నింటి ముంగటి, కతిజవమున వ్రాలె నప్పుడంతకు మునుము
న్నుతగేంద్రు డిగ్గి డిగ్గన, శతపత్రాక్షుండు నృపుహజారముమ్రోలన్ 15

సీ. జానకీధవ పదధ్యాన ప్రమోదాస్య కమనీయ గండభాగముల వాఁడు
రఘురామ చరణ స్మరణ ధీ వికస్వర స్వచ్ఛ రోమాంచ గుచ్ఛములవాఁడు
రామర్పితాన్న సత్రప్రహృష్టద్విజాశీరక్షత స్నాత శిరము వాఁడు
రఘుకులాధిప ఘనాప ఘనసాక్షాత్కార చిత్తాబ్జ మన నమస్కృతులవాఁడు
గీ. హృదయ మృగమద రేఖామహీదుహిత్ర
ధీశ సింహాసనత్కనద్దివ్య రత్న
నూత్న పదకంబు వాఁడు భూనుతుఁడు జనకుఁ
డపుడు కొలువుండి హరిరాక హవణు వినియె 16

ఉ. అమ్మహిభర్త వించునె రయమ్మున లేచి భయమ్ము భక్తి డెం
దమ్మునఁ గప్పి ముప్పిరిగొనం గొనసాగిన యానధాటి హ
ర్మ్యమ్ములు దాఁటి రామజపమాలిక నేలిక నెన్నుకొంచు నె
త్తమ్మి కటారి రాచదొర తండ్రి పదంబుల వ్రాలె నయ్యెడన్ 17

క. కదలి దొర కూర్మి యల్లుని, యడుగులఁబడి విడువఁజాల కన్నరపతియుం
దడిచెమట ముజ్జగంబులు, గడిగిన పాదములు కడిగెఁ గన్నీటిజడిన్. 18

శా. లేవోయన్న సుభద్రయన్న పదనాళీకంబు భూమీధవుం
డేవేళన్ విడఁడయ్యె నందదరవిందామందమారంద హే
లా విస్రంభ మిళింద డింభక మదల్పం బోనిచందంబునన్
భావత్పల్లవపాణి కోకిలము తేవం బోని చందంబునన్. 19

చ. మురహరుఁ డెత్తెఁ బాదముల మ్రొగ్గిన భూవిభు నాల్గు చేతులం,
బురహరుఁ డాయుధం బిడిన పోలిక ధాత సృజించెఁ దత్పురీ
ధర జనకాకృతి న్నిలుప దన్ గని మ్రొక్కిన యాత్మభక్తికిన్
గరచరణాదు లబ్బెనని కౌతుక చాతురి నెత్తువైఖరిన్. 20

క. హరి లేవనెత్తి యుర్వర, నురమత్తిన యిసుము దుడిచి యుర్వీశు [1]క
తర బాష్పధార తనబం, గరుదుప్పటి నొత్తి బత్తి గడలుకొనంగన్. 21

క. అప్పరమభక్తు వక్త్రమె, తప్పక కనునప్పు డెదను దాత్పర్యరసం
బుప్పతిలఁ బట్టు చాలమి, గుప్పునఁ గన్నీరు వచ్చె గోవిందునకున్. 22

---

[1] గణభంగము.

శా. ఆ కంసారికి డా కరం బొసఁగి జీరాడంగ బంగారపుం
గోకంచు ల్వలకేలఁ బట్టి హరిఁ దోడ్కొంచు న్నిజాంతఃపుర
ప్రాకారంబులు దాఁటి హెగ్గడులు యోరల్వట్టి యట్టిట్టుపో
వాకిళ్లెల్లను దూఱి, చప్పరము లోవంజేరి రాజయ్యెడన్. 23

మ. మగరాటంకు మిటారి పచ్చ నవలా మంజిష్ఠి రెంటెంబుసో
యగపుం గల్మికిఁ గ్రొత్త లత్తుకల చాయల్ దిద్దజాల్ నిద్దపుం
బగడంపుం బనికంబపుం బసలు కన్పట్టంగ బిట్టెత్తి క
ట్టు గజం బెన్నుదికట్లు దిన్నతెర మీటుల్లగ్లు సౌధంబునన్. 24

క. శయ్యాగార సమీప ని, కాయ్యాజిర రచిత రత్న ఖచిత వితర్దిం
చెయ్యాదు రత్నకంబళి, నయ్యాదవ సార్వ భౌము నయ్యెడ నుంచెన్. 25

క. అందు గుణసింధు బంధులఁ, జందన గంధుల నిజాంబు జాతేక్షణలన్
నందప్రియనందనునకు, వందన మొనరింపఁ జేసి వర్ధితభక్తిꣳ 26

క. పన్నీటఁ గడిగి పదములు, పొన్నల పొన్న నలశౌరి పూజించుచుఁ ద
త్పన్నీరము నిజశిరము ప, యిన్నృపతి వహించి గృహమహిన్ రహిఁ జిలికెꣳ27

క. అప్పుడు రమ్మని మురహరుఁ, దప్పన యిడఁ గూరుచుండి హరి హస్తాబ్జం
బప్పార్థివుఁ డౌదల నిడి, చొప్పడ నేత్రముల నొత్తుచుꣳ బేర్కొనుచుꣳ 28

సీ. గోరక్షణమునకై గోవర్ధన మహీధ్ర మెత్తిన నాఁడెంత యిల్కె నొక్కొ
కువలయాపీడంబు కొనగొమ్ము వట్టి పెకల్చిన నాఁడెంత కందెనొక్కొ
చాణూర మల్ల వక్షఃకవాట తటంబు వొడిచిన నాఁడెంత యిడిసె నొక్కొ
యుగ్రసేనునిపట్టి నొడసి ముందలవట్టి తిగిచిన నాఁడెంత తెగియెనొక్కొ
గీ. కటకటా తమ్మి తలిరుల కంటె నున్న
నున్న యిక్కెలు గాసి కెట్లోర్చె మిగుల
నొగిలె నో తండ్రి యని తొంటి నొప్పి దీఱ
నట్టి వలచేయి గట్టిగాఁ బట్టిపట్టి. 29

సీ. బండిరాకాసిరా దండి రాకాసించి పడఁ దన్నుచో నొప్పి దొడరకున్నె
కాళియాహిస్ఫటా కాళియాహతిచోట నుత్తమాంగంబు రాలొత్తకున్నె
కడిమిచెట్టునకెక్కి కడిమి మైఁ గాళింది నడిమికి దుముకుచో నలఁగ కున్నె
మగలరాయని తేరి నొగల నుండి ధరిత్రి వగుల గుప్పించుచో నొగులకున్నె
గీ. క్రొత్త నెత్తమ్మి కంటెను మెత్త నైన
యిత్తలిరుటాకు టడుగంచు నీశ్వరాంఘ్రి

యెత్తియెత్తి కనుంగవ నొత్తియొత్తి
బత్తివర్తిల్ల నారాచహత్తి పలికె. 30

శా. పాతాళంబున నిల్లుగట్టి బలి నీ బంటౌంటి మైనుండcగా
భ్రాతంగాదని నీవ దిక్కని పదాబ్జం బౌదలం దాల్చి వి
ఖ్యాతిఀ లంక విభీషణుండు కలుగంగా మౌను లట్లుండcగా
నాతండ్రీ! ననుcగోరి వచ్చితిటకుఀ నాభాగ్య మే మెంచెదఀ 31

ఉ. కొండలఁc గోనలం నిలిచి కూటికిc గూరకు వింత యింత లే
కెండకు వానకుం జలికి నిచ్చc జలింపక రాcతcజేసి న
ట్లుండి నినుం దలంచు నరు నొక్కని దాcకి తలంచవీవు నా
యండకు వచ్చి నా వెతల నన్నియుc దీర్చితి నందనందనా. 32

క. భక్తులు లేరో మారుత, భుక్తుల ముక్తులకుc బాలుపడు శమదమసం
భక్తులు లేరో నీ పద, భక్తులు లేకున్న నాకు ఫలదుcడ వనుచుఀ 33

క. అభివందన మానక దుం, దుభినందనమణికిc జేసి తోయద రేఖా
నిభునిం దనపాలిటి శ్రీ, విభునిం దనరించె నతుల వివిధస్తుతులఀ 34

వ. అప్పుడు పరమానంద రమా కందళిత హృదయారవిందుండై గోవిందుండు
భూపురందరున కిట్లనియె. 35

మ. అల రుక్మాంగద శౌనకార్జునులc బ్రహ్లాదుఀ శుకుఀ వ్యాసభీ
ష్ములను న్నారదునిం బరాశరు వసిష్ఠుం బుండరీకాంబరీ
షుల నాదాల్భ్యు విభీషణుం గనమొ యాసొంపు ల్విమర్శింపమో
యలఘుగ్రామణి నిన్నుc బోలcగల దాసాగ్రేసరుం గంటిమే. 36

సీ. ఈ యింతుల కటాక్ష మిభరాజవరద పూజాంబుజంబున కభియాతి గాదె
యీజవ్వనులనవ్వు శ్రీజానిచరణ పుష్పాఘ్రాణమునకుc బ్రత్యర్థి గాదె
యీకల్కిగమి పల్కు కృష్ణకథాసుధామాధుర్యమునకు విరోధి గాదె
యీ చానగమిగాన మీశ్వర ముఖ కౌముదీ ధ్యానమునకు విద్వేషి గాదె
గీ. యిట్టి భోగ మహాభాగ్యహేల నోల
లాడుచుండియు మామీcది యాదరంబుc
దివియ వౌరౌర శుక వామదేవులకును
లేని సుఖ మబ్బె నీకు భూజానిచంద్ర. 37

సీ. మదనాగ గామినీ వదనాబ్జ దర్శనోత్సవ వేళ నానాభిc దలcపc గలcడె
ముకురాననామణీ చికురావలోకంబు తతి నా నెమిలికుంచెc దలcపcగలcడె

ఘనకచా కంఠ జఘన దృష్టియెడల నాదర సుదర్శనములఁ దలఁపఁగలఁడె
వరకటీ భ్రూలతా ధర వీక్షితముల నా ధర్మకౌస్తుభములఁ దలఁపఁగలఁడె
గీ. యొకఁడు నినుబలెఁ దమిరెంట నొకటి గాఁగఁ
గవులు తలఁచిన తలఁపులు దవులుగాక
చింత యిటు చేయనేటికిఁ జెల్లెనయ్య
రాజ ఋషివయ్య బహులాశ్వ రాజవర్య! 38

క. అని మెచ్చి పచ్చవిలుతుని, జనకుఁడు పడుకింటి పసిఁడి చప్పరమంచం
బునఁ బవ్వళించె బహుళా, శ్వ నరేశ్వరుఁ దూడిగింపు చాతురిఁ జూపన్ 39

సీ. ఇతరాస్య వీటికా ధృతహస్త మురవైరి విడెముఁగొమ్మని యోర్తు వేఁడుతెఱఁగు
తనువేఁడు చొకతె చన్మొన లంటి హరినోర్తు కొనకంటఁ గినుకంటఁ గనినచూడ్కి
కదలియల్లుఁడు పోఁకముడి యూడిచిన నొక్క యన్ను కన్నులు మూసికొన్న సిగ్గు
పుంభావ రతి దెల్పు పొలఁతి నలసి తంచు బిసరుహాక్షుఁడు పిక్కపిసుకు నెనరు
గీ. వనరుహోదరుఁ దేగు రంగనల కిచ్చు
క్రీడ నేర్పెచ్చు చిత్ర చరిత్ర పటము
లాగు గని చక్రి ధాత్రీ కళత్రుఁ బొగడె
మామక ధ్యాన మెందును మానఁ డనుచు 40

క. అపరాంబురాశి మునిగెం, దపనుఁడు దనకరములకును దగులక పంకా
ల్యుపధి న్వనధిం దాఁగిన, కపటాధము బైటవైవఁ గదలుట వోలెన్ 41

క. అది సుమాంజలి యిచ్చి మ, హాదేవుఁడు తెరువు గట్టు నటువలె నర్ఘ్యం
బొదల నిడి భూసురుఁడీ, యాదిత్యుఁడు బ్రహ్మమని రయంబునఁ దిరిగెన్ 42

మ. కకుబంతంబులు వేసిమ్రోసె సకలాకాశావకాశంబుల
న్నకునంబు ల్లకునంబు లయ్యెఁ గులటా చంద్రాస్య కబ్జంబు కో
రక మయ్యెం గర మయ్యెఁ గైరవము చక్రశ్రేణిగుండె ల్వకా
వక లయ్యె న్నెక లయ్యె పాంథజనతాస్వాంతంబు లంతంతకున్ 42

సీ. ఉండినట్లనె యుండి యువిద ముంగల లే దిదేమొకో యని చూచు నిరుగెలంకు
చూచి వెన్కకు వ్రాలి యీ చెంత లేకున్కి గగనవారి ఖగాలి కెగసి వెదకు
వెదకి లో వెతఁ గుందు వెతఁ గుంది యొండొంటి కామెతపుల్గుల కలిగి పొగులు
పొగిలి యంబుజవనంబునకు గుప్పునఁ బడుఁ బడి తామరల మీఁదిప్రక్క లరయు
గీ. నరసి సరసీరుహాకరం బొరసి వెడలు
బడలుఁ గడలు విలోకించు నొడలు మఱచుఁ

జఱచు నెఱకులc దఱుచు వాcదెఱచు నఱచుc
గోకిc గానక యొక చక్రవాక మపుడు. 44

సీ. భాను శతాంగంబు పడినప్పు డెగసిన పాథోనిధానాబ్జపాంసు వనcగ
నర్కుcడా శరుచక్కి యంబరాంచలమునc దుడిచిన ఖల్లావుతోయ మనcగ
వరుణారుణాధర లరుణాగ్రమునc ద్రిప్పి యటcజల్లు నారాత్రికన్న మనcగ
వారుణాలయ భిత్తి వసి చిక్కు రవితేరి ప్రక్క చందురు కావి టెక్కె మనcగc
గీ. గదిసెc బాశాయుధాశావకాశమునc గు
శేశయ మణీశకల శైలజేశ కేశ
పాశభర శాతకుంభ శుంభత్కుసుంభ
రాశి నీకాశ సంధ్యాప్రకాశపటలి. 45

సీ. హస్త మస్త విపాతి హరిదశ్వ రథ చక్రనేమి ఘాతోదితానిల సఖంబొ
అహరీశ విరహ తాప హుతాశ కృశపాశ ధరదిశా కిసలయ తలిర భరమొ
రజనీ కరోదయ ప్రాక్పశ్చిమ హరిన్నిగూహనా గతకోక కోటిరుచియొ
నిటలాక్ష నటనాది పటుపుష్ప పుటదత్త కరవీర సుమనఃప్రకాండ చయమొ
గీ. సాశ్వకస్యందన దినేశ్వరావగాహ
గగనవీథీ సముత్పత త్కంథిరాజ
సంజ రంజత్ప్రవాళ పుంజమొ యనంగ
సంజ క్రొంజిగి మెఱసి కెంజాయ నెఱసె. 46

సీ. తనకు వన్నియc దెచ్చు తమి కగ్ని తెచ్చి యర్పణము చేసిన తనపదవి యనcగ
నెడ మధుసేవకై యిదు రాత్రికి బలుండు గట్టించు తాcగట్టు పుట్ట మనcగ
నొకచోట నిల్వనీc డుగ్రాంశుcడని నిశా శరణ మొందిన నిజచ్ఛాయ యనcగc
దన తండ్రిపాటుc గోరిన సంజను జయించు రజనిc గూడిన యినాత్మజ యనంగ
గీ. నంధకధ్వంసి కంధరాకంధరాళి
సింధు బంధు స్తనంధయా జీవితేశ
గంధసింధుర పాణింధమాంధ తమస
మల్లి కకుబంత సంధి సంధిల్లె నపుడు 47

ఉ. చెప్పకు దుప్పటీ ముసుcగు చెయ్యిలు గోడ మఱుంగు లేటికిం
జొప్పడు శూన్యగేహముల చో టది యేల నికుంజ మేల మా
కిప్పుడు శంభళీ భవన మేటికిc బైరుల యోర లేటి కం
చప్పుడు చిమ్మచీcకటి బయళ్ల రమించిరి జారదంపతుల్. 48

మ. అకటా! యిక్కువ చెప్పిరాకునికి యేమంచుం దదీయాలయో
ర్వికి డాయుం దలవాఁకిట న్నిలక సారెం జేయు సంచారము
ల్నకిలించు (న్నుకటించుఁ బాటఁ బరుఁ బిల్వం జూచు జారుండు బం
ధకి సంధింపమి కంధకార సమయాంతఃప్రాప్తి సంతప్తుఁడై. 49

చ. విటుఁడు బహుప్రకారముల వేఁడ నొడంబడి క్రీడఁ గోరివాఁ
కిటి కరుదెంచు మళ్ళిచను గేళిదెస న్భయ సంభ్రమాప్తిమై
నటు నిటుఁ జూచుఁ జీమ చిటు కన్నఁ దలంకుచు వచ్చి జారుకొఁ
గిట నవజారిణీమణి సుఖించు మృషాభ్యసనానుషంగయై. 50

సీ. తపన కృపాణికా ధారా నిపతిత దానవరాట్కపాలమాలిక లనంగ
గర్వితాసుర ఖడ్గఘాత నిర్గళితాభ్రమణి ఘోట కంఠ కింకిణు లనంగ
మందేహ ముఖదైత్య సందోహ ఛిద్భాను వర్షిలేఖ ప్రసవంబు లనఁ గఁ
దరణి పాతధ్వని స్తనితోత్పతద్గగనాంకోల లగ్న బీజాళు లనఁగఁ
గీ. బ్రొద్దుగ్రుంకినఁ బోలేక పుల్లసిలుచు
బయటఁ బవళించు నినుఁగొల్బు భటు లనంగ
జండకర సైన్య మందంద వండికొనిన
సుద్ద పొక్కం ఙ్లనఁగ నిక్కెఁ జుక్క లంత. 51

చ. కుముదమువాఁడు దీర్చి ధరకుం గల తాపము దీర్చి మింటి బ
ల్తిమిర మడంచి పాంథులకు దృష్టి యొసంగి చకోరికా నికా
యములకుఁ బథ్యపానముల నారసి యోషధి వృద్ధి గన్న వాఁ
డమృతకరుండు దోఁచెను సుధాంబునిధిం దివిషద్భిషక్రియఁ 52

క. ఆగౌరమరీచికి నుద, యాగతర క్తిమ విచిత్ర మననేల నిశా
యోగమున సుధారశ్మికి, రాగంబెంతయు నిరంతరం బగుటరుదే. 53

సీ. క్రొత్త లత్తుకబిళ్లఁ గొల్లలాడఁగఁ జాలు రాగంబు తను రుధిరంబు గాఁగ
సారంగ మదపంక సంఘుత్కళంకంబు మానితోరః పీఠి మసటు గాఁగఁ
జలదధ్వగులసోఁకు నులిచందువెన్నెల ల్నెమ్మేను దొలచు పన్నీరు గాఁగఁ
దతసాంద్ర చంద్రికా ధవళితాంబర వీథిఁ బఱచిన పరిశుద్ధపటము గాఁగ
గీ. నంటిమిన్ను సముద్రునివంటి తండ్రి
పారమున కూర్మిక లొసంగఁ బ్రాచి కపుడు
తారకా హిత తనయావతంసకంబు
చంద్రుఁ డుదయించు టెఱిఁగించె జగములకును. 54

క. అవసర వైద్య శిరోమణి, తొవతాపము దీఱ మందుఁ దూఁగించుటకై
యివల జలమింక వైచిన, నవనీత మనంగఁ దూర్పున న్నెల వొడిచెన్ 55

ఉ. చందురుకందు, ముందు పురశాసనుఁ డిడ్డ రసా శతాంగపుం
గందెన, క్రీడి కూర్మి చెలికాని కనీనిక, యల్ల రోహిణీ
చందనగంధి గుబ్బచనుసోదన తొమ్మునఁ గాచు కాయ, సం
క్రందన మంత్రిదార యనురాగమునం గను డా గనం దగున్. 56

క. అత్తఱి వెన్నెలచేఁ దళు, కొత్తు నజాండమున బుక్షయుక్చంద్రుఁడు భా
స్వత్త్రక కలశి కుదుపల, మొత్తముతోఁ దేలువెన్నముద్దం బోలెన్. 57

శా. రారేకన్నగు చెక్కుటద్దములు దోరంబార నానందపుం
బారావారములో మునింగి కులుకుం బాలిండ్లపైఁ బల్మఱున్
జీరల్జాఱ బజారపుం బలుకులం జిట్టాడుచుం బాడుచు
న్నారాచొక్కుల దిక్కులం దిరిగి రెన్నం గన్నె లవ్వెన్నెలన్. 58

వ. ఆ సమయంబున విలాసమయ రామభద్ర విలోకనోన్నిద్ర దయారస ప్రసన్నంబు లైన వెన్నెలలు క్రొన్నెల తాలుపు సంజ తిరుపుగట్టిన కొట్టువడి మైపట్టు సడలి భసిత లసితంబు లన సాయం వికసిత మల్లీ మతల్లికా మరీచివీచిక లన డోలికాయమాన మానసాధిక పథిక వధూ పృథూరో వీథికా మదన వివిధ విజయ లబ్ధ కుసుమాయుధ యోధ నిర్నిరోధ విశద యశంబు లన విశ్వవిశ్వంభరా గుంభన నిరవకాశ సాకాశ విరహ మత్తకాశినీ శరీర శిరీష కాశ నీకాశ వైశద్య ప్రకాశంబులన భూనభోంతరదంతురిత కలహాంతరితనాయికా నాయకానిలసఖశిఖా ముఖంబునం గ్రాఁగి క్రాఁగిపైఁ బొంగిపొరలిపాఱిన సుధాలహరులన దండయాత్రా సముద్దండుండై పుండ్రకోదండుండు వెడలి ఖండపరశువుం జుట్టి వెండికొండకుం బుటమువెట్టినం గరంగి తొరంగు తరంగిత తారనీరపూరంబు లనఁ దదీయామల కులంబున గగనంబు వగులుట నలుమొగంబులం బ్రవహించునంబరవాహినీ శంబరంబులన రాజు దానంబు సేయఁ దోయజార్భకాండ హిరణ్యగర్భుంబునం బోసిన సమధిక దధిస్నిగ్ధదుగ్ధంబు లన దుగ్ధపారావార కుమార కంఠీరవంబు కరనాళంబులఁ దారకలపయిం జిమ్మిన పన్నీరవారంబు లన గుండుంబులుఁ గులవేఁటకాఁడు కాముక సంకేత నికేత గచ్చుదిచ్చావతులపై వైచిన పువ్వువలల చిమ్మనఁ దామరసాహితాలంకృతామర సరణి చామర చాకచక్యంబులనఁ జెందొవ విందు మోవికెందలిరు విందునకుం జుక్కల వెలందిమంది యలందినం జిందు వెలందిగందవొళ్లన బృందారక బింబాధరాపయోధర ధరాధరాగ్రపాతి మురాసురారాతి సూతి భల్లనిర్భేదన గళిత ముక్తాహార చూర్ణంబులనఁ బూర్ణసౌగంధిక బాంధవుం దంధకార కంధరంబులపై

గంధవాహ శరసంధానంబు చేయ నెగసిన బుక్షరంగ వల్లికా తల్లజ రజంబు లన సౌధయూధంబులకు సన్నసున్నంబు చేసి విచక్షణసూక్ష్మతారాక్షరవాచక ధావనంబునకుం దావలంబయ్యెఁ బొమ్మన బ్రహ్మాండ కరండంబు నిండిన రేయెండ చంద్రఖండంబు లఖండ చకోరీకాండంబులు గని పయోభాండంబునకుం జొరంబడు నిబిడ బిడాల జాలంబుల లీల నరవింద మరందంబునకుఁ గ్రందుకొనుమిళిందబృందంబుల చందంబున నాఁ పచేనికిం దలఁపడు నాఁబసరంబుల పస మూరుకొనమెక్కి యా మెక్కిన లెక్కించి మిక్కిలిం జొక్కిపడు జక్కవపడంతులును జక్కవలకుందోడు మక్కువటెక్కువలం దగిలి పిగిలిస మనంబునం గమనసమాగమంబున కెదురుచూచి ముదురుచందురువెలుంగు సెకల శకలంబు లయ్యె సకలాంగంబు లని వకావకలై యిసుకల వసతుల నడుగిడ నోడి సుడివడి త్రొక్కనిచోట్లుద్రొక్కి రక్కొన్న సురపొన్న గున్నలం గూడి తలిరుటెండల వెడలిన యుదురాడాత పంపుం బొడలకుఁ జొడలువెట్టి గట్టి ముసుంగిడి పోసంగెడి చెంగటి తిన్నెలం బైఁటబైఁట పైరిణీచెలంగుల రింగున క్రొపుమ్మడిముడి విడుట లెఱుంగక హృదయంగముల యంగముల బిగికౌఁగిటం బెసంగు సనుంగు నునుంగులుకు గుబ్బచన్నుల యస్సులం గొంచి కన్నులవింటిజో దంపతులకు వచ్చిన యీ దంపతులకుం జలువ చప్పరంబుప్పరంబు గామి చెస్సకప్పటి కిప్పటికిం జొప్పడ దిక్కటకి కట్టెండ నెట్లుండ నేర్చితో యని కటకటంబడు కట తటాశ్రుధారాపాత భారాన్విత వియుక్త శాతోదరీ సముదయంబును సముదయంబున్నైన కౌముదీజాలంబుచే జాలుకొన్న మున్నీటి పన్నీటి పట్టికల పాషాణపుఁ బట్టికల మెట్టికల నీరుఁగాచి భవదీయ విపంచికా సంచిత సమంచిత సంగీతభంగిం గరంగిన రాల జలంబనెడి నిజసఖుల నిఖిలముఖస్తుతికి నంగీకరించు కురంగీ లాంఛన శిలాంచన చణ వితర్ది కాంతదేశవిశ్రమణక్షోణి విశ్రుత శ్రోణి వైణిక శ్రేణియుం గరంగి రేతేని రాణించు నయ్యవసరంబున. 59

క. అటవి దిశా కటక సము, త్కట నిష్కుటవాటి గోపికా పికవాణుల్
నిటలాక్ష భయద భల్లక, భటకుటిల భ్రుకుటిభగ్నభగ్నాశయలై. 60

క. కటికి తొగరాచ యెండలు, పిటపిటఁ గాయంగ మేను బీఁటలువాఱెం
గటకట శైల విశంకట, కటికేలా నిలువ నీడ కావు ముకుందా. 61

క. ఒంటి నెటులుంటివో వా, ల్గంటినిఁ బేర్కొన్నఁ గళవళంబున నాపే
రంటిన పలుకులు గనునీ, కంటి కయో! నిదుర యెట్టుఁ గంటి మురారీ! 62

క. గబ్బి చెలీ! గుబ్బలి నీ, గుబ్బని మది నుబ్బికేలఁ గొని యెత్తితిఁ గా
కబ్బురువున కేనా యిది, దబ్బరకా దన్నవలపుఁ దలఁపు మురారీ! 63

క. బాల భవ దధర శర్కర, వేలాగులఁ బ్రోచె దానవీ ధవకృతముల్
నాలుక చేఁదుదరము మ, ట్టేలాడు నటంట మఱచితేమి మురారీ! 64

ఉ. రాతిరి ఱాతిగుండె నధరం బిడకుండిన రాక యుందువే
వాతెర దొండపంటి చవి వాసిగదా కొద దీ తెనంచు రా
వైతివి బింబసేవన మయారె మహామతి హానిసేయదే
యీతతిఁ జిల్కరాచదువు లింతి యుదాహరణంబు లోహరీ! 65

ఉ. క్రిక్కిఱియం గవుంగిట బిగించెదు నీయెదకౌస్తుభంబు నా
చిక్కని గుబ్బసంది టను జిక్కెను దుత్తుము రౌ నటన్న నీ
చక్కెరమోవి మానికమె చక్కఁగఁ జిక్కె నదేటి కన్న మే
ల్గక్కున నెక్కళావతికిఁ గానుక చేసితౌ నందనందనా! 66

ఉ. పాటలగంధి నీ పెదవి పైకొను నాపలుమోపఁగాఁ జుమీ
మీ టమృతంబు కంటె నని మెక్కు మఘాన్నము వ్రజి సత్రపుం
గూటికి మాధురీమహిమ కూడదు సుమ్మనుకొన్న ముచ్చటల్
మాటికి నేవధూటికి సమర్పణచేసితౌ కేశిమర్దనా! 67

సీ. కేళీవనీ వేణు గీతాగత భుజంగభీమ తద్వక్ష శ్చపేటదములు
చుంబన వితరణా సులభాంతరంగమత్కంఠ పీతార్పిత కౌస్తుభములు
గళ నఖాంకావలోకన రక్తదృగ సుక్తమద్గాత్ర పతితత్వదుద్గతములు
భూపగోష్ఠీద్రాఘిమాపరాధానీత పరలబ్ధ మణిసాల భంజికములు
గీ. శారి కోటీరి తాన్యోన్య సరసతములు
వింతలు దలంపవైతిగా! యింతయైన
నన్నృత సంసార బర్హిబర్హావతంస!
కంసవిధ్వంస! వ్రాతగోపికారిరంస! 68

సీ. హరిశిలాసారంబు హరియింప నెఱివేణి కనుదోయి బాణరేఖను హరించె
మధురాధరోష్ఠంబు మధువిదారణ మానఁ దాళభేదము పయోధరము లానె
రోమాళి వ్యాళ విరోధంబు నొందిన శకటాంగ దమనంబు జఘన మొందె
నూరుచారుత వారణోత్పాటనముఁ బూన హంసాపహృతి పూనె యానమహిమ
గీ. మహిళ నీయొక్క యంగంబు మారుగలదె
యేనెదురె నీకుఁ దప్పు సహింపు మనిన
దయ దలఁపవైతి హరి హరిహయమహీజ
హారి యమునావిహారి మురాసురారి! 69

సీ. అతను తుపాకి గుండటులుండు మనియెఁగా యతినిష్ఠుర శరాగ్ర మడ్డగించి
వలరాచ తూపు దైవము తొలంగించెఁగా యతులకృపాణి చాటగుటఁజేసి
దర్పక కరవాలధారఁ దప్పించెఁగా యనుఁగుటేనుఁగు మఱుఁగైె కడంగి
రతిరాజ భద్రేభ రాజంబు నిలిపెఁగా బలితంపు రాతెట్టు గలుగఁబట్టి
గీ. యంచుఁ జెలియంచుఁ జలియించు నసమభసల
కుసుమ కిసలయ పికశాఖ లెసఁగఁ గాంచి
పంచ శరశాత శరజాత పాతజాత
భీతి యేరీతిఁ ద్రోచెదో బిసరుహాక్ష! 70

సీ. నీ సోగజడఁ జూచి యాసూటి సాన నందముగఁ బట్టించితి నందకంబు
నీ చిన్ని బొమదోయిఁ జూచి మేల్బంతిగాఁ జక్క దిద్దితి వంక శార్ఙమునకు
నీ మోవిజిగిఁ జూచి నిన్న మొన్నను మెఱుఁగింత వెట్టించితి వ్యాదయమణికి
నీ చొకారపుమేనుఁ జూచి పదాతింటి వన్నియఁ గూర్చితి భర్మపటికిఁ
గీ. గలికి నీజంఘ పసఁ జూచి కాదె మకర
కుండలంబులు చక్కఁ జెక్కుటకు నిడితి
నొక్క నిమిషంబు నినుఁ జూడకుండఁ గలనె
యనిన మధురోక్తి మఱచితే యంబుజాక్ష! 71

మ. విమలాంగీ మణులందు నీక తగుఁబో వేణీభరం బెంత యం
దము వాటిల్లె నటంటి నాఁటికి ముకుందా! నేఁడు నీకేటికిఁ
యమునావీచి విహారమో, భుజగభోగా గ్రైక లాస్యప్రపం
చమొ, తాపింఛ వనీ తలాంచ శిఖిపింఛ ప్రేక్షణాపేక్షయో. 72

శా. మందారాగమకేళి హేళితనయాంభః క్రీడనా భోగమా
బృందాళింద విహారమా మురళికాభీష్టారవాకృష్ట గో
బృందప్రోన్నమిత శ్రుతిశ్రవణసంవీక్షాదరం బట్టి యా
నందం బౌనొకొ యింక నొక్కపరి కృష్ణా! వృష్ణి వంశాగ్రణీ! 73

గీ. అనుచు గోపిక లోపికల్ హవణుపడక, తమి నిలుపలేక తా మట్టి తమినిఁ జంద్ర
మీనకేతను లిద్దఱు మింట మంట, మండుచును జెండుచుండు దంభమున కలిగి. 74

సీ. మొదల వనగ్రామమున జన్మమొందుట పొదయెమ్మె నెమ్మెనఁ గడలుకొనుట
పాంథసంఘములకు భయమింత చూపుట గట్టిగా మృగి ననిఁ బట్టుకొనుట
పశుపతి శీర్షంబుపైఁ జొకళించుట నఖరపాదాహతి నాటుకొనుట
మునుపు సత్సంతానమున వాసి లోఁగొంట పుండరీక పరాఖ్యఁ బూనుకొనుట

గీ. బెబ్బులికి నీకు నింతైన భేదమేది
పదరి కన్నులముందఱఁ బడ్డవానిఁ
గాని చెనకనిగుణ ముందు దానియందు
నొకటి కారుణ్యరహిత! యోయుత్పలహిత. 75

ఉ. తెల్లని మంటగాని యిది తిన్ననివెన్నెల గాదు కంటివా
హల్లకమిత్ర! నీదుసెక లంటమి మింటికి గందు వొందునో
నల్లనిదౌనొ కల్వ నిశ నైల్యము నొందునొ మేను గందునో
యల్ల తమోగుణంబు నలుపందునొ కాళిమ రాహు వొందునో. 76

ఉ. వెన్నెలచొక్కు చల్లి యరవిందకులంబుల నిద్రదేర్చి పై
నున్న సిరిఁ హరించినటు లోహరిణాంక! వెలుంగు కత్తులం
గన్నెల యంగము ల్నిశిని‌ఁ గన్నముచేసి ప్రమోద మెత్తఁగా
మున్నె ఖలాఙ్జ కర్త్ఁడవు ముచ్చులరాజవు గాక రాజవే. 77

శా. న్యగ్రోధాంకుఁడు సోముఁ డంధకహరుండాపైఁబుఁ డీవౌటనో
యుగ్రత్వంబు ఘటించె దింతిపయి నోహోయైన నేమాయె నే
కగ్రీవంబునఁ గంతుఁడుం దిరుగఁబోఁగా వానిఁ గ్రోధాగ్ని సా
మగ్రిం గ్రాఁచిన నీవ యీశ్వరుఁడ వాహో రోహిణీవల్లభా! 78

గీ. ఉదయరాగంబు నీకెక్కడిది మృగాంక, కామినీ కంఠరక్త మాకంఠముగను
ద్రావఁ దత్కాంతి వెలిఁగ్రమ్మెఁ జూవెకాక, యున్నఁ గడు పిట్టితన్నులు దన్నుటెట్లు. 79

క. కలహించెఁ గాని నిను మొ, క్కలమున రాహువు గళంబుఁ గబళించినచోఁ
గళ దాఁకి పడిన చంద్రా, కలకంఠీకులము లింత కలవర పడునే. 80

క. ఉదయాస్తమయములకు నీ, కుదనిధి యుదరంబె మార్గ మొక మకరియు ని
న్మద మడఁగింపదు కరిబలెఁ, దుది నేటికి నైనఁ జేరి తోయజవైరీ! 81

గీ. పంచశర! నిన్ను వజ్రిచే పట్ట పిడుగు, తునుకనంచు గిరీశుపైఁ దూఱునటుల
నచల కుచలంచు గర్జించె దౌర క్రీడఁ!, దోడునీడలపై దాడిఁగూడు టెటులు. 82

ఉ. ఏయెడ విల్లునమ్ము లొకయించుక యేమఱ కుంట పాంథులం
గూయఁగఁ బట్టి గొంతుకలు గోయుట యీశ్వరు నంత వానిపై
సాయక మొక్కఁడేసి పగ సాదుకొనం దుది సూడుద్రిప్పుటఁ
బోయకు నీకు నంతరముఁ బొందునె యెందును శంబరాంతకా! 83

మ. తొలుదొల్తన్ హరిచేతఁ బెంపుఁ గని తోడ్తోడన్ గిరీశున్ హళా
హళిమై నోర్చి మహాసితాంగరుచి సామర్థ్యంబు మీఱ న్సదా
నల సద్విగ్రహ రాగహారి వగుటన్ ధాత్రి న్వెతం బెట్టుచో
నిలయందు న్ననివౌటకా దశనివై తేమందు శ్రీనందనా! 84

సీ. నారీ కవచునోర్చి నగెఁ గాక భృగుసూతి నారీకవచు నేసెనా శరాళి
విఱిచి కొనియెఁ గాక విలు జానకీజాని విఱుగనేసెనె యుమావిభుమనంబు
వింటి పెట్టొడిచెఁగా కొంటిపోరున శూలి వింటిపెట్టునఁ బార్థు వెతల నిడెనె
యనలంబు సొత్తుఁగా కనియెఁగా కపిహితుపై ననలంబు వర్షించెనా నరుండు
గీ. నా కరణినంచు విలుకాండ్ర నైకమునకుఁ
బుంద్రధనువున వేతురా పువ్వు బిరుదు
నిన్ను నీచాప ముగ్రులై యున్నవారు
నమలి వైవరె తమత్రాణ నలినబాణ! 85

క. ఏ నారి సుఖము చెందదు, నీ నారియె నారియైన నీ నాళీకం
బేనాళీకం బైనను, యోనాళీకాక్షి తాప మొందునె మదనా! 86

క. గారుతమాహోత్సా శన, భీరుతమా మలయనేల భృతమధుకర వా
మారుతమా మలయాచల, మారుతమా! నీదు కానిమది మారుతమా. 87

క. అలయించనేల మహిశీ, తల తాలవనా చలంబె తల తాలవనా
నిలయంబు నీకు గంధపు, మలయానిలమా యటైన మలయానిలమా. 88

క. పవనము బంధించు ముని, ప్రవరులు లేరైరొ సతులపైఁ బగ యతి నొం
ప వలసి యంపిన జఠరో, ధృవశిఖిఁ గూడితివొ సిగ విదిర్చెదు పవనా!. 89

క. కలకంఠు లెంత సర్వ, ఝ్ఝలకుం గుత్తుకకు డిగని జూటందురు ని
న్నలినీకులమా! పరిచిత, నలినీకులమా గరంబు నలినీకులమా. 90

సీ. హరిహయ హరిదంత గిరిదుర్గ సమయయామిక భుజోన్న మిత దీపిక యనంగ
శీతాంశు సారంగ శృంగరంధ్రీ కృతాచ్యుత జాండ ఘటలిప్త సుధ యనంగఁ
ద్వ్యక్తతారాద్యపుష్పాలివేళార్చ కార్పిత విష్ణుపద పుండరీక మనఁగఁ
బాకశాసన మదానేక ప్రోక్షిప్త హస్తలతాగ్ర మన్మథ ఫల మనంగ
గీ. శకునిశబ్ద సమారంభ సంభ్రమమున
కవసర గణాధినాథోపహార మపుడా
నర్పనిడు నారికేళఖండం బనంగ
దిక్కులటఁ జొక్కుచన వేగుఁజుక్క వొడిచె. 91

చ. కనుకలిప్రాతపై నిడుజగంబు తృణంబున నెట్టు లీడ్చునన్
బని విని స్నేహము న్విడక బల్లశ లోఁగొని యోజబంతి చూ
పిన వహికిం బితామహుని భీరువు మెచ్చి స్వకీయ రూపశో
భన కళ లిచ్చెనో యనఁగఁ బాండుర రూపము లయ్యె దీపముల్. 92

శా. ప్రాక్కోణాంబర వీథిరీతిఁ గులటాపాళీ ముఖాబ్జంబు తె
ల్పెక్కం బాంథుఁడు ధట్టి గట్ట దన వి ల్లెక్కూడ్చి నాల్గింటిపై
లెక్కమ్ము ల్దొనవైవ భావజుఁడు బఱ్రెక్కార్చు ప్రక్క ల్గనన్
గొక్కోకోయని కుక్కుట చ్ఛటలెలుంగు [1]ఱెక్కె నల్దిక్కులన్. 93

సీ. ఈ తమ్మిమొగ్గ తూ పిభగామినీ స్తన కాఠిన్య మిం తని కాంచి వచ్చె
నీ సంపఁగిలకోరి హేలావతీతనూ మృదుభావ మిం తని యెఱిఁగి వచ్చె
నీ కల్వనారసం బిందీవరేక్షణా దృగ్దైర్ఘ్య మిం తని తెలిసి వచ్చె
నీకెం దలిరుఁజిల్కు రాకేందువదనా పదారుణ్య మిం తని యరసి వచ్చె
గీ. ననుచు శరసాహసము వసంతునకుఁ దెల్పఁ
బథిక భీరు భిదాలస బాహు విలుక
నతని తొడమీఁద శిరసింత హవణు పఱచి
పువ్వు లంగడిఁ గనుమోడ్చెఁ బుష్పధన్వ! 94

క. రజనిఁ బెడఁబాసి తారా, నిజ సౌఖ్యము డించి కుముదినీసతి విహ్వాతిం
ద్యజియించి యట్టియెడ నీ, రజనీవరుఁ డపరదిక్కు ప్రక్కకుఁ జేరెన్ 95

ఆ.వె. అమరు లారగించు నట్టి పళ్లెర మెత్తి, వేళ పేరిదొంగ వేగు టెఱిఁగి
ప్రొద్దు గ్రుంకఁ దూర్పు భూమిఁ జేర్పఁ దలంచి, విషధి వైచె ననఁగ విధుఁడు గ్రుంకె. 96

చ. చనునెడ రేయికే లొడియఁ జందు విదిర్పఁగ నందు మిట్టి రా
లిన యమృతంపు ఁజిందు లన, లేమను బాసిన సోముఁ గాముఁ డే
సిన విశిఖాళినా, శశి నిశీథిని తమ్మిసిరిన్ హరించి పో
వను వెనుకొన్నహంస భటవర్గములో యనఁ గ్రుంకెఁ దారకల్. 97

సీ. ఇనుఁ డగ్నిరుచి చేర్చు టెఱిఁగి శైత్యము శశి తన కిచ్చెనా గాడ్పు గనియెఁ జలువ
రవి వచ్చు నని యంబరముఁద్రోచి చను నిశాధిపు నవ్వె ననఁ దూర్పు తెల్లనయ్యెఁ
దనరాజుఁ బ్రహసించి తనరారు ప్రాక్ప్రమద నదల్చెనా ద్విజోత్కరము మెఱసె
ద్విజకోటి నిజవాటి విడిచి పోఁ బ్రాచి కన్నెఱ చేసెనా రాగ మింత తోఁచె

[1] ఱెచ్చె – సూర్యనిఘంటు పాఠము.

గీ. వేగ నలవాసరేశ ప్రవేశమునకు
గగన గృహశాంతి కిడు పూర్వ గహ్వరీంద్ర
కలశ చూత ప్రవాళ రేఖలో యనంగ
దినమణి మయూఖములు కొంత మొనసె నంత. 98

సీ. జంభారి హస్తాంకుశ త్రుటత్కరికుంభ తలనిర్గళ ద్రక్తధార లనఁగ
వృద్ధశ్రవో దిగ్మహీధ్ర వేణూద్థిత [1]క్రుద్ధ దావానలాంకురము లనఁగఁ
గుత్కీలపత్ర నిర్భిత్కతుద్భిత్తికాశ్రిత శోణ మృత్తికారేఖ లనఁగ
సౌధాశనాధీశ సౌధవీథీ ధ్వజవ్రజ హేమకాండ వర్గము లనంగ
గీ. స్వర్గ దుర్గాధి నాథ దిశావిశాల
శరధి కూల ప్రవాల వల్లరు లనంగఁ
దరణి కిరణ ప్రకాండము ల్ధరణిచక్ర
[2]చక్రవాకావలోకనోత్సవము నెఱపె. 99

క. నడయాడు మబ్బు కఱడుగ, నుడుమార్గముఁ గాంచి మఱియు నొక్కటి యిదిగో
జడధి యని క్రోల వెడలిన, బడబానల మనఁగఁ గడలి భానుఁడు వొడిచెఁ. 100

మ. కర మయ్యెం గర మయ్యెడం గలువకుం గంజాప్తుఁ డేతేర మే
దురమయ్యె దురమయ్యె దాను రతులందుం గోకికిం దిక్కు భా
స్వరమయ్యె న్స్వరమయ్యెఁ దమ్మి తిమిరవ్రాతంబు వృత్రారి కం
దరమయ్యెం దరమయ్యె నిచ్చలము నానా ఘూక పాకాళికిఁ 101

సీ. ఒక మయూఖంబు నిర్వికసిత సారసాళిక క్రూరపుం జెఱ ల్వీడిపించె
నొక గభస్తి నిరంకుశోద్వృత్తిఁ గదిసి యున్మదకుముదిని రేకు మడఁగఁగొట్టె
నొక ఘృష్టి యింత కొంచక చిమ్మచీఁకటి గర్వాంధ పటలి దిక్తటుల కొత్తె
నొక కిరణం బింత సకల దోషాకరవ్యథ గన్నయన్నుల వడఁకుఁ దీర్చె
గీ. నప్రతీప ప్రతాపానల ప్రభుండు
చక్రపరిపాలన క్రమాపక్రమూతిన్
రుచివిజిత రాజ పరమేశ్వరుండు సూర్యుఁ
డుదయగిరి సింహపీఠిపై నున్న వేళ. 102

మ. అరిరాజన్యక జన్య జన్యజయవారాధేయ రాధేయ ఖే
చర విత్తేశ సమానదాన కలనాసారస్య సారస్యదా

---

[1]క్రుద్ధదావానలాంకురములు......అని పూర్వముద్రణపాఠము.
[2]సవరించిన పాఠము. 'చక్రవాకావలోకోత్సవంబునెఱపె'-పూర్వముద్రణ పాఠము.

శ్వరజోల్లంఘిత చక్రవాళ సకలాశాఖాంత శాఖాంతరా
హరహాఃకమ్ర సురద్రు కీర్తికృత సౌమారోపమా రోమాపమా. 103

క. దుర్మద రిపు మర్మదలన, ధర్మ వరేతర తర ప్రతాప తపన ది
జ్మర్మసతీ కంఠాలం, కర్మ కృతియశః ప్రపూర ఘనకర్పూరా. 104

భ్రమరకూజితవృత్తము

శారదా లలిత చారదాయి ముఖ సారసాంకురిత సౌరభా
సౌరభాను పవిహార ఫాలశిఖి సన్మహః పవన సారథీ
సారథీనమిత గీరథీన కవి సంస్తుత స్వగుణ గౌరవా
గౌర వారిరుహ హీరవాద విలగద్యశః కృతవిశారదా. 105

గద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహ శాశ్వతైశ్వర్య ధుర్యతా మహేశ్వర రూప
రేఖా విజిత రతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్కవి
రక్షణదక్షవీక్షణ యినిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాంబా
గర్భశుక్తి ముక్తాఫల గురువనజసంభవభవ శేష భాషా మనీషాబల
ప్రతిదినాగతార్థి జనవర ప్రదాయక వేంగళనాయక ప్రణీతం
బైన బహుళాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# బహుళాశ్వచరిత్రము

## చతుర్థాశ్వాసము

క. శ్రీవేంకటేశ సేవా, ప్రావీణ్యా! విరోధి ధరణిపాల శరణ్యా!
పావన సద్గుణగణ్యా!, శ్రీవేంకటభూవరేణ్యా! చిరతరపుణ్యా. 1

వ. అవధరింపుము జనమేజయజనకునకు శుకుం డిట్లని యానతీఁ దొడంగె నా తర్వాత సద్యస్స మాయాత సాత్రాజితీ సమేత నేతకుఁ బ్రాతరుద్భూత ఖద్యోత సమద్యోత కంజాత సంజాత వాతపోత శీతల ధౌత వదనారవిందునకు విందుఁజెప్పి యజ్జనక జనపాలకుల తిలకంబు జలకంబాడి నిత్యకృత్యంబులు నిర్వర్తించి కందర్పజనక సమర్పణానిర్మిత నాడింధమ పాణి పాణింధమ మణిబంధ మణిభూషణాదుల పనులు గాంచి పురాయించి కులాయికోపరి పరివేష్టి తోష్ణీష దక్షిణభాగ భాగాయిత లిఖిత శుభ్ర శిలాశకలస వ్యహస్తపుట ఘటిత సంపుట పటీ పటిష్ఠ కార్ణాటిక గణకగణ విభక్త భర్మవటనంఖ్యానంశ్రవణంబునకు శ్రవణంబొనంగి నంగీత భృంగీ తత చికురానికరప్రకటితగద్య పద్యకలా కలకల హృద్య విద్యామంటప ప్రాంత కాంతనిశాంత లతాంత లావక సేవక జాతక నీత కరవీర కేతక కేశక హల్లకపుల్ల కనకమల్లికా మాలికా పాలికల నవలోకించి కించిదీశాన దిశావిలోకి పాకశాసన శిలావిశాల సమీప సమీచీన పటీరమ్యపటీరకుటీరతటీరరమణీయ పేటికా శాటికా గ్రంధివిభేదన మాత్ర ఘుమఘుమాయమాన మానవస్తుత నిస్తుల వాసనా వాసిత వలయ బందార పరిచారిక దత్త తూ లోపల పరిమాణ పరిమిత పన్నీర మిళిత ఘనసార సారంగమద కాశ్మీర పేషణ విశేషణ నిపుణ భృత్యపాణి పాషాణతర్జనీ మార్జవనమార్జవం బుజ్జగించి మజ్జనగృహాభిముఖ నఖర మయూఖనిఖి లాశ్మవేశ్మవాసవాసజనవిజనవిజ్యమాన నానాప్రసూన చయ కాచవిచలదాచ్ఛాదిత వననఖండకుండికాకాండ నాళామజ్జికోజ్జ్వల జలశీతల కరతలస్పర్శనంబు విమర్శించి దర్శనీయ శయ్యాసన్న భిన్నభిన్నపాకానేక శాకానీక గుబగుబధ్వానోచ్చసూచ్యానినాదభేదాహీన హయ్యంగవీనహింగుజీరకమాషసర్షపమారీచాది గంధ బంధుర మందిరప్రాంగణ వితర్దికాసంగత దేవతాపురోహితామాత్యనికేతనాగతా నూతన వేణుపుటి కా పూపభూమీపరిపాకచూతావళీపనసఫలదంశుమత్ఫల రస పంకిల

పదవిం విదవినోదం బొదవించి యారవీయభోజన సదనకదళీదళపరితాప వాతాచ్ఛాద భేదవిచ్ఛిన్న సౌవర్ణపాత్రజాత శాతకుంభ రంభాపర్ణపూర్ణసౌభాగ్యభోగ్యా శనశతాంగ భోగ్యహితాయోగ్యజాంబూనదాంబరాభరణమృగ నాభీముఖ్యసమస్తవస్తూపాయ నంబులఖిల దేశాధిపత్యమాత్యవర్గంబులకుం జూపి గోపికాపికానూలాపి కాంతర గృహపర్యంక కుంకుమ కశిపుత లోత్తాన శాయిత సత్యాసత్య మధ్యమాంకే మూర్ధోపధానతా మానవ దత్త తాంబూలీ దళ ప్రసారిత కరాంభోజతా క్రీడిత పాదనిష్పీడిత వ్రీడావతీ కుచ కుంభకు యశోదాకృశోదరీ డింభకుం జేరి జలకం బవధరింపుఁ దని విదేహమేదినీభర్త కర్తకు భోక్తకు భక్తకుటుంబ సంభరణ జంభ సంభేది తరువునకుం దరువు వెట్టిన. 2

ఉ. గ్రక్కున లేచి యా చిగురుఁగైదువు జోదును గన్నమిన్న సొం
పెక్కిన కెంపురాపనుల యిక్కగు నొక్కిలు సేరి మజ్జనం
బక్కడనాడి భూషణ తులాంబర చందన పుష్పమాలిక
ల్చక్క ధరించి మేచక కచా నిచయంబులు చెంతఁ గొల్వఁగన్. 3

క. వెన్నుఁడిటులున్న సన్నపు, నెన్నడుము వడంక వచ్చి నిద్దపు నవలా
మిన్న యొక బోనకత్తియ, యున్నతకుచ వంట యమరియున్న దటన్నన్. 4

ఉ. అంగమునం గురంగమద మందముగాఁగ నలంది మౌళిసం
పంగివిరుల్ సిరుల్గన రుమాలు ధరించి రుటంపు టంగిపై
రంగు మెఱుంగు బంగరు చెఱంగుల రెంటెము నాల్గుకొంగులు
వ్రింగులువారఁ గట్టి సుమణీ రమణీయ సరాభిరాముఁడై. 5

మ. నలువైపుం దలకందు కాన్పు పస నున్నం దామరందంపుఁబొ
క్కిలిచే మిక్కిలి నిక్కువాఁడు మెఱుఁగుం గెంజాయ గింటెంబువాఁ
డలరుంగత్తిదొరయ్య యొయ్యరపు టొయ్యారంపు నెయ్యంపుఁదొ
య్యలు లేతేరఁగ భోజనంపు టరఁ గొయ్యంజేరి తా నయ్యెడన్. 6

శా. అప్పాబోఁడుల కొక్కరొక్కరికి స్వర్ణాప్పాత్రము ల్జాళువా
డొప్పల్గొన్నియుఁ గొన్ని గిన్నియలు గిండ్లుంగూర్చి నల్వంకల
న్గొప్పల్విప్పులు లేఁతలౌనరఁటియాకుల్వైచి వైచిత్రిరాఁ
జొప్పుల్గా నడ లేర్పరింప హరి కూర్చుండె న్వధూయుక్తుఁడై. 7

ఉ. వన్నెమురారి దుప్పటిని వ్రాయఁగఁ జాలు పిసాళి మేనులు
న్మున్నమ రేలఁ దెచ్చు నగుమోములు గ్రొన్ననవిల్తుఁ గన్న య
క్కన్నియయిల్లు నిల్పు తెలిగన్నులు మ్రొక్కులు గన్న ఫాలము
ల్చెన్నులు చింద నందఱును జేరి సువారపుటింటిముంగిటన్. 8

ఉ. మట్టెలుమ్రోయఁ గక్షరుచి మార్మలయం గడకంటిబేడిసల్
మిట్టిపడం బయంట చనుమిట్టల కట్టిటుఁ గాఁగఁ జెక్కులం
బెట్టిన కమ్మతల్కు మిఱుమిట్లు గొనన్ నునుగీలుగంటు వె
న్పట్టుఁగనం గనత్కనకపాత్రిక లెత్తిరి బోనకత్తియల్. 9

గీ. కూర లందఱు నంద మంకూర మొందఁ, దేర నందలి యొకతె హస్తారవింద
సారవల్లీలఁ గొనియె నాకారవల్లి, కారవల్లిన ద్రాఘిష్ఠకారవల్లి. 10

గీ. శ్రవణ నక్షత్ర నిభ మణి చణములైన, శ్రవణ తాటంక యుగ చకచకలు నిగుడ
రవణ కంకణ పాణి పల్లవము సాఁచి, లవణ మొక్క లతాంగీ లలామ మిడియె.

ఉ. బంతులు గట్టి గట్టి చనుబంతుల మెట్టిన తారహారముల్
గంతులు వైవఁ దుమ్మెదలు గంతుల వంతులు తోడఁ గొప్పుసే
వంతులు కాంతులూన గుణవంతులు వంతులకున్ నుతింపఁగా
నింతులు కూరఁగాయలిడి రింగువ మెంతి తగుల్ బుగుల్కొనన్. 12

క. అందందఁ దిరుగబోఁత బు, గం దింపఁగ గుడము నిగుడఁ గమ్మని నేతం
బొందుగ వేఁచిన వేఁపుడుఁ, గంద ముకుందాదులకు నొకతె వడ్డించెన్. 13

క. రోఁకలికైదువదొరతోఁ, డాఁకలిదప్పులు హరించె నంచుం [1]జెన్నున్
గాఁకరబోండ్లు హరిం గని, కాఁకర పొట్లాది గాఁగఁ గదియించిరెడన్. 14

గీ. తను సుమధ్యమ గెనుసు, చందనసుగంధి, పనసకాయ, సునాస రంభాశలాటు
బిసరుహేక్షణ పెసరపప్పుసదృశాంగి, పసిమిగందని వంకాయ బంతికిడియె. 15

క. గాధ కనకాంబరం బా, షాఢక నచ్చంచలా ప్రచారము చూపన్
బ్రౌఢకలకంఠి చేరిచె, నాఢకసూపంబు నృహరి [2]హరివాణమునన్. 16

క. అప్పప్ప పసిఁడి వండిరి, మెప్పింపం గాదు నిజము మేలని పందెం
బప్పటి కొప్పిరి కొందఱు, కుప్పలుగా సెనగపప్పు గుప్పిన యెడలన్. 17

క. తలతలమను మల్లికలం, గలఁకల నిడి తమ్మిపూలఁ గలకల నగుచున్
మిలమిలనై తలతలనై, కలగల కలమాన్న మిడిరి కలగల లలనల్. 18

సీ. పొన్నట్టుఁ దట్టఁ జేఁబూని యన్నము వంచె వలచేత లతవిరుల్ వంచెననఁగ
నీయన్న మాన నీ కిచ్చు యిచ్చితి నన్న జాడ నన్నము ముట్టి చక్కనొత్తె

---

[1] కన్నుంగాఁకర బోండ్లు-సూర్యనిఘంటు పాఠం.
[2] హరివాణమున్-పూర్వముద్రిత పాఠము.

నంగ నమ్రత చూడ్కి యవనీతలం బంటె వెడవిల్తుఁ డెక్కిడు విల్లువోలె
వంటంది కొన నిల్చు వామవేణిక నల్లె వెనుగన్న యెక్కుడ్చు ధను వనంగ.

గీ. అంగనలు వడ్డనకుఁ దెచ్చునట్టి పసిండి,
యట్టికలు లాగి శాకముల్ పెట్టెఁ గాని
యట్టియెడ నెట్టియెడ కంఘ్రి మెట్టకపుడు
చక్రికివిరాళిగొని యొక్క చక్రజఘన. 19

గీ. నుదురు జాబిల్లిపిల్లతోఁ జదురులాడ, నెదురు కాఁగెడుగుబ్బల యింతి యొక తె
కుదురుగా గిన్నె యిడి వంచె గోఘృతంబు, విదురు విందారగించిన విదురునకును.

క. గంబూర మృగమదంబుఁ గ, దంబించిన మంచి చల్లఁదనపుం బానీ
యంబుల జాంబూనదపుం, జెం బుంచిరి సొంబు తండ్రి చెంతం జెలువల్. 21

క. బంగారుల భృంగారుల, రంగారు నిజాంగ కచ భరస్తన భరలీ
లం గారులు వల్కు సతుల్, భృంగారులు నింద జలము లిచ్చిరి ప్రజకున్. 22

క. జలసేవన ఘళఘళ ల, ప్పలముల పళపళలు భోక్తృ భళభళ లబలా
వళి పట బెళబెళ లంగద, ఝళఝళ లేకీభవించె జనము నుతింపన్. 23

క. పులిచారు వంచె నొక్కతె, పులిచాఱలచీరఁ గట్టి భోక్తల కేకా
వళి చారు చంచరీకా, వళి చారు చలత్కచాళి వహి మహిఁ బొగడన్. 24

క. అజ్జలజముఖులు కాఁచిన, మజ్జిగరసమేమి చెప్ప మఖవంతుం డీ
షజ్జిహ్వారుచిఁ దగిలిన, మజ్జారే యమృతరసము మఱి కొనఁడు సుమీ. 25

గీ. అమ్ల మారీచ లవణ గుడాదికములు, దండిగా వండి గొప్ప పసిండిగరిటె
వేఁడి వేఁడిది వడ్డించె వేఁడివేఁడి, నాతి కూష్మాండ ఖండ కాండంబు లొకతె. 26

ఉ. చెక్కుల నాభినామమును జిన్ని రుటాల నిటాలసీమలన్
వాక్కులఁ జంద్రఖండములు వంచిన వైఖరి చంద్రఖండముల్
జొక్కపు చంద్రఖండములు సుమ్మన వంచె మెఱుంగుఁ జేతులన్
మక్కువ జెల్వితండములు మౌఖ కళాకృత చంద్రఖండముల్. 27

క. తేనెతొలల్ వలె విలసిలి, తేనెతొలల్ చిగురులనెడు తియవాతెఱలన్
దేనెతెరల్ గల తెఱవలు, తేనెతొలల్ వంచి రెడల దెప్పలు గాఁగన్. 28

క. ఉక్కెఱకున్ బుఱుడలపైఁ, జక్కెరకున్ వడలపై నొసఁగు తేనెలకున్
గ్రుక్కిళ్లు మ్రింగు టరుదా, పుక్కిళ్లంబెట్టుఁ జందములు విన్నయ్యల్. 29

క. [1]బిద్దుగడలి దొరయల్లుం, డొద్దుకొనం దొడఁగెఁ గేలియొద్దు న్నవలా
నిడ్డ తెలినిగ్గు టిడ్డెన, వడ్డనకుం దొడ్డ లడ్డువాల్ వంచుటకున్. 30

[1] సూర్యనిఘంటు పాఠము. *'బిడ్డుం గడలి దొరల్లుం, దొడ్డు కొనందొడఁగెఁగేలియొద్దున్నవలా లిడ్డ'-పూర్వముద్రణపాఠం.*

మ. అమృదూష్టంబు సమర్పితాన్నము మరీచాయుక్తముల్ శాకముల్
సమలావణ్యవిదూరముల్ బడిదెముల్ బౌరాపణానీత మా
జ్యము నిర్మాధురికంబు పాయసము ఘస్రం బర్కలంఘ్యం బసౌ
ఖ్యము నీ వేగతి నారగించెదొ కదా కౌచేలధానాపహా! 42

సీ. మారీచవైరికి మారీచ మహిత శాకానీక మిది ప్రియం బౌనొ కాదొ
ధేను కాహితునకు ధేనుకామిత పయఃపాన సౌఖ్యము హితం బౌనొ కాదొ
మధువిభేదనునకు మధురసాస్వాదనాహ్లాదనం బిది మతం బౌనొ కాదొ
హంసవిద్వేషికి హంసోదకిని సేవనాభిముఖ్యం బిష్ట మౌనొ కాదొ.

గీ. యెఱుఁగము గదయ్య తప్పు సహింపుమనుచు
వేవిధంబుల భయభక్తి విన్నవించు
జనకభూభర్త సరసోపచారఫణితి
నాదిఫణిశాయి నవ్వుచు నారగించె. 43

క. సలవణమై సహజంభల, ఫలజలమై యేల కా విభవ సురభిళమై
విలసత్త్యెదర్యపరీ, మళ మిళితం బైన నీరు మజ్జిగఁ ద్రావెఁ. 44

క. అజ్జారే కజ్జాయము, మజ్జారే బజ్జి నీరు మజ్జిగ భళి లా
మజ్జక సౌరభ మజ్జల, గజ్జల మయ్యారె యనిరి కౌశికముఖ్యుల్. 45

సీ. కడియెత్తుచునె క్రోలఁగాదయ్య పానీయ మీవేఁడిచేరింత త్రావరాదె
మొదలనుండియు శాకముల నేటి యలవాటు కమ్మని పప్పింత కలపరాదె
చెప్పరాదని కూర చప్పరింపఁగ నేల యప్పళంబుల చవి యానరాదె
పిండి వంటల పిండిఁ బెట్టనేటికి ఘృతప్లుతభక్తకబళముల్ గొనఁగరాదె.

గీ. బజ్జి భుజియింపుఁ దల్లింపుఁ బచ్చడులకు
పెరుఁగు కూడి గురుంగూర వరుగులేల
నరుగు నన్నంబు వరుగంచు ననిలమంచు
నించువేడుక భుజియించి రెల్లమునులు. 46

గీ. అనఁటి గొల నుండి పండి తనంతఁదానె, యవసి రాలిన రసదాళి యువతివంపఁ
బటికల కొలంది నవ సుధా ఘుటికలనుచు, గుటుకు గుటుకున మ్రింగె నజ్జటికులంబు. 47

శా. శార్ఙంబే మురువంచు వంచుకొను చంచద్విభ్రమభ్రూలతల్
జార్గొప్పుం గొరకొప్పు చొప్పదరు నల్లంజిల్వ చెల్వంబు నా

గార్గోముల్ వలికమ్మవాతెఱల తీయంబోండ్లు మేలూరుఁబిం
డ్లూర్గాయల్ జనపర్ణ భాజనములం దొప్పార నర్పింపఁగన్. 48

సీ. మెత్తనై తావులు హత్తి యావులువారు తీఁగి మల్లెల సన్న యోగిరంబు
కమ్మనై నవనీత గతి నేకపాకమై పేరిన నెయివంటి పెసరపప్పు
చొక్కమై సరిగాక శోభిల్లు మృగనాభికా ఘుమంఘుమల సద్యోఘృతంబు
తెల్లనై శరదాగమోల్లసత్కల్హారవల్లభప్రభ యుల్లసిల్లు పెరుఁగు.

గీ. జంభరస గుంభితార్ద్రక శకలములును
సర్షపామ్రాదికోపదంశకశతంబు
నంచుకొంచు నొకించుక దించఁబోక
లోపలికి దించె ఁదాపస ద్వీపి చయము. 49

సీ. నారదుం డీజీవనంబు లాశించునే పా లివి చాల్ మందపాలమునికి
నీ పుట్టతేనియ యింపె వాల్మీకికి మెప్పించునె మరీచి మిరెపురసము
నేదూరుఁగాయ శాండిల్యమౌనికి నెంత యగిశాకుచా రగస్త్యఋషి కరుదె
బాదరాయణి రేఁగుపండ్లపచ్చడి మెచ్చు ముద్గలుం డీసూపములు గణింపఁ.

గీ. డనుచు జనకుండు సరసోక్తు లాడుకొనుచు
నుపచరింపఁగఁగలనైన నొక్క మెతుకు
గుఱుతెఱుంగని జటిలోకకోటి నగుచుఁ
దృప్తి వహియించి గఱ్ఱునఁ ద్రేన్చె నపుడు. 50

క. ఆఱేడు వగల చారు, ల్నూఱువిధంబుల రసావళుల్ వేయువహుల్
కూరలుఁ బచ్చ ళ్ళూర్పిం, డ్లూరుంగాయలకు లెక్కయున్ మఱి కలదే. 51

క. లెక్కలు పెట్టఁగ వచ్చుం, జుక్కలఁ దద్భక్ష్యభోజ్యచోష్యాదుల క
మ్మక్క మఱి లెక్క యెక్కడి, దక్కడి యొక్కొక్క కడి వెయాఱులు సేయున్. 52

శా. అన్నా యొక్కొక పత్ర భాజనము చాయం బ్రోవగుం జక్కెరల్
తిన్నెల్ వద్దయపూపముల్ వఱదలై దీకొన్న యాజ్యంబులున్
మున్నీరై ప్రవహించు తేనెలు ఫలంపుంగుంపులున్ దిప్పలౌ
జున్నుల్ కాల్వలు గట్టినట్టి దధి రాసుల్ గొన్న యన్నంబులున్. 53

గీ. యాదవస్వామిఁ గూడి గంధోదకములఁ, జేతులకు వార్చు నిర్మలచేతులకును
మునుల కొక సౌధవీథిఁ దాంబూల చేల, జాలము లొసంగి బహుళాశ్వ జనక నృపతి.

మ. ఘనవర్ణుఁ మణిపీఠి నుంచి శయశంఖం బేలు పన్నీట నా
టిన పాటీరము మేన మెత్తి మెయి రెంటెంబుం బదార్వన్నె రే
కు నునుందళ్కు పరాకు నూకు తెలనాకుల్ నిక్కు పేరుక్కు చ
క్కని కెంపుం గరుడింపు కెంపు వగ బాగాలున్ సమర్పించుచుఁ. 55

క. మంజుల మణి మౌక్తిక బల, భంజన రత్నాచ్ఛ గుచ్ఛభర్మ ప్రసవా
రంజన్నవ నవనారీ, కుంజరపట్టిపటి విధునకుఁ గట్టించెఁ. 56

క. తొగరాదొర బావకుఁ బ, న్నగరాట్కోటీరసఖుఁడు నలుగోటులకుఁ
జగరాజు లెఱుఁగ నమ్మిన, మగరా పతకంబు జనకమహిపతి యొసఁగెఁ. 57

శా. కొంచెంబా నడ నిబ్బరంబు కదమా క్షుద్రంబె ముల్లోకముల్
ముంచెఁ దీరు బలారిలాయమున నేలోకాన నేరాణువం
బంచారించిన యట్టి వారువము చెప్పఁ వింటిమే యంచు ము
న్నెంచఁ రాజిలు తేజి గంధకరిఁ గాన్కిచ్చెఁ మురారాతికిన్. 58

క. ఆతతి దైతేయారికి, నాతం దడ్డపడి లేచి హరిచరణసరో
జాతము శిరమున నురమునఁ, బ్రీతిం గీలించి మధురరీతిం బల్కెఁ. 59

ఉ. యాదవసార్వభౌమ సదయా వసుదేవసుధాబ్ధిపూర్ణచం
ద్రోదయ చక్రి శౌరి పురుషోత్తమ హృత్తమ ముత్తరించు నీ
పాదముఁ గంటిఁ గంటి మునుపంటితపఃఫల మెమ్మెయిఁ ద్వదీ
యాదర మిట్టిదంచుఁ గలనైన నెఱుంగుదునా జనార్దనా! 60

ఉ. అంబుజనాభ తావకపదాంబురుహంబుఁ దలంపఁ జాల డెం
దంబునఁ బ్రత్యహంబు గగనంబును జూచెద నీదు పాదపా
దం బొక చిన్నమెత్తుఁ గొను టజ్ఞుఁడఁ గాన భగీరథప్రయ
త్నంబుగ నెంతు నేమిఁ గని దాసునిఁ జేసితి దానవాంతకా! 61

ఉ. ఎక్కడు గాదె ద్వారవతి యెక్కడ హా మిథిలాపురంబు నేఁ
డెక్కడ సామివార లిటు నింటికి వచ్చుట యొంటి నేడ నే
మ్రొక్కితినో తలంచితినొ క్రొత్త లకారణబంధుఁ డౌట నేఁ
డిక్కడఁ గానవచ్చె సమదేభ మనోభయ భారభంజనా! 62

ఉ. సన్మునికోటి కెన్నఁడుఁ బ్రసన్నుఁడు గాఁడు విదేహ మేదినీ
భృన్మణి యింటికై యరిగి పెట్టెడు నన్నము పట్టెడుఁ భుజిం

చె న్మధుసూదనుం దనఁ బ్రసిద్ధి గణించితిఁ జాలుఁ జాలు నా
జన్మము ధన్యమయ్యె నిమిసంతతి పావనమయ్యె మాధవా! 63

సీ. ఒక యింత గుడిసెలో నొదుగుట యొప్పెఁగా నల జగత్పరి పూర్ణుఁడైన తండ్రి
యడుగు దోసెఁడునీటఁ గడుగుట కలరెఁగా మిన్నేఱుఁ బదమునఁ గన్నప్రోడ
త్రావి చేరెఁడుపాలఁ దనిసెఁగా నిల పాలమున్నీటిలో నోల గన్నమేటి
యిచ్చిన యొక్కసొమ్మెదఁ బూని మెచ్చెఁగా సిరికిఁ గాఁపురమైన యురమువాఁడు.

గీ. భక్తియే కారణము గదా! భక్తులిడ్డ
యొక్క తులసీ దళంబున కుత్సహించి
భుక్తిముక్తులు దయసేయు పుణ్యమణికి
జగతి ననిపించితివి పుణ్యజనశరణ్య! 64

వ. అని బహుప్రకారంబులం బ్రణుతించి యాదిఫణిశాయియైన యప్పరమపురుషుండు దాశరథియై త్రేతాయుగంబున సీతాశాతోదరిం బెండ్లియై మదీయగోత్రంబు పవిత్రంబు చేసిన చరిత్రంబు తెలంగు మీరెఱుంగుదురు వినంగోరెద నానతీయ వలయు నన్న విశ్వంభరుసన్నిధి విశ్వామిత్రుండు బహుళాశ్వవిశ్వంభరాభర్త కిట్లని చెప్పం దొడంగె. 65

ఉ. నందకపాణి దైవతగణంబులఁ బ్రోచుటకై దయన్ దశ
స్యందన నందనుండయి నిశాచరి నొంచి మదీయ యాగ మిం
పొంద సముద్ధరించి మునియుత్పలలోచన శాపమోచనా
స్పందన చేసి యాశివునిచాపము ద్రుంచి ప్రతాపశాలియై. 66

చ. జనకు ననుజ్ఞ నప్పుడు బిసప్రసవోల్లస దంశుమత్పలా
త్కనకపతాకికా మరకత స్ఫుటతోరణ దర్పణార్పణా
స్వనమరుఘంటికా చమరవాల విశాల వితానహల్ల నూ
తననుతిఁ గాంచెఁ బట్టనము దంతుర పట్ట పటీ పటిష్ఠమై. 67

ఉ. సున్నముపూసి చిత్తరువుచూపి పటోత్కటకాయమానముల్
వన్నెగ వైచి మంచివిరవాదులు గట్టి ఫలాంశుమత్పలా
భ్యున్నతి నిల్పి తోరణము లుంచి సహాటక శాటికాచ్ఛటా
చ్ఛన్న వితాన సంపద లొసంగిన రాఘ్ఛవనంబు భాసిలెన్. 68

క. జనకుఁడు రాముని జననీ, జనకుల రప్పించి స్వర్ణ సౌధంబులయం
దునిచి ముని గేస్తునిం జే, సిన మేటిం బెండ్లికొడుకుఁ జేయుం దన్నన్. 69

శా. వేశ్మగ్రామణిఁ జేర్చి వాసవమణీ వేదీ ధరిత్రిన్ సుధా
రశ్మిగ్రావసమగ్రపీఠమునకున్ రప్పించి తా మప్పుడా
యశ్మప్రాణవదాన్యతాపదపదోద్యద్రేణు రాణ్మౌలికిం
గాశ్మీరంపు నలుంగు వెట్టిరట రాకాచంద్రబింబాననల్. 70

చ. కవ జవరాండ్రుగా కొకతెగా యనిపించిన యైకకంఠిచే
సవ తొక యింత వత్తుమను సామజయానల యాననాబ్జముల్
ధవళరుచుల్ గనం దమకు దైవతయౌవత మీదుజోడు వా
ధవళము వాడి రిద్దఱు సుధాకరబింబముఖీశిఖామణుల్. 71

మ. తళుకుం దాయెతుచే రెదల్చి కచబంధం బూడ్చి యిర్వాయి నా
కలనల్ దీరిచి తావినూనెఁ బ్రసృతిన్ హత్తించి చేనొత్తి కుం
తలముల్ గూడఁగ దువ్వి కౌనుఁ గుచముల్ ధమ్మిల్ల మల్లాఁడఁగాఁ
దలయంటెన్ గలకంఠి యొక్కతె జనస్థానాసురధ్వంసికిన్. 72

గీ. ఇందుముఖి వల్పుటటకలి యిడియె నొకతె
తిలకవతి యొర్తు పన్నీట జలకమార్చె
సుదతి మృదుశాటిఁ బెన్నెరుల్ చుట్టె నొకతె
సిక యొకతె వైచి శిరసార్చె క్షితిపమణికి. 73

సీ. దరహాస సంపెంగ దండ చుట్టెడుచోటఁ గొఱజాది విరిలేని కొఱఁత మాన్చెఁ
బల్లవారుణ పాణిఁ బాటీర మలఁదుచోఁ గుంకుమ లేదను కొదవఁ దీర్చె
నలికులాలోక సొమ్ములు మేనఁ దొడుగుచో నీలము ల్చెక్కని నెగులు దిగిచె
సుమగంధి తాలవృంతమునను విసరుచోఁ దావిపన్నీ రీని తప్పు ద్రోచెఁ
గీ. జలువ లందిచ్చి మున్నె కాంచనశరీరి
యురిదిపనిలేని యఱగొర్త యుత్తరించె
నిలువుటద్దంబు మెఱుఁ గీనివెలితిఁ దొలఁచెఁ
బ్రవిమలకపోల రఘుకులగ్రామణికిని 74

మ. సుముహూర్తం బరుదెంచె నంచు నపుడా శూరాగ్రగణ్యుం డుద
గ్ర మదేభాగ్రణి నెక్కె నూతన పతాకా పుండరీకావళుల్
ద్యుమణిం బోలిన పంజులుం బగలువత్తుల్ మంచి యాకాశ బా
ణము [1]వింజామరక్రోవులుం బిరుసులున్ బ్రహ్మాండము న్నిండఁగన్. 75

[1] వింజామరు టావులున్ బిరుసులున్-బ్రౌన్‌పాఠము. వింజామర క్రోవులున్ బిరుసులున్-సూర్య నిఘంటు పాఠము. వింజామర క్రోవులుం బిరుదులున్-పూర్వముద్రిత పాఠము.

క. ఢక్కా నినాద భేద హు, డుక్కా పటహచ్ఛటా పటుధ్వనులును స
మ్యక్కాహళికా రవములు, దిక్కాండము ప్రక్కలించె ధిక్కారమునన్. 76

మ. నగరిన్ స్వర్ణ గరిష్ఠ సౌధముల నానాహంసయానామణుల్
మగపుట్టొందిన నిట్టులుండవలదా మమ్మారె యాజానుదో
ర్యుగళం బౌర గళం బయారె యుర మూరుద్వంద్వ మమ్మక్క మేల్
నగుమో మన్న కిరీటిపచ్చ మెయి మిన్నా పూర్ణచంద్రాననా! 77

ఉ. కన్నులయందమా కలువకచ్చుల యెచ్చుల కేమి తమ్మిరే
కన్నులయందమా యెఱుఁగవా మగువా తొగవాటమే సుమీ!
నెన్నుదు రంటివా కుముదినీవిటు నీవిటు లాఁతి నీడుగా
నెన్నుదు రంటివా రఘుకులేంద్రుఁ డుపేంద్రుఁడు వోతలోదరీ! 78

క. చూచితిమే కద సుమనా, రాచధరాధర ధనుర్ధురంధర బంధు
ద్యోచర వరతనయుల నీ, రాచకొమారునికి సాటిరారు లతాంగీ! 79

మ. కరటిగ్రామణి నెక్కి లక్ష్మణుఁడు వెన్కన్ వీటికాపేటికా
ధరుఁడై వీడె మొసంగ నద్దొర పిఱుందం జామరద్వంద్వ మొ
క్కరుఁ డిర్వంకల వీవఁ దెల్లగొడుగుం గైపొంది కోటీర భా
స్వరుఁడై వచ్చెను రామచంద్రుఁడు దయాసాంద్రుఁడు చంద్రాననా! 80

సీ. కురులుకూడనినాఁడె యిరులుగ్రాసినమేని రాకాసి నేసిన రవ్వ యితఁడు
రెండవవేల్పుతేఁ దుండ వన్నెగఁ గూర్తు మనువాని జన్నంబు మనిచె నితఁడు
జడదారియొయ్యారి వెడదారితీరు వో నడుగునెత్తమ్మి దు మ్మిడియె నితఁడు
ముక్కంటి బలువింటి యుక్కంటి విఱిచిన చేబల్మికల్మిచేఁ జెలఁగె నితఁడు
గీ. దుక్కిలోనుండి మనరాచతిక్కతేని
యక్కఱకుఁ [1]బుట్టినట్టి యా యనుఁగుఁబట్టిఁ
బెండ్లియాడఁగ నేతెంచు పిన్న యితఁడు
చూడఁ గదరమ్మ! కన్నులవాఁడు దీఱ. 81

శా. అంగం బంట మనోజుఁ డేసె భవదీయాంకంబు వీక్షించు సా
రంగాక్షీమణి నన్నుఁ ద్ర్యంబకధనుర్భంగంబుఁ గావించి తా
భంగిం జెప్పకు భానువంశతిలకా! పంచాంబకాంచద్ధను
ర్భంగం బించుక చేసినప్పుడు గదా! బాహాబలం బేర్పడున్. 82

---

[1] బట్టినట్టి-సూర్యపాఠము.

ఉ. కంటికి విందవైతి తెఱగంటికిఁ గుంటికి బాసయిచ్చు నీ
వింటికి నారినైన మనసిత్తువుగా! యది గూడ దేని నీ
వింటికి నారినైనఁ గొద వీడదె మంచిగుణం బటంచుఁ జే
కొంటి కుచోద్యమే కరముఁ గొప్పునఁ గూర్తువుగా రఘూద్వహా! 83

చ. అసమకృశాంగి యోర్తు విరులమ్ముచుఁ బూసరు లెత్తి రాము సొం
పొసఁగఁగఁ జూచి యిట్టు లనె నోయి రఘూద్వహా! నీవు నన్ను నేఁ
డొసపరి కౌఁగిటం గలయకుండిన నీ ముడిపువ్వులే సుమీ!
ప్రసవ శరాంబకంబులయి బాములఁ బెట్టెడు నన్ను కైవడిన్. 84

ఉ. రామునిఁ జూచి కామునిశరంబుల గాసిలి చేష్ట దక్కి కాం
తామణి యుండె నోర్తు రఘునందనపాదరజంబుచేత ముం
గోమలిరేఖ రాతి కొనఁగూడెనొ లేదొ యటంచు నెంచి లీ
లామహితాంగ మొందఁగ శిలామయరూపముఁ దాల్చెనో యనన్. 85

ఉ. అంచు వధూటు లెల్లఁ బురి హట్టములం గన దేవతాతతుల్
కాంచనగర్భదిక్పతి నికాయశుకాదులు పాదచారులై
యంచుల నేగుదేఱఁ బురి యంచుల కేగి హజార మోరకే
తెంచి రఘూద్వహుండు బలదిగ్గజ మక్కరి డిగ్గె డిగ్గినన్. 86

ఉ. వాకిట వాకిటన్ విబుధవర్గ కరార్పిత పూర్ణకుంభముల్
కోకపయోధరల్ మణులఁ గూర్చిన యారతి పళ్లెరంబులున్
శ్రీకరదర్పణంబులును జెల్వుగఁ గాంచి గృహంబు సొచ్చి యి
క్ష్వాకు కులాగ్రగణ్యుఁడు వివాహ వితర్దికఁ జేరె నంతటన్. 87

సీ. జలకమార్చి మెఱుంగు టలకల తడియొత్తి గొనబు పాపిటఁ దీర్చి కొప్పు వెట్టి
మొగలిఱేకులు చెక్కి మొగడ సంపఁగి దండ యుద్దండశృంగార మొనరఁ జుట్టి
శోభిత మృగనాభి నాభినాభముఁ దీర్చి చొక్కంపుమణుల చేర్చుక్క చేర్చి
కుంకుమ పంకంబుఁ బొంకంబుగ నలంది కమనీయ హార మొక్కటి ఘటించి

గీ. అవిక హవణించి నెరుక యేర్పడిన చంద్ర
కావిపైఁ గాంచికాదామకం బమర్చి
కోటి చేసిన యొక తులాకోటి మొరయ
సఖులు దెచ్చిరి సతిఁ బెండ్లి చవిక కడకు. 88

క. ఆ కళ్యాణంబున గౌ, రీకళ్యాణముల రఘుహరిం బొగడిరి నా
నా కళ్యాణులు కోకిల, కా కళ్యాణ పద కంఠకమన ధ్వనులన్. 89

గీ. అక్కళాశాలి పెండ్లినాఁ డొక్కలాగు, వక్కలాకులె యక్కటా వాక్కలాప
కబరికాధర గతరాగ గల్లభాగ, ధిగధిగద్ధిగ దీధితి ధిక్కరించు. 90

క. ధనువింత దునిమి ధరణీ, తనయాగ్రణిఁ బెండ్లియాడెదను నే నని ము
న్మను గంకణంబుఁ గట్టిన, ఘను కరమునఁ గంకణంబుఁ గట్టిరి విప్రుల్. 91

క. కుంఠీభూతేతరకల, కంఠీకల కంఠగళము కల్హారవనీ
కుంఠీకృద్విభుకులరా, ట్కంఠీరవ మపుడు తాళిఁ గట్టెఁ హాళిన్. 92

క. జలజాక్షి పసిఁడి గిండిం, జలములు వర్షింప జనకజనపతి రఘురా
ట్కులమణికే లొగ్గఁగ వి, ప్రులు నేర్పున మంత్రతంత్రములు పచరింపన్. 93

క. ధారాధర కన్యామణి, ధారఁ ధారుణిఁ జెలంగు తనదుతనూజన్
ధారాధరధమ్మిల్లఁ, ధారాదత్తంబు చేసి ధన్యుం డయ్యెన్. 94

క. అల కీల్జడ యిలదేల్మడ, మలఁ గీల్కొనఁ జక్కనిక్కి మదవతి కనుపా
పల డాల్రెప్పల నూల్కొనఁ, దలఁబ్రాల్ వోసెన్ నృపాల దర్పకమౌళిన్. 95

ఉ. హోమ కృశాను ధూమమున కోరఁగఁ జేసిన గోముమోముచే
రాముఁడు చూచె సీతయధరంబు పయోధర మాదరంబు పే
రామని బంధుజీవసుమ మచ్చుటఁ బిందియఁ గన్నయట్లు చిం
తామణి గన్నరీతిఁ దనదండన మేరువు గన్న కైవడిఁ. 96

ఉ. ఇందఱి మించి పల్కెదు మనీషివె పో యవి మావి దక్షిణల్
ముందువిడెంబు మాది యొక ముక్కయు రాదట నీవు స్మర్తవే
యందఱు శుద్ధశుంఠ యితఁ డందురు మి మ్మనుచున్ విఠా శతా
నంద వసిష్ఠ శిష్యుల కనంతకచాకచి యయ్యె నయ్యెడఁ. 97

మ. పరమేష్ఠిప్రముఖుల్ త్వదీయ పద సంస్పర్శంబుఁ గావింపఁ బ్ర
స్తరమే దుర్లభ మింతి యైన నిపుడో ధర్మాత్మ యంచున్ నృగన్
దురితోత్పాటనమైన కేల సనికల్ ద్రొక్కించె నక్కామినీ
చరణాంభోరుహ మంగుటంబుఁ గొని కౌసల్యాసుతుం డంతటఁ. 98

శా. కళ్యాణాహము లీప్సితాన్నఘృత లోకంబుల్ ప్రవర్తిల్లినం
గళ్యాణాంబర చేటికాశ్వగజ సంఘం బిచ్చి శాపాన్వితా
హల్యాకల్యవతార భేద నవపాదాంభోజుఁ గళ్యాణియౌ
కుల్యారత్నముఁ బుత్రికన్ జనకుఁ దేగుం బెండ్లి నాఁ డంపినఁ. 99

క. ఆరేయి రూపరేఖా, ధౌరేయి మెఱుంగు వంటి ధారేయిం బల్
గారాముతోడఁ దోడ్కొని, శ్రీరాముని సౌధమునకుఁ జేరిచె నంతన్. 100

శా. ఆకుంబచ్చని చిల్కపచ్చపనులన్ హత్తించి క్రొంజాళువా
తేకుం జందపు దారబందపు సిరు ల్రేరాచరాటంకు ని
ద్దాకుట్టుంబన తావుపట్టు తెరవింతం గన్న గందంపు హీ
ఱాకెంగేలి యొయారి వ్రాతపడకింటం గెంపుఱాతిన్నియన్. 101

ఉ. గొప్ప పసిండి కోళ్ల కొనఁగూడిన గచ్చు మెఱుంగు పట్టెలున్
ముప్పిరి పట్టుపట్ట తెలిముత్తెపుఁ గుచ్చులతో రువాణపుం
దుప్పటి కప్పుతోఁ బటువుతో నొరపుం బఱపుం జొకారమౌ
చప్పర మంచమందు చొరచందురుఁడై కళలొంద నుండఁగన్. 102

ఉ. గందపుఁ బూఁతతో గొనబు కస్తురి బొమ్మునఁ బూఁత కానరా
నందపు వల్లెవాటు రుటమందిన దుప్పటితో రుమాలుపైఁ
బొందుగఁ దల్కు చిందు సిగపువ్వులతోఁ దెలినిగ్గుటొంట్లతోఁ
గెందలిరాకుబాకుదొర గెల్చిన రామునిఁ జూచి రాచెలుల్. 103

క. చూచి భవన్ముఖ దర్శన, సూచక పులకాంకురాంక సూచక దళితా
నీచక కంచుళి చుళికిత, మేచకకచ మహిళఁ గంటె మిహిరకులేశా. 104

చ. పుడమిని రాచయిండ్ల మఱి పుట్టునె యీవగకొమ్మ యమ్మరో
కొడెదెడు నెమ్మొగంబు తళుకుం దెలికన్నులు చేరెఁడేసిగా!
పిడికెడుగా నునుంగవును బెన్నెరులుం దెగ బారెఁడేసిగా!
యొడలు తొడల్ నడల్ మురువు లోయి యయో యినవంశభూషణా! 105

క. చేలకు వన్నె యొసఁగు నీ, తాలక్ష్మికిఁ బులకసస్యతతులు ఫలించున్
నీ లలితకృపారసమున, నీలఘనాభోగమే గణింపఁగనేలా. 106

క. సీతాపతి! యలుక మొగం, బై తానున్నది రఘూద్వహా! పరిరంభా
న్వీతం జేయఁగఁ దగదా, చేతులు పట్టుకొన నీవి చేకుఱు నీకున్. 107

క. పడఁతి విడెమిడిన నడచెద, వెడవిల్తుని యనికి ననెదు విలువితిచిన నీ
యెడకమ్ముదొట్టి కంతుఁడు, కడబొమ విలుచాయ చిగురుఁగని చించు నృపా! 108

ఉ. సీమపొలంతులట్లు రఘుశేఖర! యీపువుబోఁడి కాదు గా
రాముల రత్నగర్భ యుదరంబునఁ బుట్టిన మిన్న మొన్న సూ

మా మకరాంకరాజ్యరమ మానిసి యౌట యెఱింగి యూడెగం
బేమియుఁ జేయనేరదు సుమీ! యని చెల్వలు చెప్పి వెల్వడన్. 109

క. శయ్యకు రమ్మా బాఁగా, లొయ్యనఁ దెమ్మా యయో ప్రియోక్తవు కమ్మా
నెయ్యపుఁగొమ్మా! గుబ్బల, పయ్యెద యిమ్మా భుజాంకపాళికఁ గొమ్మా. 110

ఉ. మొగ్గలు గోరి రా వివరముం బయికొంటకు మ్రోగు మేఖలా
యుగ్గురుఘంటికల్ మణితయుక్తికి ముత్తెపు గుచ్చుదండ మెం
డొగ్గిన కౌఁగిటన్ గఱచునోజకు సందిడిదండ నీకయో
యెగ్గొకయింత లేని బిరుదింత తలోదరి! సిగ్గు లేటికిన్. 111

సీ. అసదు నెన్నడు మనంతాకారమొందిన శ్రీమనోహరకటి పృథ్వి యయ్యె
గురుపయోధరపాళి గోత్రాకృతివహింప వసుమతియై తనూవల్లి మెఱసెఁ
జపలనేత్రద్వయి విపులయై విలసిల్ల నుల్లలత్కబరిక యుర్వి యయ్యె
భవ్యోరుయుగళి రంభకు ధాత్రియై యొప్పఁ గుంభినీగతి యయ్యెఁ గులుకునడయు
గీ. నెల్ల యవయవ గుణములఁ దల్లివోలె
ధారుణీనందనకు క్షమాగౌరవంబు
చాల దనిపించు కొనుటయే సరవి నీకు
వ్రీడ కూడునె నీవంటి ప్రోడ కైన. 112

ఉ. తిన్నఁగఁ దెల్లనాకుఁ గడతేఱఁగఁ జీలిచి క్రొత్తగోరునన్
సున్నము రాచి చుట్టి నునుచుట్టకడల్ తగుపాటిఁ ద్రుంచి తా
వెన్నెల రాచరాబరణి విద్రుమరక్తిమ నిక్కువక్కలా
కన్నె యొసంగె నవ్వలి మొగంబయి రాట్పువిపాణి పాణికిన్. 113

సీ. చక్కని పాలిండ్లు జక్కవలంచునో రామచంద్రుకరంబు రాయనీదు
లలితవేణి నవోత్పల శ్రేణి యంచునో యొకయింతయిన కరం బొలయనీదు
మహితోరుయుగళి రంభాస్తంభ మంచునో రఘుకుంజరకరంబు గ్రమ్మనీదు
చారుకపోలంబు చందురుండంచునో వరకరవ్యాళంబు వ్రాలనీదు
గీ. గంధసింధురయాన వసుంధరాస్త
నంధయీమణి యీకున్న సింధుబంధు
బంధన ధురంధరుం డిలాభర్త నీవి
బంధమోచన సంబంధ పటిమఁ దలఁచె. 114

గీ. కాంత వక్షోజహాటక ఘటములుండ, నధరమణి యుండ నటువెట్టి హోళిపుట్టి
పోఁకముడికిఁ బెనంగె రాట్పుంగవుండ, యారె! పుష్పధనుర్ధరప్రేరణంబు. 115

గీ. కామినీ చిత్తచోరుఁడు రాముఁ డింతి, గురుకటీపటియొకున్న గోఱుకత్తి
దారి చెనకిన గండంబుఁ దప్పుకొనియెఁ, గొమ్మ చెక్కిలి జైవాతృకుండు గాన. 116

ఉ. మోవి యొసంగ దాడ దొక ముచ్చట గుబ్బపయంట మీఁదఁ జే
వైవగనీదు కాదు కడ వక్కయు నా కిడి కొమ్మటంటకై
యేవగనుండి నాఁడొ హృదయేశుఁడు గుండియ గూడువట్టి తా
దేవుఁడు గానఁ గొంత కడతేఱె మనోభవుధాక కన్యఁడే. 117

ఉ. భూరమణుండు కోమలికిఁ బొందుచు గండవరంబుపైఁ బ్రియా
భారముఁ జూపి తానొడలిపై విహరించెను గాంచి మీఁదటం
గ్గైరహి చేరిచెం గదళికావనకాండము సొంపుమీఱు పే
రూరు గ్రహించెఁ దారసిలె నుద్ధతి నవ్వలరాచవీటికిన్. 118

క. కామిని సీతాభామిని, సామినిమీలిత దృగంబుజాతనుగా నా
సామి నిమిషంబులో న, య్యామినిఁ జొక్కించె దర్పకాహవభూమిన్. 119

సీ. గాఢోప గూహనక్లామ్యత్తనూవల్లి వివిధాస్యవీటికా వినిమయంబు
సద్యస్సమక్షశిక్షాలబ్ధమణితంబు కచభరగ్రహగళద్విచికిలంబు
రదనచ్ఛదచ్ఛిదారౌద్రలపనపట్టి నఖరత్రుటద్గల్లనసహద్దృష్టి
బంధసంబంధవైభవ భవాలసవృత్తి బహునయానునయపుంభావభూతి.
గీ. భూరిమర్మోక్తి కృతభుజాభుజివిరాజి
సౌఖ్య పరిణామ కుచకుంభ శయన సమయ
నందితానన సౌరభ్య మిందువదన
మదనకదనంబు మహిభర్త మదిఁ గరంచె. 120

క. ఈరీతిఁ బెనంగిరి తా, మా రాతిరి నాతియుం బురారాతి ధను
ర్దారియు నంత నయోధ్యకు, నారా జిర్వురను జనకుఁ డంపెం బ్రేమన్. 121

శా. సీతారాముల మాళవీభరతులన్ శ్రీయూర్మిళన్ లక్ష్మణున్
ధూతాఘున్ శ్రుతకీర్తి కీర్తినిధి శత్రుఘ్నుం దశస్యందనుం
డీతానందముతోడ దోడుకొని పోయెన్ నాఁడయోధ్యోర్వి కం
చాతండీ కతఁ జెప్పి యజ్జనకునిఁ హర్షంబు నొందించినన్. 122

మ. రఘువంశంబునఁ బుట్టి యధ్వరము సంరక్షించి మౌనీంద్రస
త్యఘుముం గాలిచి విల్లుఁ ద్రుంచి మహిజం బ్రాపించి తాతోక్తిఁ జెం
ది ఘనారణ్యముఁ బొంది యందు ఘన విద్వేషిక్షతి న్నాఁడయో
ధ్య ఘటోరోజను గూడి రాజ్యసుఖివౌ నారాజ వీవే హరీ! 123

క. ఈ విందుండిన మనరే, యీవిందు లటన్న నతనియింట వెలందుల్
తావిందు లారగింపుచు, గోవిందుం డందు నుండెఁ గొన్ని దినంబుల్. 124

క. ఈరీతి జనకు నింట ము, రారాతి దయన్ వసించి యంతట నొకనాఁ
డారా జొడఁబడకున్నన్, ద్వారక కేగుటకుఁ బ్రార్థనల నొడఁబఱచెఁ. 125

శా. అద్వైత్యాంతకుఁ డిత్తెఱంగె శ్రుతదేవాస్యంబు కన్గొంట ప్రా
సాదోర్విం ద్విజమౌళిచేఁ బ్రసవపూజ ల్గంట విప్రస్తుతుల్
మోదంబందఁగ వింట భోజనములం బూర్ణాత్మ సంతుష్టి నుం
టాదారి న్మరదారి ద్వారకకు దా నానుజ్ఞ గైకొంటయుఁ. 126

క. దైత్యారి యపుడు జనకున, కత్యాదరలీల వాంఛితార్థప్రదుఁడై
సత్యాసత్యాది కళా, వత్యావృత్యాప్తిఁ బురము వాడల వెడలెఁ. 127

సీ. ఈరామ కతనఁ గాదే శౌరి జాంబూనదంబు వర్షించు రత్నంబుఁ గనియె
నీ భామ కతనఁ గాదే భూధరోద్ధర్త నరకాసురజయంబు నాఁడు గొనియె
నీ వామ కతనఁ గాదే చక్రి పారిజాత ప్రపాటన నటత్ర్పణుతిఁ గనియె
నీ లేమ కతనఁ గాదే మురారాతి రుక్మిణిచేత నిజము వల్కించుకొనియె
గీ. రామ యీరామఁ గన్న యారాజమౌళి
భాగ్యమే భాగ్య మబ్జాక్షి బ్రతుకె బ్రతుకు
మఱి యశోదా కృశోదరీమణికిశోర
సార్వభౌమాభిరామ యీ సత్యభామ. 128

వ. అంచుం బౌరలోకానీకం బవలోకింప. 129

సీ. నునుసొంపుఁ గనుచెంప పని క్రొంజికిలి ద్రొక్కి నిడుదయొుంటులనిగ్గు టడుగుజాఱ
సిగమొగ్గ సంపంగి చెందిరపు రుచులు జిగి యొంట్ల కడకెంపు సిరులు నింప
డావంకఁ గశలు గట్టని యంగి పైతాళి నెఱకెంపు కుంకుమ నీరు చల్ల
నిజకటీతటిఁ జెక్కునీలంపుఁ బిడిబాఁకు కనకశాటిక గుల్ల కావి గట్ట
గీ. క్రొత్తలాతంపు గొరజి తాకుల నొకింత
కణుకణుగుమంచు రానేల బణుకుసణుగు
కణుఁగుసాంబ్రాణి కంఖాణిగతికిఁ జొక్కి
యెక్కి చనుదెంచు చక్రికి నెదుట మ్రొక్కి 130

సీ. మద్దికాయలనాఁడె మద్ది వ్రాలఁగ నులూఖలము లాగినబల్మి కాఁ డితండు
తనమామ దవిణ యిచ్చిన యట్టి పట్టంపుఁ జెట్టిఁ గొట్టిన జగజెట్టి యితఁడు

కట్టల్కఁ జదలేటి పట్టిపైఁ దనచుట్టుఁ గత్తి యెత్తిన శౌర్యఘనుఁ డితండు
రాణివాసపుఁ బోరు రారాపునకు వేల్పుచెట్టుఁ దెచ్చిన జయశీలుఁ డితఁడు

గీ. శకట కైటభ ముర జరాసంధసాల్వ
ఖరతృణావర్తబక మధుకంస హంస
బాణ శిశుపాలకవ్యాళ భంగశృంగ
నిజభుజార్గళుఁ డితఁ డంచు నీటు గనుచు. 131

శా. రాధానాథ! వధూటు లీవు నిటకున్ రాఁగా జనాళీ జరా
బాధల్ మాసెను వ్యాధులెల్ల నడఁగెన్ బాధిర్యముం బాసె ఘో
రాధుల్ క్రుంగెను బంగులుం బసువు డాయం జొచ్చి రంచున్మురా
జీ ధీరాగ్రణికిం బ్రజావ్రజము జేజే వెట్టి హట్టంబునన్. 132

మ. అపు డాపట్టనభూమి వెల్వడి శుకవ్యాసాత్రిమైత్రేయ క
శ్యప శాకల్య పరాశర చ్యవన విశ్వామిత్రుల న్నిల్పి జా
నపదక్షోణులు దాఁటి జోఁటిగమి వెంటన్ రా శతాంగాశ్వహ
స్తి పదాభ్యున్నతి శౌరి ద్వారక ప్రవేశించెం బ్రమోదంబునన్. 133

మ. బహుళాశ్వశ్రుతదేవు లాశ్రితఘృణాపాంగుల్ వినీలాంగు న
త్తుహినాహార్యతనూభవాసవన సంతుష్టాంతరంగున్ మహీ
మహిళాభర్త జగత్త్రయాంబుజవనీమార్తాండుఁ గీర్తింపుచున్
మహితానందముఁ జెంది రచ్యుత కథా మాధుర్య ధుర్యాత్ములై. 134

ఉ. అందలిరాజు భాగవతుఁ డౌటనుజేసి పురంబులోని వా
రందఱుఁ బుణ్యు లందఱుఁ గృతార్థులు భాగవతోత్తముల్ వణి
జ్జనందనుఁడౌ కళానిధి గుణంబులు కానివి ద్రోచివైచి గో
విందునిచేత మెచ్చుఁగొని వీరల నిద్దఱి మించె నిద్ధరన్. 135

వ. అనిన మునిసార్వభౌమునిం గనుంగొని పరీక్షిదవనీరక్షి వణిగన్వయపయోనిధి కళానిధి కళానిధి కథావిధానంబు సవిస్తరం బానతీయవే యని యడుగుటయును.

శా. తుఖ్ఖారాది హయాధి రోహణ కళాద్యోరత్న తుఖ్ఖేచనా
మఖ్ఖాడిల్లి వెడందకోట హుకుమీ మాహీష్మతీ మాహురీ
దిఖ్ఖండేందు నిటాల కాకుచఘటీదేశార్ధకాశ్మీర స
మ్యఖ్ఖాభ్రామ్యదతిప్రతాపతపనీయాహార్యధైర్యోదయా. 137

పృథ్వి. సగంధగజసైంధవాసమసమగ్రనీతిక్రియా
యుగంధర ధరాధురాయుత భుజాగ్ర జాగ్రత్ప్రథా
యుగంధర హరాక్షి భూహుతభుగర్చిరుచ్చైర్మహో
దిగంధ తమసద్యశక్తి మితమత్తధాత్రీధవా. 138

గద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్ర కరుణానుగ్రహ శాశ్వతైశ్వర్య ధుర్యతా మహేశ్వర రూప
రేఖా విజిత రతీశ్వర సరస సంగీతసాహిత్య సకల కలావిచక్షణ సమాశ్రిత విద్వత్కవి
రక్షణ దక్షవీక్షణ యినిగెల గోత్రపావన పరిపంథి రాజకల్పితపాదసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాంబా
గర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవ శేషభాషామనీషాబల
ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయక ప్రణీతం
బైన బహుళాశ్వచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.



శ్రీరస్తు

# బహుళాశ్వచరిత్రము

## పంచమాశ్వాసము



క. శ్రీమహిళా మహిలాభ ద, యా మహిమాంభోజనాభ యతిలలితసుధా
ధామోదిత శ్రీహరిసే, వామోదిత వేంకటేంద్ర వైభవసాంద్రా. 1

వ. అవధరింపు మయ్యుత్తరాతనూభవునకు బాదరాయణి యవ్వలి కథావిధానంబు విని
పింపం దొడంగె. 2

సీ. ఆ మిథిలాపురియందు రత్నాకరుఁడను వైశ్యుఁ డొకఁడు ప్రియవ్రతాఖ్య
తనయుఁ డాతనికళత్రంబు భాగీరథి కొడుకు కళానిధి కూర్మితనయ
కమల సత్కమలాక్షిఁ గళ్యాణ మొనరించె గోవిందుఁ డనియెడు గుణనిధికిని
గొమరునకును దక్షుకూఁతుఁ బెండ్లి యొనర్చె రోహిణి యను వరారోహ నతఁడు
గీ. తనకుఁ జుట్టంబు పక్కంబు తల్లిదండ్రు
లన్నదమ్ములు మనుమలు నాలు బిడ్డ
లెల్ల నల్లుండ్రు నిల్లండ్రు నుల్లసిల్ల
ననిశముఁ గుబేరసంపద నతిశయిల్లు. 3

గీ. ద్వాదశి నమాస సంక్రాంతితతిని గ్రహణ, మప్పుడర్ధోదయమహోదయములనొక్క
కాసు భూసురునకు నీఁడు గాని గడవఁ, గోరు ధనవంతుఁ డయ్యు నయ్యారుజుండు.

క. అదాయమునకుఁ దగినది, లేదాయెన్ వెచ్చమంత లేదాయెనె మా
టాదాయోదనిధీ యను, టే దాయ గదయ్య యక్కఠినచిత్తునకున్. 5

ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడకట్టఁడు రాచనగళ్లకుం జెపిం
బెట్టఁడు కీర్తి తారమిడి పేర్కొనుచో నరకాసు బేరముం
బెట్టఁడు ధర్మచింత సరిపెట్టఁడు గట్టిమనంబు దిట్టఁ డ
క్కట్టిడి వైశ్యుఁ డన్యుల కగణ్యము గాఁగఁ గణించె రొక్కమున్. 6

చ. దిన మొక కూర గానిమతి తేకుఁడు శాకములంచుఁ బల్కు వం
డిన పలు గూరఁ గాంచి జగడింపఁగఁ జొచ్చు నటంచు వాని నొం

టిన భుజియింపఁ బెట్టి కడ నిచ్చు భుజించెద రింటివార ల
య్యనుపమ శాక సూప కలమాన్న ఘృతాదుల వాఁ డెఱుంగమిన్. 7

క. పెసరంబ ప్పేమిటికని, కసరు న్నెయి గొనఁడు పండుగను గొయకూరే
కొసరుం బలుచని చల్లయె, మొసరుం గనఁ డతని లోభమున కేమందున్. 8

క. పచ్చనియాకుం దానికిఁ, బచ్చిన గొంటొకటి నములుఁబో మొలఁ బూనం
డెచ్చో మాయునొ యని తెలి, పచ్చడ మటువెట్టి యొంటి పంచెనె తిరుగున్. 9

మ. కరఁగుందాఁ బొరుగమ్మకాన కెదురంగళ్ళం గొనంబోవ దృ
క్కరసంజ్ఞన్ మరలించి వారల కిడుం గాసెచ్చుగా బేరముల్
తెరవాటిందతి వీడు వెచ్చమునకున్ లేకున్న నేమాయె ని
త్తురుగా కొయ్యన నంచుఁ బోక యడకొత్తుం జేతి కిచ్చు న్వడిన్. 10

మ. పడి కొంచెంబుగ రాచు, నుప్పుడులకుం బానీయ మర్పించుఁ, ద
క్కడ గట్టుం దిన మెచ్చు గుందులుగఁ, బూన్కెన్ నేతిలో నూనియల్
మిడుచు, న్నూనియ నాముదంబుఁ గలపున్, మేలాముదంబందు వే
ల్మిడి నించుం, గదియించుఁ బ్రాఁదవుడు హోళిం గ్రొత్తబియ్యంబునన్. 11

క. తాఁ బేద కప్పు వెట్టడి, చోఁ బాతిక వడ్డిఁ గొలుచు సు మ్మడ్డుగకున్
ప్రాఁ బిచ్చపడిని గాసోక, టీఁబోఁ డీతఁడుగ వెచ్చ మిడుగుదు వడుగున్. 12

క. శాంతుల సొమ్ములు వెలచేఁ, గొంత పడిం గొంత కొలను గొంత హణాచిన్
గొంత హరించుఁ గువాళపు, దొంతర వైశ్యుండు పశ్యతోహరుఁడు గదా. 13

గీ. క్రొత్త తిరువాదిఁ గని ప్రాఁతరూక యంచుఁ
బ్రాతహణఁ బూచి నాడెంపుఁ బణమటంచు
నాణె మొరయంచు నొరయైన నాగరంబు
ధవళి నెడవెట్టటంచు వట్టంబుఁ దివియు. 14

క. ఆరత్నాకరునకు శృం, గారకళాశాలి తారకాహితరేఖా
హారి కళానిధి పుట్టెన్, బారావారమున నమృతభానుఁడుపోలెన్. 15

ఉ. చంద్రుఁడ కాంతిసంపదలఁ జారువికాసవిలాసరేఖలన్
జంద్రిన లెల్లచోట వెదజల్లెడువాఁడు వితీర్ణివైఖరిం
జంద్రకి సాదితండ్రి తల చల్లనిపూవు ప్రసన్నతంగొరల్
చంద్రముఁ దక్కళానిధి కళానిధినామము వానికే తగున్. 16

సీ. అంభోజ రాజహర్యంగ దీధితివాఁడు శ్రవణభూషణవిలాసములవాఁడు
విమల చందన పంక హిమకరంబులవాఁడు కస్తూర్యురస్తటాంకంబువాఁడు
ద్విజ బుధేంద్రులకెల్లఁ దెగుదారి యగువాఁడు రేఖాఫలిత నమస్క్రియలవాఁడు
కొదలేని సిరితోడఁ గూడఁబుట్టినవాఁడు గురుశిక్షచే విద్యఁ బరఁగు వాఁడు
గీ. కావ్య భాస్వత్పరిచయముఁ గన్నవాఁడు
కన్నవారికిఁ జల్లనై యున్న వాఁడు
రోహిణీభర్త రత్నాకరునికుమారు
ధీరుని గళానిధిని వినుతింపఁదగదె. 17

ఉ. అంతట నొక్కనాఁడు వణిగాత్మజుఁ డందఱుఁ జూడఁ బోవ వా
సంత మహోత్సవంబు మహిజాపరిణేతకు నేఁడు గొంతవీ
క్షింత మటంచు స్వామి గుడికి న్నడచెన్ గుడిసేవ చూడరా
దింతయు నన్నతండ్రిపలు కిచ్చ నటింపఁగ ముచ్చటించుచున్. 18

ఉ. చేరెఁ గిరాటజూటమణి శ్రీరమణీశ నివేశ గోపుర
ద్వారము హా వచో ముకుళిత స్వదృగధ్వగ పూజితానిలా
ధారము సేవనార్థి జనతాప విపాటి కవాట పీఠ పా
టీరము నా నటత్పుట కటీర తటీక నటీ కుటీరమున్. 19

ఉ. అక్కడ నుండి దేవనిలయంబునకు న్వలచుట్టుచోనహే
దక్కు సుమాసవ స్రవణ దత్త మహత్తర శీతలత్వ స
మ్యక్కృశ వాతచూత రసమంజుల వంజులఝూట పాటలీ
భాక్కుటజద్రుమ ద్యుచర పాదప వర్గగ మార్గగామియై. 20

క. కనియె వణిజ్మణి దధ్యో, దన సద్యోఘృత సితాప్లుతప్రతి పూపా
ద్యనుపమ పరిమళ మోదిత, జనజాల విశాల పాకశాల న్లీలన్. 21

శా. గ్రావస్తంభ పవిత్ర పాణ్య శనభు గ్రామీణ పర్యంత భూ
వ్యావల్గత్ప్లవగంబు శీర్షగత పూర్ణా పూప పాత్రీధురా
ద్రావద్రావిడబాడబంబు గణికోద్యల్లీల హల్లీసక
వ్యావృత్తాశయమైన దాశరథి దేవస్థాన మీక్షింపఁగన్. 22

గీ. రండు కోవెలసేవలరాజముఖులు, రాక యుండిన నెఱుఁగుదురే కదయ్య
వచ్చు గుడి యధికారి చీవాదుపెట్లు, తమకు బలె నంచవసరంబు తముకు మొరయ.

సీ. తలగడ గా దట్టిదార్చి కూర్చెనొ లేదొ వడిఁ ద్రుళ్ళి పడిలేచి వెడలువెలఁది
బారాపది యటంచుఁ బాచికల్ వైచి యల్లటఁ బాళికడఁ ద్రోచి యరుగు నతివ

తెలియవెట్టిన దనఁ దెలియదు పొమ్మంచు నామంబు దిద్దుచు నడచు నాఁతి
మాట లాటగఁ జూడ మీటుఁజుట్టముఁ బిల్వు మనుతల్లిఁ దిట్టుచుఁ జనెదుచామ
గీ. పడక యిలు సొచ్చి వీడెంపు మడుపు లిచ్చి
మోవి చవిచూపి యెదఁ జన్నుమొనలు మోపి
విటు నిటుండు మిదే వత్తున టని గుడికి
నడుగిడు పడంతి యయ్యో నయ్యవసరమున. 24

గీ. అధరపయోధరలలోన మాధురీధు, రీణ రీణాద్య విద్యాధరీ కృతాజ
టీసమ సమాఖ్య [1]................, గణిక పల్లవ బుధ సుధా గణిక వెలయు.

ఉ. అగ్గణికా శిఖామణి విటాగ్రణి కౌఁగిలి వీడనాడి వే
డిగ్గన లేచి మేఖల కటీరతటి న్నటియింప మూఁపుపై
ౘ్రమ్మొగ్గిన మబ్బుఁగ్రొవ్వెద విరు ల్గురియంగ మెఱుంగుఁ గమ్మలుఁ
నిగ్గులు గ్రుమ్మరింప జిగి నిబ్బరపుం జనుగుబ్బ లుబ్బఁగఁ. 26

సీ. విటమౌళి యట ముద్దువెచ్చఁ బెట్టిన తమ్మ కరియంటె నాఁ గంటఁ గావి నిగుడ
నా కెంపె ప్రతిబింబ హేవంబు నింపెనా నింపు వాతెఱ కెంపు కెంపుమురియఁ
గమన దోరుప ధానగతిఁ గమ్మయొత్తెనా నున్న చెక్కిలి కాటు[2]లుక్కు నిక్కఁ
గమ్మంచు టరదంబు గనిపించెనా గుబ్బమెఱుఁగోర పచ్చి గోరొరపు నెఱపఁ
గీ. గొంత కొంత బొజుంగు గిల్గింత వింత
కౌఁగిలింతల వసివాళ్లు గౌఁగిలించు
మించునెమ్మేని బడలిక మిండగీని
నిండు గయిదండఁ గొనివచ్చె నీలవేణి. 27

సీ. నిడు సోఁగజడ శ్రీగనెదు నాగరకులపైఁ గమ్మవిల్బోయ చేకత్తినూఱ
మనుఁజూపుగమ భూపులను బాపురే యని పంచాస్త్రుఁ దమ్ములపాలు సేయఁ
బెనుజెండులను జెండు చనుమెండుగనుప్రజ వెడవింటి కలగుండు వడఁగఁజేయఁ
జతురాభినుతిశోభి నతనాభిఁ గనెదురాజుల మనోజుఁడు వడిసుళ్ల ముంప
గీ. వచ్చి యచ్చిన్న వలరాచ లచ్చి యుల్ల
లచ్చికుర బంధ సంబంధ లలిత గంధ
దళిత పుష్పంధయశ్రేణి తలిరుబోణి
శ్రీరఘూద్వహుగుడి ప్రవేశించె నపుడు. 28

[1] ముద్రితప్రతిలో ఖాళీ విడువబడింది.
[2] సవరించిన పాఠము. 'కాటు-క్కునిక్కె'-అని ముద్రిత పాఠము.

సీ. తన మందహాసంబు జన మనోజ్ఞ కటాక్ష వీక్షణ చంద్రిక లిమ్ము వెడలఁ
దన దీర్ఘతరవేణి తరుణపౌరాపాంగ చిత్తభూ శింజిని జీత మడుగఁ
దన రోమరాజి నధ్వన్యధన్యాలోకపాకభిన్నీలము ల్భద్ర మనఁగఁ
దన తనూలతను బాంథశ్రేణి దృక్కోణ దర్శన జపలాళి దండ మనఁగ
గీ. మబ్బు నెఱిగింపు చనుగుబ్బ రాయిడులకుఁ
గౌను జడియ వచోరీతిఁ దేనెజడియ
గడియ వడియంగ గుడియంబు పడఁతి మెట్టె
మడఁతి గమిగొట్టు మెట్టాడు మండపంబు. 29

క. ఇచ్చట మణిమంజరి లే, దిచ్చెలువలు గుడికి రాఁగ నేఫల మనులో
నచ్చపలేక్షణ వచ్చిన, వచ్చెన్ బ్రాణంబు పల్లవప్రజ కెల్లన్. 30

ఉ. అచ్చపు మావి తోఁపునకు నామని వచ్చిన యట్టిమాడ్కి, భా
స్వచ్ఛపలాక్షికి న్వయసు వచ్చిన లీల, మదంబు దంతికి
న్వచ్చిన వైఖరిన్, భువనవాంచిత ఫించిక నెమ్మిబోదకు
న్వచ్చిన కైవడి, న్గుడికి వన్నియ వచ్చె లతాంగి వచ్చినన్. 31

శా. ఆ వైశ్యాగ్రణి మండపం బపుడు డాయం గాంచె విద్యుల్లతా
శ్రీవిశ్రాణన విశ్రుత శ్రవణ మిశ్రీభావ జాఖంజనీ
జీవంజీవ సఖీభవన్నయన రాజీవ న్మనో భూభుజా
జీవాతు న్మణిమంజరి న్విటమణీ జీవైక సంజీవనిన్. 32

సీ. అక్కలానిధి మొగం బాసక్తిఁ గనుఁగొన్న గనుగల్వలకుఁ దెల్వి గడలుకొల్పెఁ
జెక్కుటద్దంబుఁ గాంచినఁ జొక్కురక్కొల్పు కనుదమ్మి యరమోడ్పు గా నొనర్చె
నోర బయ్యెద చెఱఁ గొక యింత గనుఁగొన్న మెఱుఁగు చన్దక్కవ మెఱుఁగుచేసె
దయఁజూపు వెన్నెల ల్పయిఁ జల్లఁగాఁ జల్లఁ దెచ్చుకోల్తమి గొల్పె దృక్చకోరి
గీ. నిడుద పెన్నెఱి జడఁ జూడఁ గుడికి నెడమ
కటునిటును దువ్వి కటికి చీఁకటులు రాల్చె
నసదృశా దృశ్య మధ్యమ శ్యామ రామ
యల్ల వేశ్యాలలామ వైశ్యాగ్రసీమ. 33

సీ. పెన్నెఱి గుంపుపై భృంగినాట్యము సల్పి చటులదృక్కుల మత్స్య పుటమువైచి
వెలఁది నవ్వుల మీఁద వెన్నెలారో యని కలువరాయని నెమ్మొగమునఁ బిల్చి
పాలిండ్లపై మించు బంతులాట ఘటించి యూరుపై యమునావిహార మూని
ప్రోన్నతశ్రోణిపై భూమిక వాటించి తరుణాంఘ్రియుగళి నెత్తమ్ము లాఁడి

గీ. విడిచి పోఁజాల వయ్యె నవ్వెలఁదివెలఁది
సందిదండల సంది లేఁజందమామ
కందువకు నందమని పొందెఁ గాని యర్య
లోకనముచి విభేదనాలోకనములు. 34

ఉ. [1]దాని ధగద్ధగద్ధగిత దర్పణ దర్ప కపోలపాళికిం
దాని సుధావిధా మధుర తామహితాధర సీధు వీథికిం
దాని చకచ్చకచ్చపలతా చణలోచన చారురోచికి
న్మానస మిచ్చి మార నిజ మార్గణ వర్గ నికృత్త చిత్తుఁడై. 35

ఉ. అక్కట యిక్కటాక్ష మళి యక్కట చక్కనిమోము సోములో
చుక్కట చొక్కటం బయిన చుక్కట గోఱు మెఱుంగటద్దమీ
చెక్కట యక్కటారి జిగి చిక్కట కీల్జడ మేను జాళువా
యిక్కట యొక్కటం గొదవె యిక్కటకంబు వధూటి సాటికిన్. 36

గీ. ఖంజరీటంబులకు బొమ్మగట్టునయన, కంజరీతి తటిన్మంజిమం జరించు
మంజరీ సుకుమార కీ మగువసాటి, కుంజరీయాన కీమణి మంజరికిని. 37

ఉ. లంజలు లేరె యాతల నిలాతలద్దైవనివాస భూవస
త్కంజ ముఖీ శిఖామణులఁ గన్గొనమో రతిరాద్ధనుర్లతా
శింజిని పుంజి నిట్టు నటుసేయు నిరు ల్నెఱులీనగంటిమా
మంజులవాణియైన మణిమంజరిఁ బోల్గణికా వతంసమున్. 38

గీ. అమ్మనము లాడుఁ జనుదోయి నిమ్మపండ్లు, బంతులాడుఁ జూమీ యన వింత గాదు
బొమ్మరము లాడుఁ బో యన్నఁ బొసఁగకున్నె, మున్నె దీనిఁ గలావతి యన్న నేమి.

గీ. ఒడలి జిగిబిగి కదలి నెన్నడుమఁ గట్టు, రామసేతువె యీరామ రోమరాజి
కట్టఁ దీఱిన దరివైచు గట్లు గుబ్బ, లవలఁ దిరిగెడు సుడి నాభి యనఁగరాదె. 40

గీ. అతివ కటి భారమై కల్పలతయు నొసఁగఁ, గని పసిఁడిగట్లఁ దులదూఁగి కామినీస్త
నంబు కరికుంభజాతార్పణంబుఁ జేసెఁ, గలిగె హేమాద్రిఁ జూచినందులకు ఫలము.

గీ. ఉదిరిభిక్షుల తులఁ దూఁగి యువిదగల్ల, తలము ద్విజరాజునకు వసూత్కర మొసంగి
మొగమునకుఁ గానివానిఁగాఁ దగుల మింట, వ్రేలుచున్నాఁడు న్యగ్రోధ విటప మంది.

---

[1] ఇది సవరించిన పాఠము. 'దాని ధగద్ధగిత దర్పణ'-పూర్వముద్రణ పాఠము.

గీ. నంద దరవింద నయన వాంతంబు లైన
హసనములతోడ వర్ణసామ్యంబు నొందఁ
దుదిఁ బిసాళించిన లతాంతమది తలంపఁ
దాంతమగుఁ గాని యెంతైన నాంత మగునె. 43

క. కౌముది హాసము మోవి య, హా మణిసారంబు కువలయానందము కం
దామరలు గాదె యువతిల, లామప్రసన్నాననము కలానిధి గాదే. 44

ఉ. చిందులు ద్రొక్కు నే మనసు చెల్వకుచంబులు తాళము ల్సుమీ
యందఱు మ్రొక్కఁబోదురె యొయారినొస ల్శశిరేఖయే సుమీ
యందము లంచుఁ జూతురె లతాంగి కపోలము లద్దము ల్సుమీ
యందటి దెందము ల్మనుఁగు నా చెలినాభి కొలం కవుం జుమీ. 45

ఉ. పుత్తడిగట్టు గైకొనిన భూరిచయంబున కెందఁ ద్రోచి యా
యెత్తె సరోజ జాలముల నీడిచెఁ బంకములోనికిఁ మదో
న్మత్తములైన నాగముల మస్తముపై బిరుసింత చూపె నీ
బిత్తరిచన్నులందుఁ గనిపించెఁ గదా కఠినంబు లౌటకుఁ. 46

ఉ. ముక్కుఱపూస యొప్పె సతిమోమునకు న్మతి బొండుమల్లె తూ
పక్కమలారి నాటుక్రియ నన్నెలప్రక్కలఁ బైన జల్వకు
న్రక్కొను చంద్రఖండములునాఁ గలువ ల్చిగురు ల్సుమాలినాఁ
జెక్కులుఁ గన్నులుం బెదవి సిబ్బితినవ్వులుఁ గ్రొవ్వులూతెడిఁ. 47

సీ. సాంద్రకేశములకుఁ జామరంబులు చెల్లు నెలనవ్వులకుఁ బూవు లింత చెల్లుఁ
గమ్మవాతెఱకుఁ జెంగావిపావడ చెల్లుఁ గంఠపీఠికకు శంఖములు చెల్లు
గాత్రదీధితికి బంగారు టెక్కెము చెల్లు నవలగ్న సీమకు రవిణ చెల్లు
జంఘాయుగమునకు సన్నగాళెలు చెల్లు గోళ్లకు ముత్యాలకుచ్చు చెల్లుఁ
గీ. గలిగి కచరుచిలోఁ గొంత గలుగు కాంత
కురులకును బీలి జల్లుల బిరుదు చెల్లు
నన్నియంగంబులఁ బ్రవీణ యసమబాణ
సమర సమయాప్తి యాఁకోఁటి జగతి మేటి. 48

సీ. రాహువు గదిసిన ట్లోహోహో యిటఁ బశ్చిమాంగస్థలము వేణి యావరింపఁ
బరుల యుల్లములకు భల్లమై కొనసాగి కనుదోయి తలచుట్టు గైకొనంగ
జగజెట్లబలె జాతి చనుగుబ్బ గుబ్బలఁ జెఱగొంత భుజమధ్యసీమఁ గట్ట
ఘనతరోన్నతికిఁ జక్రము వంపుసేయంగ నుల్లసత్కటి యూరులెల్ల నొత్త

గీ. బాల్య మూఢాధినాథునిc బాఱcబట్టి
జవ్వనపురాజు సెలవిడ్డ శంబరారి
బలము లాత్మాంగము లనంగc బంతుమీఱెc
బొగడ విరిబంతి యాయింతిc బొగడcదరమె. 49

సీ. కనుcగొనలబ్బెలుకుచూచిన నాcటిదృష్టికై పడసి వైచిన పూవు పంకజంబు
కడుమోముc జూచిన కనకై సురాళించి కడవైచు నెఱగూడు పొదపుcజందు
లలితాంగమిచ్చు కల్యాణంబునకు నివాళించిన యారతి మించుcదీవ
గబ్బిగుబ్బలcగన్న క్రాcగలకై బలిగొని విడచినకోడి కోకపాక
గీ. మే బిసరుహాక్షి సాటి యేయిందువదన
యీడు నేc దేతటిద్ధాత్రి జోడు మఱియు
నే రథాంగీపయోధరయే గణింప
మగువ సిగమిన్న యీమణిమంజరికిని. 50

సీ. కరువుగట్టిన గట్టి కటికిచీcకటి చెక్కితీర్చిన నీలాహి దీనివేణి
కోటికొక్కటి మించుc గొని కాంచి చేసిన తీయవిల్తునితూపు దీనిరూపు
మిహిరాంశు గరసాన మెఱcగుసానలc బట్టి దిద్దినయద్దంబు దీని మోము
తేరాచపేరెండ తేకులు సాగించి తీర్చినవిరిప్రోవు దీనినవ్వు
గీ. గట్టి గవ నున్న బటువు రాcగట్టినట్టి
బొమ్మరమ్ములు దీని కుచమ్ము లహహ!
చుక్కగమి చక్కcగాc జేర్చి చిక్కటించు
నవ్యపౌరాళి భళి దీని నఖరపాళి. 51

సీ. పలుమొగ్గ లాణిపాణుల చవులన నేల యలcతి వజ్రపుమోసు లనcగగాదె
నెఱికురు ల్నెఱనాచు నిడుప్రోవు లన నేల యరిది నీలంపుcబై రనcగరాదె
జిగివాతెఱ సిరాజి పగడమౌ నన నేల నును మానికపుcబంట యనcగరాదె
కొఱనవ్వు కపురంపుc గ్రోవి యౌ నన నేల గొనబువెన్నెలరాశి యనcగరాదె
గీ. తనువు సంపంగి దండ యౌననcగ నేల
యందపుం గుందనపుc గొటా రనcగరాదె
యిబ్బిసరుహాక్షి నాపాలి కబ్బనేని
యబ్బలవిభేది నగుట యే మబ్బురంబె. 52

సీ. భ్రమమొందుటయ కాక భ్రమరము ల్సమములా పద్మాశ్రయోన్నతిc బాcదుకొనిన
మిట్టిపడుటె కాని మీనము ల్సమములా కువలయంబు మఱుంగుc గోరియున్న

మొనచూపుటయె కాక యెనయౌనె విశిఖము బ్రాజసారంగోదరమునఁ బడిన
బయలు ద్రిప్పుటె కాక ప్రతియె చకోరముల్ జ్యోత్స్నికా వశశక్తి జోకగనినఁ
గీ. బ్రాప్తకల్యాణతయుఁ బంకభావ మలఘు
జాల హృద్భేద మనిశ ప్రసన్నవృత్తి
మెఱుఁగు దఱుఁగమి పరుఁ దగుల్పఱచుటను ది
నాభ్యుదయ మొందుఁ గాంత దృగంతములకు. 53

సీ. అలివేణిచరణద్వయము లాదులకులైన సితవిలోచననడ సిఖికి నైన
బింబోష్ఠికటి ధరాభృచ్చయంబునకైన దరకంఠిమధ్యంబు హరికి నైన
నున్నత కుచనాభి పున్నాగములకైన వినుతోరు మోము సోమునకు నైన
కాహళీజంఘవాక్యము శుకులకునైన బిసరుహపద నెరుల్ భృంగి కైన
గీ. నరిది నుతి కంధ్రిక ప్రభృత్యరుణ మాంద్య
పృథుతరోన్నతి కార్శ్యగాంభీర్య కాంతి
మృదులతా మేచక ద్యుతు ల్మెచ్చఁదరమె
యితర కోటికి నీజోటి యేటి సాటి. 54

క. గట్టితగ బుట్టచెండ్లం, గొట్టుట యబ్బురమె కలశ కులశైలములం
బిట్టోటు పఱచి నీళ్లం, గట్టెలు మోయించు దీని కఠినకుచంబుల్. 55

క. కాఁగెడు గుబ్బ చనుంగవ, కాఁగెడు విరితేనె గురియఁ గల వాతెఱయుఁ
గాఁగెడు కుందనపుం దళు, కాఁగెడు మెయిసోయగము లొయారి కయారే. 56

క. నగరాట్కుచ పలుసిరి జిగి, నగరా మగఱాల జనులు నగరా మొగముం
దొగరా వగరా వాతెఱ, తొగరా పొగరాను చిగురుతో సరితొగరా. 57

క. రాజీవానన మరునా, రాజీవాగణికులకును రాజీవారూ
పాజీవా బహువిధరతి, పాజీవాదాస్య జీవదజపా జీవా. 58[1]

క. అని వణిగగ్రణి సుతమణి, కనలు తఱిం దేవళమునఁ గాహళఢక్కా
నినద హుడుక్కా శంఖ, ధ్వని పటహ రవాద్యమురజ వాద్యములొదవెఁ. 59

మ. అలచట్టుం దలచుట్టుఁ గన్కలికిఁ జేయంజాలు రావేల్పుఁ గో
వెలచుట్టు న్నుమనోవతంససరణి న్వేంచేయఁగా ఁజేసి మం
జుల కంజాత వితాన మండప నివాసుం జేసి వైఖానసు
ల్తలిఘ ల్నీటిన దారగించి మహిజాతానేత శాతాత్ముఁడై. 60

సీ. అవసరా పూపికాయాత యోగ్య క్షోణిగత వైష్ణవశ్రేణి కల్పకంబు
వైష్ణవ సాష్టాంగ వందన క్షిత్యయుక్ఛందనహృదయ రాణ్ణందనంబు

---

1 లక్షణసారసంగ్రహములో (1-46) ఉదాహరింపబడిన పద్యం. ఈ పద్యం తరువాత ఉండతగును.
క. ఒకమాట....(వాచవి 18పుట)

సమదరాణ్ణందన శ్మశ్రూ పరికరాబ్జ దాన దక్ష కటాక్ష ధన గణికము
గణికేష్ట వాగ్బద్ధ కంచుకి క్షతసాటిసాసిపాణ్యాగ్రహీద్ధాధికారి
గీ. తదను చరహుంక్రియా నిరుత్తర తర ప్ర
జాస్తిమిత మైన దశశత స్తంభమండ
పంబునడుచక్కిఁ జలువచప్పరములోన
జానకీజాని కొలువున్న సమయమునను. 61

క. కేళిక కెవ్వతె నవరసో, యాలేమం బిలువు మనిన యధికార్యర్థో
క్త్యాలబ్ధిలోనె సరసో, న్మీల ఝణంఝణిత కింకిణీ నిక్వణయై. 62

సీ. తన కళాచిక మెచ్చి దహళాధినాథుచేతన కళాచికఁ గొన్న తలిరుబోఁడి
యంగహారముఁ జూపి యంగాధిపు మనోహరాంగ హారముఁ గొన్న యబ్జవదన
యురుటింత గనిపించి హూణాధ్యుకెంగేలి యురుటుఁ గైకొన్న నీలోత్పలాక్షి
కట్టడ ప్రకటించి ఘోట్టాణుచే నేలికట్టడల్ గైకొన్న కమలగంధి
గీ. దవిణ ముందఱ మొరయ నద్రవిణగాత్రి
వచ్చి ముఖవీణ మురజమావజముపాంగ
మును విపంచియు ఘుమ్మన[1]..........
మలరఁ దెరమాటుమైఁ గొంత నిలిచి యంత. 63

క. సరళ ఝణంఝణ నూపుర, చరణ గతి స్ఫురణమునకు జనములమనముల్
దరువుగ నిడ రఘువరుపై, దరువొక్కటి గొనియె నెందుఁ దరువు దలిర్పన్. 64

క. కదలి తెరవచ్చు నచ్చర, కడిమిం జలదంబు పొందుఁ గాదని కడఁకన్
విడివడు మెఱుఁ గన గవిసెన, యెడసిన యాదర్శ మన మహిళ తెర వెడలెన్. 65

క. కంతుం డొఱ యూడ్చిన మణీ, కుంతం బనఁ గుబుస మూడ్చు కుండలికులరా
ట్కాంత యన నింతి భూషణ, కాంతిఁ దళుక్కనియె యవనికానిర్గత యై. 66

క. బెళకె నటి మఱియు భళి పు, త్తడి తెఱ మూర్తీభవించెఁ దథ్యం బనఁగాఁ
గెలకులఁ బట్టిన పంజుల, వెలుఁగులు పుంజీభవించి వెలసె ననంగన్. 67

క. పుష్పామోద సమాంఘ్రిక, పుష్పాంజలి యిచ్చెఁ బుష్పపుటమునఁ దద్భ
ఙ్మిష్పాండిత్యము లనుచుం, బుష్పాస్త్రుఁడు వాఱఁజల్లు పొదితూపులనన్. 68

ఉ. కై యడవుల్గడల్గొలిపి కై మొరయుం దివుటంబు శబ్ద మౌ
రా యన దేసి కట్టడిఁ దిరంబుగఁ బట్టి ధరాధిరాద్ధను

---

[1] రెండు గణాలు లోపించాయి.

ర్గేయునిపైఁ బ్రబంధములు గీతము చేరువ చూపి చూడ్కి క
య్యాయత లోచనా తిలక మప్పడు ముప్పిరి యొప్పగుప్పగన్. 69

సీ. లాలించు మైరాగ లహరి భోగినిభంగి నొఱయు శబ్దము నెలయురుము గరిమఁ
గోపెత్తుఁ దొలుకారుఁక్రొమ్మించు మించునఁ జిరులాగుఁ గొనుఁ బుట్టచెండుపగిదిఁ
రుపింత గనిపించు మరుబొమ్మరము లీల దళసంచు వెంచు రథంబునడక
మైసిరి గను మంద మరుదాప్త దీపమ ట్లంటుగానము కంచుగంట కరణి
గీ. చుఱుకు రవగాలు లయ తాళ శుద్ధి బుద్ధి
యుదుట రేఖాప్రమాణంబు లుదుటుమురువు
నయభరంబులు భూజగన్నటుల కిటుల
మొనప దనిపించె వెలయాలి ముద్దుపట్టి. 70

లయగ్రాహి

కెంజిగురు టాకు పదవిం జిదుమ వామపద కంజ మద నీలమణులం జుఱుకుఁ గెంపుల్
పింజిగొను నూపురము మంజుల ఝుళంఝుళలకుం జొరఁ గరాబ్జ మపరంజి చిఱుగంట
ట్రంజిలెదు మేఖలపయిం జఱచి మంజుతర శింజిత ఝణంఝణల పుంజి గనుపింపన్
లంజెలశిరోమణి యనం జెలఁగు లోక శుక పంజరిత హాస మణిమంజరి నటించెన్. 71

చ. అలఁతి యలంతిఁ దీర్చికొన నంత వసంతపికానులాపికా
వలికి మఱుంగుఁ గోరి మరివల్లులకోరిగతిం ధురీలున
న్వెలువడెఁ దాళమంటి తననిల్కడకోపు నయంబు రేఖయు
న్చెళ కొదుగింపు సొంపొసఁగ బిత్తరి పాదరసంబు కైవడిన్. 72

చ. తిగుడు త తత్తతత్తకిట ధిక్కిటధిక్కిట ధిక్కతోతఝం
జగజగ ఝుక్కుఝుక్కు కిణ ఝుంకిణ యంచు లతాంగి రంగముం
దగఁ జొరఁబాఱి కైమొరఁ బదంబుఁ గదల్చె ఁబతత్పదోద్ధతి
న్నిగళముఁ ద్రెంచుకొన్న రతినేతృ మహోగ్ర మదావళం బనన్. 73

సీ. అర్థాభినయవేళ నంగరేఖారూఢి గల్లకెల్ల విజాతి గాని కోపు
కడకట్లరెడుతత్త కారగౌరవము కైమొర యుగ్గడించుచో ముద్దుఁబలుకు
లయ గయికొను చోటి లాస్యహావప్రౌఢి యాదిగూడినచోటియందగింపు
జతియెత్తి గోలుచో జతగన్న పొదలిక తీరుమానము చోటి తేటసొలపు
గీ. కాంక్షఁ గనువారి నీరుగాఁ గరఁచి వైచె
నున్న యన్నాట్య పాటవం బుండ నిమ్ము

పాటలామోద యొకపాటఁ బాటపాడ
మాట కమ్మరో! మ్రోటుమాఱ తేటలొత్తె. 74

సీ. చరణానుచిత వాద్య మురజి నెట్టింగఁ జూచు వాల్జూపు మరుతూపు వాఁడి దిద్దఁ
దెత్తెయ్యటంచు ధాత్రికి ఁజూపు పదఘాత మెంతనైష్ఠికుఁడైన వెదకుఁ గోర
పదవాక్య దృక్పూర్వ బాహాభినయలీలఁ దముఁ బిల్చుటయె గాఁగ కమను లెంచఁ
గదలెనో కదలదో సుదతిపుటాలమేనవురంచుఁ బ్రజచూడ్కి కవుఁగిలింపఁ
గీ. జేటికాశయ శాటికా ఛేద గళిత
లలిత తాళావసానోల్లలత్కపోల
ఘర్మ జలకణ కైంకర్యకలన కొప్ప
నతనుఁ దత్తన్వి వృత్తాన్వితతఁ జెలంగె. 75

క. ఉయ్యేలకోపుం జాలదె, యుయ్యేలగా నొరుల శిరము లూఁపించుటకు
న్వెయ్యాఱుగు రిగురుం బోం, డ్లొయ్యారులు సరియె దాని యొక మై సిరికిఁ. 76

చ. నిలచిననిల్కి డెల్ల గణనీయము, చూపినచూపు లన్నియుం
దొలకరి మించు లించుక నునుందళు కిచ్చగఁ జూచుచూడ్కియుం
గలువలకోరి కోల కడకట్లను మెట్లనె యెత్తు శబ్దమ
వ్వల జగజెట్టి పాత్ర తలవంపని మెచ్చిరి జాణ లచ్చెలిఁ. 77

క. దరువింత దీఱ నొరులొం, దరు వింతగ నింతనర్తనం బని నంబుల్
తిరుపరి పట్టము చుట్టిరి, తిరుపరిపాత్రలు నుతించు తెఱవకు నంతఁ. 78

గీ. దాని కేలికచేఁ బ్రమోదంబు నొంది, దాని కేలికి గుడిజియ్య దయదలంచి
దాని కేలికమై భోగతరము లిచ్చి, పడి తరములోన హెచ్చు కట్టడలు చేసె. 79

ఉ. బేడిసె గ్రీడ సల్పుటకు బేడ సహింపు మటన్నఁ గన్గవం
జూడఁ బొసంగు భృంగినిభ చూళిక కేళికఁ జూడఁ గూడున
వ్వేడుక కాంద్రపిండు నిజ వీక్షణ తూలిక వన్నె పెట్టె న
వ్రీడవతీకపోలముకురీ మకరీ మృగనాభి రేఖకుఁ. 80

ఉ. బిత్తరి పైఁడియిచ్చు[1]విటుఁ బిల్చునటందురు కొంద, ఱేరికో
గుత్తని కొంద ఱాడుదురు, కోవెల జియ్యల కియ్యెయారికిఁ
హత్తుగడంచుఁ గొంద ఱపు డందురు, పేటతలారి మేలువాఁ
డిత్తలి రాకుఁబోఁడి కని యెంతురు కొంద ఱనిర్ణయోక్తులఁ. 81

[1] సూర్యపాఠము. నిటు-పూర్వముద్రిత పాఠము.

ఉ. అంతట సేవదీఱి పణవాదులు మ్రోయఁగ రేచి జానకీ
కాంతుఁడు వారకాంత లిడు కప్రపుటారతు లంది దీవి శు
ద్ధాంతముఁ జేరినం జెలియ లన్నియుఁ జేటియు మాత జీతగాం
డ్రింతట నంతట న్బయిడి యిచ్చిన వేడుకకాండ్రు వెన్కొనన్. 82

సీ. కుచకుంభముల నెట్టుకొను పట్టుచనుకట్టు కాసెగా సగదట్టి గట్టుపట్ట
సరిపెణలో రాయు బిరుదుఁ బెండేరంబు గమకపు మొలమాలిగంట చాలు
చెక్కులచెమటఁ జేర్చినమృగీమదరేఖ కుంకుమపంకంబు గొనబుపూఁత
మెరయు నెన్నుదుటి చందురువంకనామంబు ముందఱమురువుగా మొఱయు దవిణ
గీ. వెలయఁ గంకణ కరమింత వీచికొనుచు
స్మరసమున్నిద్ర భద్ర కుంజర మనంగ
మంద గమనంబునం దనమందిరమున
కుం దిరంబుగఁ జనుదెంచెఁ గుందరదన. 83

శా. ఆలావణ్యవతీవతంసము నికాయంబుం బ్రవేశించు న
వ్వేళన్ వ్యాళకరాళ చిత్తజ భుజా వేల్ల ద్ధనుర్వల్లికా
జ్వాలజ్జ్వాతికా కటాక్షశరశిక్షా మంద మందాక్షుఁడై
నాళీ కాక్షి విలాసకృత్యములు నానానృత్యము ల్మెచ్చుచున్. 84

మ. కనుఁగొన్నయ్యలు దండ దండ మనినం గైకోక యీ పేటికీ
దినమీదేశపు వింత వింత సరకేతెంచెం గదా యన్నవీ
నునకుం జేర్పక దర్పక ప్రహర సందోహాహతస్వాంతుఁడై
తనగేహాంతము చేరి వైశ్యసుతుఁ డంతశ్చింత గంతుల్గొనన్. 85

శా. ఒయ్యారు ల్సరిసాటియే నటన నోహో జాళువాచిల్వరా
మయ్యారుల్గల తీఁగెబోండ్లఁ గనమా మద్వీక్షకు న్లక్ష్యమా
వెయ్యాఱు ల్తదధీన చేటిమణికి న్వెచ్చించి పంచేషు కా
క్షయ్యారు ల్మఱి మాన్పుకొందు నకటా సంతాప మింతేటికిన్. 86

శా. వైశ్యు ల్నవ్విన నవ్వనీ కటక విద్వత్కోటి చేటీభటా
వశ్యాత్ముం డని పల్కినం బలుకనీ వాణిజ్యపూజ్యుల్ ధనే
ద్దేశ్యు ల్కంచపు పొత్తు హత్తదని ముందే త్రోఁచినం ద్రోవనీ
వేశ్యా కమ్ర కపోల చుంబన కళా వృత్తిం బ్రవర్తించెదన్. 87

మ. అని యారేయి వరీయుఁ డర్యమణి శయ్యం గూర్కెనో లేదా వే
విన వేశ్యాగురువిప్రునిం బిలిచి వేవే లిచ్చి యిక్కార్యము

త్తిన నందేకద కొంతవాసి భవదంతేవాసినిం గూర్పఁడా
యన నాఁ డాయన వేగ నట్టరిగి రూపాజీవకుం దెల్పఁగన్. 88

చ. విడిచిన చీరయు న్మడుచు వేనలిపువ్వులు తల్లిదాల్చు పు
త్తడి కడియంబులుం దనదు తమ్మునికొమ్మ మెఱుంగుఁ గమ్మలుం
దొడిబడ నిచ్చి దానికిని దోడనె బుద్ధులు చెప్పి చెప్పి తా
విడెమొక టిచ్చి యగ్గణిక వే పనుపం జనియెన్ రయంబునన్. 89

చ. చని ఘట చేటికా చయము చక్కని ముచ్చటలాడు వెచ్చగాం
డ్రను గని పేనుజూచు జగడంబులు దీరుప నిల్చుఁ గాని పో
యినపని గొబ్బునం గనమి నెక్కడి యేలికసాని కష్టతా
దన మొనరించునో యనదు టంకు స్వభావము మాన్ప శక్యమే. 90

శా. నక్తంజాగరణారుణాక్షితనునానారజ్జుఘాతాదిసం
త్యక్తవ్రీడపునఃపునర్ఘటన యుగ్ధమిల్లస్వస్వామినీ
భుక్తోన్ముక్తసుమాంబరా భరణ తాంబూ లార్ద్రజిహ్వాంచలా
సక్తాలోకన యేకకాచకర వేశ్యాదాసి యేతెంచుచున్. 91

సీ. ఎదురైనసతి నిల్పి యీబండిగురివింద యొంటిపే రెంతకుఁ గొంటి వనుచుఁ
గొనపంటఁ బొటుకునఁ గొఱికి యెవ్వతెనేని నెండెవడ్లీపాటి యెత్తు మనుచు
నొకతె ముంగిటఁ గాంచి యుముకపుట్టదె తట్టుమీ గోమయం బెండసాగె ననుచు
నీళ్లమోయు నెలంత నిలుమని దినమెన్ని పంటులు వట్టు మీయింటి కనుచు
గీ. వచ్చె వెలబోటిచేటి యవ్వైశ్యవాటి
తెలుపుగల శాటి ముక్కఱ తీఁగపోచ
యెంతవెట్టియు దొరతనం బెఱుఁగ దయ్యె
నెందు జాతిగుణంబు వో మందు గలదె. 92

క. గడివోతుదాసి యప్పుడం, గడి కడకుం డాసి వాసి గడియించుఘనున్
విడధిపనందనరాకా, నిడధిపుఁ గని వచ్చినట్టి నిజకథఁ దెలుపన్. 93

క. మిన్నంటి దానిసుద్దికి, మొన్నంటి కళా విలాసములు పేర్కొనుచున్
సన్నుతగాత్రి మొగంపుఁబ్ర, సన్నత కెదయిచ్చి బేరసారము మఱచెన్. 94

సీ. పసిమి గ్రమ్మెడు నిమ్మపం డ్లమ్మఁ దెచ్చిన నంటక సతిగుబ్బ లంటఁ దలఁచుఁ
జొక్కంపుఁ దెలిజీనిచక్కెరల్ దే వెల కందక చెలిమోవి యందఁగోరుఁ

గనకంపు దనకింత దనకమ్మఁ దెచ్చిన నొరయక తరుణి మే నొరయఁదివురు
గొప్పనీలము క్రయం బొప్ప నీ కిడెదన్న నొడియ కింతికచంబు నొడియఁ గడఁగుఁ
గీ. దేనె యని నూనె నూనెకుఁ దేనె నూనె
తేనెలకు నేయి నేయంచు దివ్వెచమురు
కాని గొనివచ్చు నించువిల్కానికాని
కోల సడిఁగన్న తొడగన్నకొడుకుమిన్న. 95

సీ. కవిలె నిల్చిన యప్పు జవిలి వ్రాయఁగఁ బోయి బుజవైచె వేనూళ్ళ పూటలెక్క
నొక్కని కొకకొన్ని రొక్కరూక లొసంగి కాసులలెక్కలో వ్రాసికొనియె
వక్కలలోఁ దక్కువకు వైచిన బరీదు లొకనికి సరకుతో నొడిని వైచెఁ
బైక మిచ్చిన నొంటిపడి కంగడికి నిడ్డ కలపెస ల్గంపెఁడుఁ గొలిచివిడిచె
గీ. మాట యరవిన్కి నొరునిపై నాటుఁ జూడ్కి
బయలు పయికంబునకుఁ జూచుఁ బాణిలంజె
తగవునకుఁ గొంత పిసవెట్టినగవు గనియె
వేశ్యసుద్దికిఁ జెవి యిచ్చి వైశ్యసుతుఁడు. 96

గీ. సెట్టితో రేలు విటుల నన్నట్టి లంజె, సుద్దు లొకకొన్ని లేనివి బద్దుకొనుచు
ననఁటిపండ్లొల్చి చక్కెర నద్దుకొనుచు, దాసి పసివెట్టి తోళ్ళ[1]సూత్రంబుచిక్క. 97

గీ. గు ట్టిడక సెట్టితోఁ జెవి కొఱికి కొఱికి, సరవిగాఁ దన కేలికసానివారి
మర్మకర్మంబు లెల్లను మట్టుమీఱి, చీర కాసించి నుడిగెఁబో నోరఁ జెడుగ. 98

క. నుడిగి రహస్యోక్తులు దా, నుడిగి దృగంచల నిబద్ధ యువమణిమంజ
ర్యుడురాణ్ముఖి గుణవైఖరి, విడధిప శేఖరునితోఁ బ్రవీణతఁ బలికెన్. 99

ఉ. మూసిన ముత్తియంబు వెలముద్దియలుం బలెఁ గాదు పల్లవు
ల్చేసిన భాగ్యమత్తరుణి చిత్తరుబొమ్మ రతిప్రవీణ వీ
ణాసరసాగ్రగణ్య మృగనాభిమృగంబు ధనంబు రాశిగాఁ
బోసిన దోసమా మఱియు భూభువనంబునఁ బుట్టఁ బోదురా. 100

చ. ఎఱుఁగవు గాక యాకలికి యెంతయొయారి దిగంతరంబులన్
మెఱవడి గన్న కన్నె దొరమెచ్చు మిటారి కటారిగాఁడు మే
రురువతి మేర మానసి యయో కదునుబ్బరికత్తె మిక్కిలిన్
గుఱిముఱి నాగవాసమునకు న్మనకుం గొనియాడ శక్యమే. 101

---

[1] మాత్రంబు చిక్క-సూర్యపాఠము.

క. కనకంబునకు న్మందు, న్వెనుకయుఁ గననేల యోయి నీకంటే నా
ధనము న్నీవు గడించితొ, నిను ధనము గడించెనో వణిగ్వంశమణీ. 102

సీ. కురులు కూఁకటితోనఁ గూడినంతనె కుంతలాధ్యుండు సవరంబు లంపలేదె
చనువోయి పొటమరించిన నాఁడె అవికెజోడల్ల పైఠాణి రా జంపలేదె
జఘనభారము కొంత జనియించునెడఁ గాంచికాధినాథుఁడు కాంచి యంపలేదె
మందయానవిలాస మందినతతి కటకాధీశ్వరుఁడు పెండె మంపలేదె
గీ. యంగన సమర్తవెట్టిన నపుడె నన్నుఁ
గుస్తరించని విటులేరి నేస్తమునకుఁ
బూర్ణచంద్రాస్య యౌవనాభ్యుదయమునకు
నెదురుచూడని దొరబిడ్డఁ డెందుఁ గలఁడె. 103

ఉ. అంగ కళింగరాజులు గృహాంగణ మంగన! కాచినార ల
న్నం గయికోదు వారిదు ధనం బదె యక్కరొ! చక్కఁజూడు మ
న్నం గడకంటఁ జూడదు కనత్కనకాంగి తనంతఁ దానె నీ
యంగడిదాఁకఁ బొమ్మనుచు నంపెఁ గదా యిది నీకుఁ జాలదా. 104

క. దాని శరీరము నీది సు, హాని శతాంశంబు లే దటంచుఁ ద్రవ్యా
ప్తానిశమద యై బానిస, యీనిశికే తెమ్మటంచు నింటికిఁ జనియెన్. 105

ఉ. మున్ను విటు ల్కచాకచి సమున్నతి దెచ్చిన కుంతలాళి బా
ర న్నిరసించు నంచు బలు రాయిడి వ్రాలిన చన్ను లద్రిఁ బోఁ
దన్నిన వంచు నుబ్బలకుఁ దాళిన యేండ్లవి పెక్కు లుండఁగా
మొన్న సమర్తవెట్టె నని ముద్దియ దబ్బిన నుబ్బె నయ్యెడన్. 106

క. అపుడతఁడు పణ్యచపలా, విపులాక్షీమణికి వలచి విపణిపాలంతి పొం
దెపు డను తతి నపరనగం, బుపయింబడి పొరలి ప్రొద్దు పొటుకునఁగ్రుంకెన్. 107

సీ. నీకుఁ గాఁగాఁ జేడె చేకూఱినది గాక కొంచెగానికి సమకూడు టెట్లు
ఏను జుమీ దాని కెచ్చరించినవాఁడ నామాట జవదాఁట దా మృగాక్షి
మఱివారి మేనమామకు నాకు నోయి ప్రాణస్నేహ మెపు డింతనాఁట నుండి
వయసువాఁడా రూపవంతుఁడా యంచును నచ్చెల్వ యడిగె న న్నుగ్గ్రుచ్చి గ్రుచ్చి
గీ. కుచ్చితం బింత యెఱుఁగ దమ్మచ్చెకంటి
కంటి విఖ్యాతి నాతిఁ గైకొంటి వనుచు
నచటి జూఁటలు నసగొంటు లతని వేఁడి
వేఁడి మీఁదనె ద్రోచిరి వెత్తి రేఁచి. 108

క. తల్లలనావలనాసం పుల్లదృగంభోజభల్ల భుగ్నాత్మకుఁ డై
యల్లతఁడు హల్లకాహితు డల్లంతట నుండగానె యంగడి మూసెఁ. 109

సీ. సకునిచేఁ బడిఁగన్న సికమల్లికలు సుట్టి క్రొత్తచందురు కావిగుడ్డఁ గట్టి
మునుపంటివలెఁ గాదు నునుపంట నిడుమన్నఁ బొందికఁ గస్తూరిబొట్టు వెట్టి
నీ మోమునకుఁ గావు నిడుదయొం ట్లవి బాగు గద యన్నఁ గుదువ చౌకట్లు దాల్చి
యాకోకకుచ కట్టు నీకోక వగలన్న వలిప సేలువు వల్లెవాటు వైచి
గీ. చెలినడుగు నీటు మెడనిక్కు చిదుగుపాట
చదురువదరులు జముదాళిసాము వహి ర
హింప వైశ్యాత్మజుఁడు వేశ్యయింటికడకు
వెడలె బాపనచెలికాండ్రు వెంటనంట. 110

క. ఒకనికి దుప్పటి యొకనికి, సికవస్త్రము వేఱొకనికి సికతాయెతు లిం
టికి వచ్చి యిత్తు ననియెఁ, శకునము బాగాయె నన్న సంభ్రమపరుఁడై 111

సీ. బకదారు లొకదారి శుకశారు లెనయు మానికెదారిచెల్లెండ్ర నిలయ మమరు
ముంగిట నిడు తిన్నె మూయని మద్దెల కుల్లదండియఁ గుడికూటిగూడ
కోవెల టెక్కెంపుగుడ్డ వాసెన కాఁగు కుంటెనకొండిగాఁ డింటిబంటు
బొజుగిడ్డ కావలిబుడుత గొడుంగులగబ్బిగుండఁడు రసముబ్బు వెజ్జు
గీ. ముందుబొద్దాసఁ బాఁతిన ముసుఁగు జూటు
చిగురు చల్లని బలుపూఁత చెందిరంపు
వాస్తు బొలికట్టు గేస్తురా లుస్తరించు
నూర బవినీఁడు గల గృహం బొరసి విటుఁడు. 112

సీ. వారకాంతామాత వయసునాఁ డెక్కిన ప్రాంతపల్లకి కొమ్ము పరులు చూడఁ
గట్టిపెట్టిన మిద్దె గడచిపోఁ బనివెట్టు చుట్టుకొలారింత చూచునటుల
విటుల విరాళించినటు లచ్చెరువు చెందఁ బటులాంగలికపాళి ఘటనగన్న
పఱపైన యుబ్బుఁజప్పర ముప్పరం బైన పడకింటి ముందటిబారితిన్నె
గీ. వన్నెల తివాసిపై వీణ వైష్ణవుండు
ద్విపద బాపఁడు చదివించువిప్రుఁ డనుజ
భరతమయగారు విడెమిచ్చుపడఁతి గొలువ
నచ్చెలువ వచ్చి కొలువున్న యచట కరిగి. 113

గీ. సురటు లొకరెండు గోవకస్తురి జవాది, గాజుగిన్నియ చందురుకావిఱవికె
కొప్పుసవరంబు పోఁక లాకులు దుకూల, ములుపగాఁ బట్టి సెట్టి కూర్చున్న తఱిని.

ఉ. కప్పుమెఱుంగు కొప్పవగకాయలు కాయల కొప్పు దండముం
జొప్పడు దండమట్లు రహిచూపిన మేరువు మేరువుం బలెం
దప్పని మెట్లు మెట్ల కొకదారిగ నేర్పడు శిల్పితంత్రులుం
జెప్పఁగరాని వీణెఁ దనచేతికిఁ దమ్ముఁడు తెచ్చి యిచ్చినన్. 115

ఉ. కోమటి చూడఁ గాంత యొక కొంత పదం బొక కొంత పల్లవిం
జేమెరవళ్లు చూపి గురుచెంతకు వీణియఁ జేర్చి దీనిపా
టేమహిపాలకుం దెలియఁగునే యని వైశ్యునికాన్క గన్గొన
న్వేమఱుఁ గాంచి యమ్మఁ బిలువే యని చేటిని బిల్చినంతటన్. 116

గీ. నఱసి నఱసిన చికిచికినెఱులు బొమలు, పాదములు పెద్దపుట్టంబు పడగజోడు
పూత దేవాదుల కడెంబు మూతి నిట్ట, తెల్లవెంద్రుక వీడెంపుఁ జొల్లు నిగుడ. 117

సీ. ఒదిగి యాత్మవయో వియోగంబుచే నంచనడక సడల్చెనా నడ కృశింపఁ
బుష్పంబు లుడివోవఁ బొలుపు వోనాడిన తీవయో యన మేనిచేవఁ ద్రోవ
మున్నె పయోధరంబులు వ్రాల కళ డిందు కమలమో యన మోము గానుపింప
నధిక శరత్ప్రాప్తి నవతరించిన శుభ్రమేఘమో యనఁగ ధమ్మిల మొనయ
గీ. నొంటి పలు సొంటి తలపట్టు కుంటినడక,
కంటికాటుక యొడివక్క [1]కావిత్తి
వ్రేలియాకొత్తుఁ జెంది యవ్వేలవెలంది
తల్లి యేతెంచి విటుకాన్క లెల్లఁ గాంచి. 118

క. ఎవ్వరు దెచ్చిరొ కస్తురి, దువ్వట మీఱవికె [2]నెలవతులు సవరంబీ
జవ్వాది యన్న నవ్వేల, జవ్వని యూరవ్వ నయనసంజ్ఞం జూపెన్. 119

సీ. ఇతఁడా కళానిధి యీకళానిధి పేరు దగు నీతనికె యెంతదాత జాణ
స్నేహింపఁ దగువాఁడు చేపట్టుకుంచంబు ధనరాశివాఁడు పేదలకు దిక్కు
చుట్టాల సురభి రాజుల చేతినిమ్మపండే రాజు వీఁడె బంగారమయ్య
వెయ్యాఱు లిచ్చె నీవిని దొడ్డ కొంచెంబు నేరఁ దేవేళ జన్మించినాఁడొ
గీ. నేఁడు మొదలుగ మఱియొక్క నీటుకానిఁ
బిలుతువు గదా యహో వెఱ్ఱి బిడ్డ నీకు
నీవెఱుంగుదు మనపాలి దేవుఁ డితఁడు
విడకు మని కూఁతు నదలించి విటుగుఱించి. 120

[1] గణభంగము - 'కాను విత్తి' - అని సవరించవచ్చును.
[2] సూర్యపాఠము - వెలవతులు -పూర్వముద్రణ పాఠము.

సీ. విని యుండుదురె కదా వెలయాండ్ర తీఱుగా దీకాపు వగవార మింత మేము
మొన్నమానిసి యౌటc గన్నె కన్నెతీకాన నెంతేసి రాచవా రింటికనుపు
మేమి కావలసిన నిదె కొమ్ము మేము రమ్మనిన వచ్చెద మొప్ప నైతి వేని
వాటైన విని డిందుపాటు చేసెద మిదె యంచు పట్టెడు ముడుపంచు నగలు
గీ. పెట్టెc డంపినc బట్ట ని న్నుట్టినాన
నీవు పోరాని వాcడవు నిన్నపగ లొ
యారి గుడిలోన నినుc జూచె నcట గదా ప
రాకు తఱుచయ్యె నీపై విరాలిc బొరలి. 121

ఉ. సీమ పొలంతు లెల్లc దమచేతికి వచ్చినదాcక నోయి నా
సామి వితీర్ణికర్ణ యనసాగుదు రంతటిలోన నోయి నీ
[1]గామము నామ మెయ్యదియొకొ యనcజూతురు కూcతు రావగ
గామిడికత్తె గాదు మిముc గన్నులc గప్పుకొనంగ నేరుచు. 122

ఉ. ఎవ్వనిc జూచినం గళల నింద్రునిc జంద్రుని నిన్నుc జూచిన
ట్లివ్వనరాశి వేష్టితమహీ గ్రహిc జూడగc జుచ్చరించు నా
జవ్వని పిండు రెండవ బిసప్రసవప్రదరుండవే ధృతిం
గవ్వపుcగొండ విచ్చకము గాదు సుమీ! తమతల్లి తో దన. 123

క. అచ్చేడియ తచ్చనలకు, నిచ్చమహోత్సాహ మంది యిచ్చెలువకు నే
మిచ్చిన ఋణంబు గాదని, బచ్చు రుటం బచ్చుపడcగ భావించి మది. 124

క. భావించి సఖునిc గన్గొని, రావించి దుకూలములు వరాలుం దెమ్మా
యీవనిత కనుచుc జెలి నని, యీవలc దెప్పించి మఱియు నిప్పించుటయు. 125

ఉ. అప్పుడు లంజెసాని సొగసాని కదుం బయితాణి యొప్పుగం
గుప్పస మింత గ్రుచ్చి కుచకుంభయుగం బరనిక్క నీల్గి బ
ల్గొప్పు కకుప్పుc గప్పురుచి గుప్పcగ లేచి తటిన్మరీచిక
ల్గుప్పలుగాcగc జూచి గురుకుంజరు వీడ్కొని వేడ్క రక్కొన. 126

ఉ. మజ్జనశాలకై యరిగి మజ్జన మచ్చట నాడివచ్చి వే
బిజ్జవ మొప్పc దల్లి యిడు పూన్కి భుజించి ధరించి గొజ్జcగ
ల్గొజ్జcగనీట నీటుగను కుంకుమపంక మలంది కంతుచే
గజ్జెలకోల బాల గణికామణి తా రణితాంగదాంఘ్రి యై. 127

---

[1] గ్రామము – సూర్యపాతము.

B

ఉ. పంకజపాణి చక్కనిదు పావలుద్రొక్కి శయావశిష్టపుం
గుంకుమ పావడం దుడిచికొం చుడిగంపుఁ బడంతి దృగ్విలా
సాంకిత చుట్టియిచ్చు తెలనా కధరంబునఁ గొంచు రత్న తా
టంక ధగద్ధగ ప్రభరుటంపు తటిల్లత పిక్కటిల్లఁగన్. 128

సీ. ముదుఁగుఁదామరక్రింద నడఁగు క్రొంబఱపుతో సకినెల పట్టిమంచపు రుటంబు
దగ్గఱ నేస్తకాంద్రకు నిద్దజగపీఁట తళుకు బంగారుకాసెఁ దగులుతగులు
వేఱె యొక్కందుకై విటమోహమున నూఱు బాగాలువైచు కప్రంపుబరణి
తెల్లజిల్లెడువేఱు పిళ్యారి దివెగూఁడు గాజుటద్దము కావు కరవటంబు
గీ. పట్టుపుట్టంబు సొగటాలపాళినేత
ప్రాంత చిటిచాఁప మంచి విపంచి మంచి
సుతులు గూడిన దండియ సొంపు గన్న
పడుకయిలు సొచ్చె నిప్పు డప్పణ్యమహిళ. 129

క. అలరుందావియు గందపు, వలపున్ సాంబ్రాణిధూపవాసన యిలు వా
కిలి సొరముంచిన విటమణి, కలకాలం బిచట బ్రదుకఁగాఁ దగు ననియెన్. 130

మ. రణనాటీక చరాలురత్కలరవీరంగ ద్విటంకంబు టెం
కణ లబ్ధాంగణ వేదికా భవన భక్కట్కిర మామోదనా
చణ శయ్యాతలపీఠశుభ్రపటవాసభ్రాజి పేటీక మ
గ్గణికాకేళినికేతనంబు విటవర్గస్వర్గ మీక్షించుచున్. 131

క. అగురు గురుధూప కుంకుమ, మృగమద పాటీర పంక మిహికా లహరీ
లగన ఘన గంధగణికా, నగణిత పర్యంక మర్యనందనుఁ డొందన్. 132

క. పాటీరగంధి గణికా, జూటీరత్నంబు వైశ్యజునకుం దనకున్
వీటీదాస్యముసేయు వ, ధూటీమణి సమయ మెఱిఁగి తొలఁగినపిదపన్. 133

సీ. పైపూఁత తమి లీలఁ బైవ్రాల జుమ్ము రనియె వైశ్యరాధేయునికిని మేను
కంకణార్భటుల బాగాలు చేనిడుపూన్కి నగరేశ్వరునియొడ ల్గగురుపొడిచెఁ
దెగఁగాఁ గొఱికి నోట సగ మొసంగిన చుట్ట మలయజా వల్లభు మై చెమర్చెఁ
బుక్కిట తమ్మలం బొక్కింత చవిచూప నుత్తమజన్ముమే నుబ్బెఁ గళల
గీ. మోవి చిక్కించుకొని పంటిమొనల నొక్కి
దక్కితి నటన్న కలరవోత్కంఠకంఠ
కవకివ ధ్వనికిని గణికకు మనంబు
క్రయము గావించె నుద్యోగరాఘవుండు. 134

చ. సరసపుఁబల్కులన్ బడకసంగతి కొప్పని గచ్చులన్ బయో
ధరతటు లంటనీని వెడతక్కుల నెయ్యపు టూదికొట్టులన్
సురతపుఁదృప్తి లేని యరచొక్కుల వాతెఱతేనె గ్రుక్కిళు
ల్నెరపుటలన్ గిరాటవిటు నిద్దపుఁజిత్తము మెత్తఁజేయుచున్. 135

చ. అలఘు నఖ వ్రణంబులఁ గరాంగుళికాధ్వని నర్మమర్మపుం
బలుకుల రంగుముంగురులపట్ల భుజాంతరముష్టి ఘట్టనం
బులఁ బదతాడనంబులఁ గపోల చపేట విలాసచేష్టఁ జ
క్కిలి గిలిగింత కాటుల మృగీదృశ లోనుగఁ జేసె వైశ్యజున్. 136

ఉ. చక్కెర మోవి యిచ్చి బిగిచన్గవ కౌఁగిలి యిచ్చెఁ జెక్కుఁ కా
టొక్కటి యిచ్చె గోరు కొన నూరులు చించఁగ నిచ్చెఁ గాని యా
దిక్కునఁ జూచుకేలు సొరిదిం బిరుతివ్వక తట్టివైచె నాఁ
డక్కఱినాత్మురా లతనిప్రాణము చూడక మాటిమాటికిన్. 137

గీ. రవలిదండలు సడలించి అవికె దిగిచి, కాంచి యొడలించి నెఱిక చెంగావి చుట్టి
పోఁకముడి యొంటికట్టుతోఁ బువ్వుబోఁడి, పడక కొప్పినచందంబు పతిఁ గరంచె

చ. పడకకు నీవజాణ వని పైఁబడి హా యని మోము మోము పై
నిడి వలచెక్కుటద్దము కయిన్వడివెట్టి యురంబు తట్టి యి
మ్మడిగద యక్కతోడు మదిమక్కువ నీపయి యక్కరైన య
ప్పుడు వెల కమ్ము కొమ్ము పొరపొచ్చెము గాదు వధూమనోభవా! 139

చ. నిలువునకుం గరంగఁ గళ నేర్పున నంటితి నీవు చాలదా
తెలియను నిన్ను మున్ను నొకతీరుగఁ జూచితి నీదుకౌఁగిట
న్వలవని యాటదిం గలుగునా యని పైకొని నిల్చినిల్చి య
చ్చెలిపయి వ్రాలి మోవి కఱచెం గరఁచెం గరచేష్ట నీరుగన్. 140

క. పికవాణీ గళవిగళ, త్కకపికశుకకులనినాద కవకి వరవయు
గ్వికవిక కిలకిలహసన, ప్రకటవ్యసనముల కతఁడు పరవశుఁ డయ్యెన్. 141

ఉ. చక్కనివాఁడ వీవె కద జాణవు నేర్పరి వంచు నక్కుపై
మక్కువ వ్రాలి తత్కరము మై సవరించి సిగంది వంచి య
చ్చెక్కిలి మిక్కిలిం గఱచి చేతికొలంది నురంబు గ్రుద్ది తా
నక్కడ ముద్దువెట్టుకొని యా సతి దాసునిఁ జేసె నవ్విటున్. 142

క. ఇదియే పరమానందం, బిదియె పరబ్రహ్మ మనుచు నెంచం జంచ
న్మదనాగగామినీకృత, రదనచ్ఛద నచ్చిదా చ్ఛురాగచ్ఛులుఁడై. 143

ఉ. రాలినవాఁడుఁబువ్వులు ధరంబడువక్కలు నాకుఁజీరిక
ల్నేలను జిందు గందవొడి నిండిన తమ్మకరల్ కదంబముల్
వాలిచివైచుకాగితము వత్తి రవుల్కొని మ్రగ్గుదివ్వెయుఁ
హేలఘటిల్లు నప్పుడు కయిల్వెడలెఁ విటమౌళి వేకువఁ. 144

క. నానాఁటికి గణికామణి, పై నాటినకూర్మిపేర్మి భర్మపటంబుల్
దీనారంబులుఁ జేర్చిన, దీనారంభముల నతఁడు తిరుగందొడఁగెఁ. 145

గీ. ప్రత్యహము నూనె సీకాయ పంచదార, క్రొత్తపోఁకలు మిరియ మింగువ గుడంబు
ముత్తెసరులు పెస ల్పెట్టి గుత్తలంజె, కెత్తిపుత్తెంచి యంగడి రిత్తచేసె. 146

ఉ. అల్లుఁ డటంచుఁ దల్లి తమయాతఁ డటంచును గూఁతు రన్నిటం
బల్లిదుఁ దేలికౌననుచుఁ బానిసె వావిని బావయంచు న
చ్చెల్లెలు నచ్చినట్లు పయిఁ జేతులు వైచుచు ముద్దువెట్టి పైఁ
ద్రెళ్ళుచు నల్లిబిల్లివగఁ దీసిరి వాసివరాలు రాశిగఁ. 147

సీ. రత్నంబులిచ్చి వారవధూటి దయఁదెచ్చి పుష్యరాగోదయస్ఫూర్తి వదలెఁ
గలసొమ్ము చేర్చి మేల్గణికామణికిఁ గూర్చి కూర్చినభరణిపైఁ గూర్మి విడిచెఁ
దనమంచి లంజెపై మనసువెంచి పునర్వసూదార సంగ్రహమోద మడఁచె
గాదెకొల్చెత్తి వేశ్యాదరం బత్తి విశాఖలసత్ప్రేమ చాలు ననియె
గీ. రోహిణీభర్త రత్నాకరుని యనుంగుఁ,
బట్టిమున్న కళానిధి పలుకులేల
చిత్తమిదెనేని యేమేమి సేయలేదు,
కంతుహరునైనఁ బెల్లాటకత్తెతగులు. 148

క. అడుగని వానిదె పాపము, పొడఁగని పద్యంబుఁ జదివి పొగడఁగ నిడు తా
నుడుగని యీవులు వలరా, నడగని నుడుగుల మిటారి నను పెట్టి దొకో. 149

ఉ. వైశ్యకుమార మారపరవైశ్యధరాధర వజ్రధార దు
ర్వైశ్యహృదంతశల్య శరవైశ్యభయంకర లోభవద్భువ
ద్వైశ్యభుజంగ యంచుఁ గయివారము సేయుచు దుస్సి రర్థము
ల్వేశ్యలు నట్టువ ల్మణితవేత్తలు మట్టులు జాతికర్తలుఁ. 150

క. ఉద్యోగరాఘవుం డని, పద్యంబులు నూకఁ గేరి పంచలఁ జదువఁ
విద్యాధికులకు వల్లము, చోద్యంబుగ విడిచి లంజె చూడఁగ నిచ్చుఁ. 151

సీ. అప్పువెట్టినచోటి కడుగఁబోవఁడు గాని పణ్యాంగనలతప్పుపైఁడి కరుగు
నొకరి కిచ్చినవెచ్చ మొకటి వ్రాయఁడు గాని మకరి వేశ్యా గల్లముకురి వ్రాయు
సంజ బేరములాడి సంచి గట్టఁడు గాని గణికా లలామకుఁ గాసెగట్టుఁ
దా సువర్ణముఁ దూచఁ ద్రాసు వట్టఁడు గాని వారకాంతను సొమ్ముఁవహికిఁ బట్టు
గీ. నింత చిల్లర తండ్రి కందీఁడు గాని,
యల్ల వెలచేడియకు విడె మంది యిచ్చుఁ
జేటికా సఖికోటికాచ్చిన్న కటుఁడు,
శాటికా హృష్ట నటుఁడు కిరాటవిటుఁడు. 152

సీ. ప్రతిదినంబును జెంపపై రేఖ దిద్దించి ప్రొద్దొకవగ వన్నెబొట్టువెట్టుఁ
దనచేకొనని యాచకునకుఁ బొమ్మనిపల్కు నెలకట్టడలు సేయు నేస్తకాండ్ర
కొరువేడు నర్థార్థి కోయి రమ్మని యిచ్చు నొల్లనిచో బల్మి నిల్లుసేర్చు
సేరు కుంకుమ మాఱి చెలికాండ్రపైఁ జల్లు గోణముతోఁ బోవుఁ గోక లిచ్చి
గీ. కలఁడె నీవంటి బలువెచ్చకాఁ డటన్న,
నధికు లీరెఱిఁగినఁ జాలు ననుచు బిగియు
దర్పణాలోకనీయ కందర్పకేళి,
ఫలిత నఖపాళి పల్లవ పాశమౌళి. 153

ఉ. గాయకుఁ డొక్క గాయక శిఖామణి నాయెడఁ దద్గురు న్విప
ణ్యాయతవృత్తి వర్తిలు ప్రియవ్రతమానునిఁ గాంచి వైశ్యరా
ధేయ సుధీజనావలివిధేయ భవత్సుతుఁ డిచ్చినట్టి కౌ
శేయముఁ గంటె దానగుణశేఖరుఁ డంచుఁ బదంబు వాడినన్. 154

ఉ. ఉల్లము జల్లనం గలఁగి యొక్కెడఁ దక్కెడకోల వైచి వీ
డొల్లఁడొ కాని విద్యలని యుంటిఁ గదా యని కొంత చింతతో
వల్లము పాఱవైచుకొను వైశ్యునిజాడ నిజంబు[1]గానకన్
జిల్లర బేరము ల్విడిచి చేరి కుమారునిఁ దండ్రి యి ట్లనున్. 155

క. ఓరీ తిరిగెడువేశ్యా, నారీతిలకంబు తగులునం బడి యెటులం
జేరొక్క మిచ్చి చెక్కిటి, గోరొక్కటిఁ గొంటి కొంటిగొంటు తెఱంగుల్. 156

క. కేవల నైపుణి విపణి న, యో వలసిన బేరసార మొందక యెందున్
నీవలె నీవలఁ దిరిగిరె, కోవెల వెలయాండ్ర నంటి కోమటిబిడ్డల్. 157

---

[1] సూర్యపాఠము. "గాననం" - పూర్వముద్రణ పాఠము.

ఉ. ఎక్కువ దెచ్చి తక్కువకు నింటికడ న్సరకమ్మఁ జూచుటో
వక్కలు నాకులమ్ము బుధవారపుసంతకు జట్టిగట్టుటో
లెక్కల సంపుటంబుఁ బ్రబలించుటొ కోమటివారి పిన్నవాఁ
డెక్కడ లంజబేర మది యెక్కడ నెక్కడి కెక్క దక్కటా! 158

గీ. ఒక్కనాఁడైన నసువైన వక్క దినక, చిక్కచల్లయుఁ బెరుగుపా ల్గుక్కెఁ డెఱుఁగ
కెక్కుడుగఁ గూడఁ బెట్టిన రొక్కమకట, యక్కడికిఁ జేర్పనీకుఁ జేయెక్క డాడె. 159

ఉ. చూడమె దాని యిల్లు రవిచూచిన సూడియఁ గేరి తూర్పున
వ్వాడకుఁ బశ్చిమంపుఁ దలవాకిలి గచ్చుటరంగుగోడకుఁ
వేడుక కాంద్ర యోటములు వింతలు వ్రాసిన వీడు గాదె యా
కోడె మిటారి నాగడనకు న్మతిపాత్రమె నేఁడు పుత్త్రకా! 160

శా. ఈ చౌకట్లపయిం బదైదులు వరాలిమ్మా మొదల్వడ్డియు
న్వే చెల్లించెద మెప్ప నీవడిగిన న్సెట్టీ యన న్గల్గినఁ
మాచేనుందునె మెందుగా సరకుఁ దేమా యందుఁగా వారి మో
మే చందంబునఁ జూతు నాగడన నీయావు ల్బయ ల్చేసెఁగా. 161

ఉ. సంచులు మోసి బేరముల సంచులు నించిన కాంచనంబులుం
గుంచెడు మాటల న్విటులఁ గుంచెడు చంచలలోచనాళికిఁ
గొంచక పంచిపెట్టితివి కుంచెడు కుంచము కూడఁబెట్టిన
న్మంచము మాయసేసె ననుమాట ప్రపంచము గాంచె నెంచఁగఁ. 162

సీ. వెచ్చంబు చేసినఁ బుచ్చినగొంటు పోఁ కిచ్చిన నొకజాడపచ్చనాకు
కొమ్మన్న నలసందగుగ్గిళ్ళు కొణిదెఁడు పెట్టెడుచో నుప్పుపిడికెఁ డంత
యిందమనిన నాలుగే న్మిరియపుగింజ లిదుదేని తలకింత యిప్పపిండి
దయచేసినను గూరదంటు వేఁడినవి రెండొసఁగిన దొక నల్లపసుపుఁగొమ్ము
గీ. పాలుమాలిన యేనొక్కపఙక గాక
కుదవయిచ్చిన సొమ్మేమి కోకలేమి
తల్లిమెడనున్న నానేమి దండలేమి
కొడుక! మనజాతిలో లేని గుణము గలదె. 163

ఉ. మక్కువ నొక్కవేళల సుమాళము వచ్చిన పంచె కొంగునం
దక్కరి పాఁతకాపులొక తారము గట్టి రమింపఁబోయి మే
మక్కడ రౌతు బంటునికి నందము గైకొని సానికూఁతురా
చక్కెర లెక్కరా దనుచుఁ జక్కఁగ వత్తుము రొక్క మిత్తుమే. 164

క. తారము గాకుండిన నవ, తారము తారము పసిండి తగు వెలనవలా
బేరము మతి వైశ్యస్తం, బేరమునకె తగుదుగా కుబేరముఖులకున్. 165

చ. నెటికెలు దిస్సి చే విసికి నిక్కి యొకించుక యావులించినం
జిటికలు వేసి మై యొరగు చేసి భుజంగులవాతెఱ ల్పదా
ఘుటికెలు చేసి దబ్బరలు గూసి సదా సికరాసి మాడలే
పుటికలఁ బోసి వాసిగను పొత్తులతొత్తుల కేడ సత్తెముల్. 166

క. పండుగ లని గుడిలోపలి, దండుగ లని కొండలయ్య దాస ళ్ళంచున్
మిండలమిత్తి మిటారులు, తెండో యని దోచకొన్న దినములు గలవే. 167

ఉ. కంజ భవాదులు న్మనసు గానరుగా నరులారతిక్రియన్
రంజిలఁ జేయువార లపరంజి యొసంగెడువారు కన్గొనన్
గెంజిగురాకుఁ జూపిన భగేలున లీలని గుండెవారయో
లంజెలపొందు లిం తలఁతులా హృదయాంతమునం దలంతురా. 168

క. అచ్చిక బుచ్చిక లప్పటి, మచ్చిక వెచ్చకుఁడు గామి మచ్చరములపై
యచ్చక యిచ్చిన విటుఁ గను, విచ్చికనుట సొమ్ము సుమ్ము వెలవెలఁదులకున్. 169

సీ. పడపుఁబూఁబోఁడికి బత్తి యెదురుచుక్క పణ్యాబ్జపాణికి బాస దవ్వు
వెలవెలందికి విటవీథిపై దయ సున్న వారవామాక్షికి వావి తవళి
పెల్లాటకత్తియ కెల్ల నంటు పఱకక్క గణికామతల్లికిఁ గాని వావి
లంజెకు మర్యాదలాగు దుత్తూరంబు వేశ్యకు సత్యంబు వీఁక దుద్దు
గీ. నాగవాసంబునకు వర్తనంబు టక్కు
సూళియకుఁ బ్రేమ బిద్దు బోగాలపొలఁతి
కిని గృతజ్ఞత యట్టట్టుఁ గనుక వెనక
వెనకవలదు రూపాజీవ విశ్వసనము. 170

శా. వియ్యాలందిన విందు నిందనముఁ గావించంగ నంగళ్ళనుం
గయ్యా లయ్యెను నిన్న మాపు గలఁతం గైకొంటి మేల్గాదె మా
యయ్యా! లంపట పెట్టనేల మముఁ జింతాపారసంతాపమై
యుయ్యా లయ్యె మదీయచిత్త మకటా! యూరవ్యవంశాగ్రణీ! 171

క. ఈ పాపఁడు నీకొమరుం, డాపణపణనిపుణుఁడా ధనార్జనమందు
న్నీపాటి ట్రాణవాఁడా, యేపాటి యటన్న వారియెడ నే మందున్. 172

క. అని పలుకు తండ్రి వచనము, చెనఁటి తనూభవున కింత చెవిఁ జొరదాయెఁ
మనసా ఘనసాంద్రకచా, వినయోక్తుల చేనుమేయ విడుచుటవలనఁ. 173

సీ. తళుకురుమాలులోఁ దాయతుల్ గానరాఁ జెంప దుంపెసలారు సిగరుటంబు
[1]చిటిగోరునెల దాఁటి జీరాడు ములగపూవన్నియ కండువా వల్లెవాటు
నుదిటి నెన్నదుచక్కి నుదిటించి విరిమించ దిద్దిన నెలవంక తీరుబొట్టు
మునివ్రేళ్ళఁ దగిలించుకొని చురుకునఁ ద్రొక్కు సకళాతుముచ్చెల జరుగుటెక్కు
గీ. చెక్కుటద్దంబునకు నొక్కు నుక్కుగోరు
బెదవి పయికెక్కు పలునొక్కు పెక్కురేఁగ
గచ్చిచల మెచ్చు యమ్మచ్చెకంటి మెచ్చు
వాడఁబచ్చిగఁ దిరుగాడు కోడెబచ్చు. 174

సీ. కంఠపీఠికఁ బేరుగా వైచి మెలిగొన్న తెల్లని యొంటి జందెంపుఁ బోఁచ
నేవళ మందంపు నెతిపూఁత గందంపు దాఁపలి వలెవాటు దసిలిసేలు
పటికంపుఁ బిడివంకిపైఁ గట్టు మొలకట్టు బిల్లతోఁ గనుపట్టు చల్లడంబు
వాడ ప్రోడలు మెచ్చ వన్నెపచ్చడ మిచ్చి తాఁగొన్న గిఱుకుటద్దంపు జోడు
గీ. వీటి విటకోటి యడగని వీడె మిచ్చు
బుడుత మిడుత యొసంగుచే పూన్కిపికిలి
చికిలి పలుకుందనపుఁ దల్కు వెకలిసకులఁ
గూడి తిరుగాడుఁ దొడగన్నకోడెకాఁడు. 175

ఉ. తేజన భాజనంబుఁ గొని తిన్నని యా కిడి యన్నమాజ్యమున్
భోజన యోగ్య శాకచయముఁ నయమూనిన సూపముం గరాం
భోజ నవీన తక్రదధి ముఖ్యము లొప్పఁ బురోహితుండు దే
భూజన మెంచు నంచపుడు భుక్తిఁ గొనుం గణికా కుటీ తటిన్. 176

క. తిట్టని చుట్టము దోఁచని, బట్టుం బచ్చనిభుజంగి బచ్చి రువారం
బిట్టారఁ జనని యొంటరి, నెట్టియెడం గనము సెట్టి యిం పెట్టిదియో. 177

గీ. తల్లిదండ్రులు నిల్లండ్రు నెల్ల కడమ, కాసువీసంబు చోటుల మోసపోవ
నేఁడు రేపను పగలేని నీటుకాని, వీని విడనాడ కుండిన వేగ దనుచు. 178

సీ. చేరొక్క మెత్తి కుబేరు నంతటివానిఁ గాపుఁ జేసి గడించు కసిరువాటు
కలనైన నవ్యకాంతలఁగాని కాపును గనువేసి విటునిఁ జేసిన గయాళి

---

[1] చిన్నయసూరి నిఘంటు పాఠము. చిటిగొరిజెలు దాటి–పూర్వముద్రణ పాఠము.

యేఁచి వల్లము దోఁచి గోఁచి చేతికినిచ్చి చిఱుతసన్యాసిఁ జేసిన పిసాళి
యవలోకములఁ దేల్చి యలద్వితీయ వసిష్ఠ శిష్యుని భ్రష్టు చేసిన బజారి
గీ. బిగిసి కూర్చున్న కోమటి బిడ్డఁ జూచి
బొమలు ముడివెట్టి వలదన్న పుత్రిఁ దిట్టి
తారసిలి రోసపుఁ గడంకఁ దల వడంక
ననియె నప్పుడు పణ్యవృద్ధాగ్రగణ్య. 179

గీ. పున్నమ యమాస యనుగడు లెన్ని చెల్లె, మొన్నటికి మొన్నటంటివి నిన్నఁటికిని
నిన్నానాయెను నీ యీవి యెన్న ఁడింక, తవళిదుత్తూర నిన్ను వీడకతరంబె. 180

గీ. జోకఁ బదియైదు తీకున్నఁ గోక యొకటి, కాకయుండిన నొకమేక లేకపోయె
రూకరుద్రైన నీవలెఁ గాక వట్టి, రాకలకుఁ బిల్చునా గణికాకులంబు. 181

క. సిగ్గుగల సెట్టి యనుచుం, దగ్గఱ నిదుకొన్న కూఁతుఁ దడవక యుప్పుం
గుగ్గిళ్ళమ్ముకొనెడి ని, న్నెగ్గాడిన కొదువ మాది యే మనవచ్చున్. 182

క. ఏమీ మాసొమ్ముల కొరుఁ, దేమనునో వచ్చుపైక మిచ్చుట కలదా
కామునిపున్నమనుండియుఁ, గోమటియుం జూచి చూచి కొమ్మనఁ గలఁడా. 183

క. పెసలర పడెఁడుం బడిమెడు, పసుపున్ నేబెత్తు శొంఠి పడి వసచిదరల్
గసగసలు సెనగప ప్పొక, యిసు మంతయుఁ గాక పైక మిచ్చుట కలదే. 184

క. దివ్వెల పండుగ కేమో, దువ్వట మిచ్చితివి దాఁచ దోసము కలదా
తవ్వెడు బియ్యము వలదొక, రువ్వైన నొసఁగనిచోటు రూపం గలవా. 185

క. బంగారువంటి బిడ్డ మ, ముం గైకొన దీవు వలల ముంచుటచే మీ
యంగడికి వచ్చు జోగులు, జంగా లేమందు లొసఁగి చనిరో నీకున్. 186

క. అంగడిఁ బెట్టెదు మూల న, డంగిన వేశ్యలను వైశ్యుఁడవు గనకోయీ
దొంగవగు నోరు వెక్కస, పుం గోమటి రొక్కమీక బోసేయఁదుగా. 187

ఉ. అన్నకుఁ దండ్రి కంబికకు నక్కకుఁ దెచ్చిన వక్కలాకులుం
దిన్నఁగ వెచ్చపెట్టి గృహదీప మొకించుక యాఱఁజూచుచుణ్
సున్నము పాఱవైచి పడిఁ జూపినచో జగడించు కూటముల్
కన్నకరాబి నీకుఁ దగుఁ గాక కటా జగలంజ కేటికిణ్. 188

సీ. సోదన యొకపడి చూపి యప్పుడ మార్చి వేఱొక్కపడిగొల్చు వెరవు గనుటొ
పరకపాతిక గాఁగఁ బడిగొల్చి యొపడి పాతిక పరకగాఁ బ్రౌఢి గనుటొ

యెత్తుఁ దూఁచినచోనె యింత తక్కెడకొల మలు చుట్టుకొని తూఁచు మాట గనుటొ
సరకెత్తునకును గొంచక తూఁచియును మ్రొగ్గనటులఁ దూఁచి భ్రమించు హరువుఁ గనుటొ

గీ. కటకటా! నీకు వేడుక కాని వగకు
నెంత దూరంబు నుసలించ కిల్లువెళ్ళు
పీఁచ మడఁతునో కోమటికోఁచ యనుచు
వెలవెలఁదితల్లి మెడవట్టి వెడలఁ ద్రోచె. 189

క. త్రోపువడి లోనఁ గ్రుమ్మరు, కోపంబున గుడ్ల నీరు గ్రుక్కుచుఁ బూర్వా
టోపంబు విడక గణి కాం, బా పరిభవ మింత బయలు పడ నీక యొగిన్. 190

మ. నిలుచున్ వాఁకిట మళ్లి పంచకడ తిన్నెం జేరు నందెవ్వరే
వెలివెళ్లం దనుఁ బిల్వవచ్చి రని భావించు న్నిరాశం దుదిం
జలియించుం దిరుగం గనుం బరుఁ బిలన్ సంధించి నన్నా యనుం
గలి వోయన్ మఱి యుట్ల వంక గనుటల్ గన్పించె వైశ్యుం డటన్. 191

మ. వెడలం ద్రోచినఁ జూచి నే వెడలినన్ వేఱొక్కఁ డత్తున్ విటిన్
విడరా దెక్కడనైనఁ దెత్తునని తంద్రిం దల్లి నాఁడింటి కం
గడికిం జేరఁగ నీమిఁ జేసి శ్వశురాగారంబునం గమ్మలుం
గడియంబుల్ ముడుపెత్తి తొంటియటులం గాణిక్యవీథిం జనున్. 192

క. అల్లంతట నూరవ్యజ, తల్లజుఁ గని పల్లవీమతల్లిక యనుఁగుం
దల్లి విటభల్లి రా యటుఁ, దళ్లి పదాగ్రమునఁ దలుపుఁ దటుకున వైచెన్. 193

ఆ.వె.[1] వైచి లోని కరుగు వాకిలిఁ గన మళ్ళు, గడియ దిగిచి మరల గట్టిసేయు
బట్టి గుత్తవగను సెట్టి యెక్కడఁ జొచ్చి, వచ్చునో యటంచు నిచ్చఁ గొంకి. 194

క. కడియాల జోడు విటుచే, ముడుపుం దలుపోరఁ జూచి ముదిముదిత వడిం
గడియ సడలించి బెడగొం, దెడి వీథికవాట మింత దెఱచుచు నంతన్. 195

క. నీవా! నీ వనియెఱిఁగిన, నావంటిది తలుపువైచునా![2] యల్లా
కోవెల బాపఁడటంచున్, భావించితి దేవరాన బంధునిధానా! 196

క. పైఁడి వగలేని వేడుక, కాఁడై వడతునుక దోసె కానుక లంచున్
వాఁడొకఁ డీకడ దినమొక, యేఁడై యెడఁదాక నాగ్రహింపఁగ వలసెన్. 197

---

1 కావ్యము మొత్తము మీద ఈ కవి 3 ఆటవెలదులే ప్రయోగించాడు. (అవి 4-32, 3-96, 5-194)
2 గణభంగము.

క. ఇన్ని దినంబులు చూచితి, వెన్నఁడు నీకడ్డ మొక్కయించుక కలదా?
యిన్నాతి యింటి కడపటి, చిన్నది నీ కెడమె వింతసెట్టివె మాకున్. 198

క. నీపై తే నాపాపము, చూపితిఁ గద వెనుకఁ గడుపు చుమ్మటి చుట్టెన్
బాపంబుఁ గట్టుకొంటిఁగ, దా పడుచా యంటిఁ బిలిచి యడుగుము దానిన్. 199

క. నీదండ నాడినది నో, రాదేశమువా రెఱుంగరా యిచ్చక మా
మా దేవరరఁగు మీఁద మ, హాదరమునఁ బూజసేయ నర్హుఁడవు చుమీ. 200

క. ఈ యిల్లు నీదు సొమ్మని, యాయల్లుని లోనియింటి కటఁ గొని చనుచోఁ
జేయిచ్చెఁ గూఁతుమాటకుఁ, జేయిచ్చెం జేతిసొమ్ము చేతి కొసంగన్. 201

క. ఈతనిపైఁ గూఁతుర నీ, వీతతీ దయదాన వగుట యెఱుఁగఁగ వచ్చెన్
రాతిరి నుండియుఁ గంటి క, యో తుది నిదురెఱుఁగవే కదో యనినంతన్. 202

ఉ. అక్కరినాత్మురాలు వెలయాలు భుజంగు నిజాంబికా భుజా
భాక్కరు రొక్కరూక లిడు బచ్చుఁ గవుంగిట గ్రుచ్చిగ్రుచ్చి నీ
చొక్కపుఁ జెక్కుటద్దములఁ జొక్కుచు నీడలు చూడకున్న నాఁ
డొక్కయుగంబు తావక వియోగ మయో పవియో గణింపఁగన్. 203

సీ. ఓరోరి నా వ్రేలికొక్కింత యుండనీనా యని బటువులు నాఁచుకొనియెఁ
బిల్లల మొలనూలి యల్లిక వింతంచుఁ దాగట్టుమొలనూలు దక్కఁబెనఁచె
నిది కుత్తి కంటెన నింతు లెంతు రటంచుఁ జెవులచౌకట్లకు జిగురువైచె
నీపూటకే కట్టితేప యిచ్చెద నంచుఁ దెలిపావడము కట్టు దిగిచివైచెఁ
గీ. గడవకూడును బెడిదంపు గావుపోతు
పోతురాజయ్య కంచును జేతివల్ల
వల్లము సడల్చి యుల్లము కల్ల కూఁచ
కూచముట్టుగ దోచె నయ్యువిద యతని. 204

ఉ. దోఁచినముల్లె గాటగుట దోఁచిన మాయెదురింటిదానిపై
రేఁచిన మాపులేమి తుది రేవగలచ్చట రచ్చలేమి చే
చాచిన నిచ్చుటేమి యిటఁ జాలును మీ రటకే చనుండు నో
రాచిన సిగ్గెఱుంగ వని యాగణికాంబ కృథావలంబయై. 205

గీ. దొమ్మరులవీడొ పల్లికూటమ్మొ మయిల, సంతొ బెస్తలసాలొ [1]జూజంపు గట్టొ
రచ్చకొట్టంబొ తనమందిరంబు నీకు, గజిబిజి యిదేమి నీ నేస్తకాంఢ్రు నీవు. 206

---

[1] చిన్నయసూరి నిఘంటు పాఠము. జాజంపు-పూర్వముద్రణ పాఠము.

క. ఆచార్య పురుషు లార్య సు, ధీచంద్రులు జపితలుం బ్రతిష్ఠితులు యతు
ల్రాచ కొమాళ్ళును నిన్నుం, జూచిన మందాక్షు లెట్లు సుడియుదు రిటకుఁ. 207

ఉ. పట్టపగళ్ళు రే లిచటఁ బాయక యుండెదు మంచివాఁడవే
చుట్టము వచ్చుటెట్లు నినుఁజూచిన నీ గొడవేల కట్టుకో
బట్టయినట్లొ కూర కొక పాతిక కాసులొ యొట్టిగొడ్డు తా
కట్టని తాడనాస్పద కృకాటిక చేటికఁ గన్ను గీఁటినఁ. 208

క. పెద్దాపె కోపమాఱిన, నిద్దఱ మరుదెంతుమని బహిర్ద్వార్వేదిం
దద్దుర్మదు నిడి చేటిక, బద్దులపుట్టిక కవాటబంధ మొనర్చెఁ. 209

క. అంటి కిరాటుఁడు విటుఁడై, యింటికిఁ గా కెల్లధనము నిచ్చియు వెలవా
ల్గంటికిఁ గా కప్పంటికి, రెంటికిఁ గొఱగాని తొంటి రేవణుఁ డయ్యెఁ. 210

ఉ. తల్లడ మంది పల్కు విటతల్లజుఁ డెల్ల జగం బెఱుంగఁ దా
వల్లము చేతి కిచ్చినను వల్లము సుమ్మన దంతె కాదు పో
కల్లలపుట్టినిల్లు మఱికల్లరి పల్లవ వల్లవీ ఛురిఁ
దల్లిని జేయవచ్చునె విధాత వృథా తరుణీమతల్లికిఁ. 211

మ. ఒకనాఁడైన నభీష్టవస్తు విదితేవో యన్న లేదంటినో
యొకవేళం దనుద్రోఁచి నీచగృహకృత్యోద్యోగము న్సేయనో
నికటక్షోణి నిజాంగరక్షణకు ముఁ దేవుళ్ళకు మ్రొక్కనో
యకటా! యీజరఠాధమాధమకుఁ గ్రోధావేశ మింతేటికిఁ. 212

క. కడియం బీనో పుత్తడి, కడియం బడిగినను దేనొ కంటెయుఁ గొననో
మడియ వగతొత్తు వాకిట, గడియ బిగించెఁ ఫలించెఁ గద యనువేళఁ. 213

సీ. వెనువెంట నొండొందువిరిరాల నరజాఱు వేనలి మూఁపుపై వీయమంద
మెఱుఁగు గమ్మలడాలు నెఱిమించు టద్దంపు నిద్దంపుఁజెక్కులు నీటుఁ జూప
సందిటియపరంజి జాజికాయలచేరు జమిలితాయెతులతో జతవహింపఁ
గుచ్చుల దారంపు కొనతోడ సరిగంచు పైతాఱినెఱికపైఁ బరిఢవిల్ల

గీ. నిఱుకుఁ జనుగుబ్బకవ పైఁట నొఱపునెఱప
సన్నకాటుకచుక్క బొట్టన్ను గొలుప
నిగనిగని మేన నలుఁగిడ్డ మృగమదంబు
బుగులుకొన నిల్లువెడలె నప్పువ్వుబోఁడి. 214

చ. వెడలి విలోక దంబరము వెంబడినిం బడి యంగహావపుం
గడలి మునింగి పెంపుడు మెకంబుల మెందున మిండపైకపుం
దుడుములురాc గలానిధియుc దొంటిగతి న్వెనుడాయ డాసె న
య్యుడునఖరాశిఖామణి రఘూద్వహమోహన గేహదేహళిన్. 215

గీ. అప్పు డప్పల్లవాగ్రణి యప్పుడంతి, యెప్పు దరుదెంచి తనదు మోమెత్తి కనదు
చెప్ప దుడిగంబు ముదిగోద చీదరేcగి, చెప్పి యీరాజముఖి యోజc జెలచె నౌర!

ఉ. ఆట ఘటించి ధూర్జటిశరాసన శాసన వాసగమ్యమై
పైcట సడల్చి గట్టి సగపట్టు నునుం జనుకట్టు కట్టచోc
గాటపు తక్కి జారుదొడి కాసెపుదట్టి బిగించుచో ననుం
బాటలగంధి చాcటు తెలవట్టుటకుం బిలదాయె దైవమా. 217

ఉ. చేటియుc దమ్ముc డిచ్చటికిc జేరరు నాకిది వేళ నేcడ కో
లాటము దీరి దేవరకు నత్తఱి నీ గొడుమెత్తి హత్తి తా
లాటపుc బాటవాడి నిలయంబునకుం జను దీనివెంట నీ
పూటకుc గాసె మోసికొని పోయినc జిత్తము మెత్త నయ్యెడున్. 218

శా. అంచుల్రాయిడి వన్నెరాcబులుగుతేcడాసీనులూతల్గొనం
బంచాస్యంబుల[1]దుల్లుపాcపదొర గ్రామ్యబ్రహ్మచారు ల్దివా
లించం [2]బచ్చనప్రాcత లూడిపడు మేల్కిల్లుల్లు మన్యంబులొ
చంచద్వాహము లుంచు మంటపము పంచం జేరి విశ్రాంతుcడై. 219

మ. నలినాక్షుండు సడల్చు నెండు విరిదండ ల్గట్టిగాc గట్టి దాc
దలకుం గొంత తలాడcగా నడుము హత్తన్ మెత్తనై చిత్త మ
త్తలిరుంబోడికిc దత్తరించి కలవిత్తంబెల్ల హత్తించితిన్
దలిదండ్రు ల్వలదండ్రు దాని వలవంతం జింత యింతాయెc గా. 220

శా. నేనాద్రవ్యము వెట్టి గట్టి గుడియేనీ కట్టినట్లాయెనా
కానీ మీకు మణీకిరీటముఖ కైంకర్యంబుc గావించుటో
యానారీమణి కిచ్చుటల్ త్వదనుకంపానర్హుc డైతిం గదా
యేనా దేవర మాయ దాcటుటకుc దండ్రీ! జానకీవల్లభా! 221

[1] గల్లు. [2] బచ్చనవ్రాత – కూచిమంచికవి పాఠాలు.

ఉ. ఏటికి మిమ్ము దూఱునని యింతియుఁ దాఁ దలగంద నాఁటికి
న్నేఁటికి మీగుణం బిటుల నేకద యుండు నటంచు నెంచఁగా
నోటికిఁ గంటినో వలదు నూటికి నొక్కటియైన నీకత
ల్మాటికి వింటినో రఘుకులప్రవరా! యని కన్ను మూయఁగఁ. 222

సీ. కరమబ్బు కరిమబ్బు మెఱుగుబ్బు మయితోడ సరిమిన్న నెఱిబన్న సరముతోడ
నలవాటుగల నీటువలెవాటు పటితోడ సిరిగప్పు నెఱికొప్పు విరులతోడ
ననిశమ్ముఁ గనుదమ్ములను జిమ్ముదయతోడ జగచందు జిగిచిందు మొగముతోడఁ
దన డాకదను జోకఁగను కోకకుచతోడ విలుజోడు బలుజోడువెన్నుతోడ

గీ. జవన జంఘా విలంఘిత స్తవనభవన
భువననిధిరాజ పవనసంభవునితోడ
భద్రతరకీర్తి శ్రీరామభద్రమూర్తి
యతని కలలోన నెదుటఁ బ్రత్యక్షమయ్యె. 223

గీ. ఇట్లు ప్రత్యక్షమగుతండ్రి కెరఁగి లేచి, గాఢ రూఢ స్వభావంబుఁ గడచి రాము
హస్త మొకయింత మస్త విన్యస్త మగుటఁ, బ్రతిభ వాస్తవ్యుఁ డిట్లని ప్రస్తుతించె. 224

**దండకము:-** శ్రీరామభద్రాయ, లీలాసముద్రాయ, సంభద్రశుంభద్రసాపాంగశంపాయ, భృత్యన్నిలింపాయ, తీవ్రాంశువంశార్ణవాధీశరాకాశశాంకాయ, ధావత్కలంకాయగాధేయ-నీతార్చనాభోగసంబంధగంధస్రజోన్మీలనీలాంబుముక్ప్రీనిభాంగాయ, తేజఃపతంగాయ, కుప్యత్ప్రుతీయాదృగక్షిప్రకాశప్రతీకాశపన్నేత్రమౌనీట్కుటుంబప్రతిష్ఠాకృతిశ్రేష్ఠపాదాంబురుట్పాంసులేశాయ, ధాత్రీతలేశాయ, దుర్వారదోర్గర్వభగ్నీకృతాఖర్వపూర్వోత్తరస్వామికోదండదండాయ, జన్యప్రచండాయ, సీతాహ్వయప్రేయసీతారకాపూర్ణచాకోర-కాప్తాయ, దాసాత్మసుప్తాయ, శర్వద్దశస్యందనాజ్ఞప్తిరుప్తి ప్రియాసిద్ధబద్ధప్రతిజ్ఞాయ, భాషామనోజ్ఞాయ, జాతాపరాధాల్పమేధ స్పురాధీశ భూరక్షణక్షోణిదృక్కోణదీవ్యత్తితిక్షాయ, పంకేరుహాక్షాయ, మారీచమాయాచమత్కారధిక్కారనిర్ణీచనారాచలాఖేటకాచార-చామీకరాహార్యచాపాయ, చంచత్కలాపాయ, సుగ్రీవసంస్థాపనప్రోల్లసద్వాల్యురః-పీఠశాణోపలోత్తేజితాస్త్రైకహస్తాయ, కారుణ్యశస్తాయ, సౌధాంధసాద్వ్యజ్జ్వలచ్ఛింధుసంధాన-కృత్కంధిరాడ్బంధసంబంధసేతుప్రసిద్ధప్రబంధృప్రణీతప్రబంధాయ, సత్కీర్తిగంధాయ, శక్రాద్యనిద్రాణవిద్రావణామోద విద్రావణశ్రావణద్వ్యభ్రనిర్భిద్భుజావల్లివేల్లద్ధనుర్జ్యానిరాతంక-టంకారఘోరాయ, శంకావిదూరాయ, లంకాధినాథాయ, తాక్షీణదాక్షాయణీవల్లభక్షోణి-భృత్పాటనాక్షయ్యరక్షః కనిష్ఠాగరిష్ఠాయ, నిష్ఠాయ, నైకేతనాస్తోకరైకేతనానేకసాకేతరానేక-లోకైకసంశ్రీకసాకేత సీతాసతీసక్తపట్టాభిషిక్తాయ, గోత్రాపరిత్రాణవాల్లభ్యలభ్యాయ, భాస్వత్కులేభ్యాయ, సంరక్షితాత్మీయసంకీర్తనాభ్యాసరోభ్యస్యసభ్యాయ, నేమేశనాభ్యాయ, తుభ్యం నమః. 225

క. అని వేడ్క విట్కులాగ్రణి, వినుతింప న్వని వినీలవిమలాంగ ఘనా
ఘనసంపన్న స్వర్ణ, స్వనవాంశుకుఁ డంశుమాలివంశజుఁ డనియెన్. 226

శా. వత్సా! తొల్లిటి కంటె దివ్యమణి నవ్యద్రవ్య ధాన్యాదులుం
ద్వత్సద్మంబునఁ బద్మ పొందుకొనుఁ జింతల్మాను మత్సోధరం
గత్సైవైకకిరీట పీఠముఖ కైంకర్యంబుఁ గావించి నీ
వుత్సాహంబున నుత్సవంబుఁ గనుమా యుత్సంగజాతాగ్రజా! 227

క. అని యానతిచ్చి మచ్చిక, జనకతనూజాధినేత చనఁ గ్రక్కున మే
ల్కని చెక్కులఁ జాల్గొని తన, కనుఁగవ మోదాశ్రితాశ్రుకణముల్ గురియన్. 228

శా. సంధాతన్నవధాతటిచ్చపలవేశ్యావశ్య దుస్సంగ సం
బంధంబుల్ దెగటార్చి కూర్చితి బలిప్రహ్లాదుల న్నేఁడు నా
బంధుల్గా నిట నెందు నేర్చితొ విపద్బంధుత్వ మోతండ్రి! కి
ష్కింధారాజ్య రమాధురంధరిత సుగ్రీవా! రఘుగ్రామణీ! 229

మ. అనుచుం గోవెల కేగి దేవమణికి న్సాష్టాంగదండ ప్రణా
మ నుతు ల్సేసి గృహంబుఁ జేరి సిరుల న్మాతాపితృ స్వాంతము
ల్లనియించెం జనులెంచ నద్భుతమహోత్సాహంబు సంధిల్ల న
ద్దిన మూరెల్లను నొద్దగిల్లఁబడి కీర్తించెం గిరాటాత్మజున్. 230

మ. శతమన్యుప్రముఖు ల్విరించిసభకుం జందెంతు రాబ్రహ్మ య
చ్యుతు సేవింపఁగ వచ్చు నట్టినలినాక్షుం డింటికి న్వచ్చినన్
శ్రుతదేవుం దయదేల్చె నేను నిను బేర్కొంటిన్ భవన్మందిరా
గతిఁ గంటి న్యతివంటివాఁడ వనుట ల్గాచెం గిరాటుం డిలన్. 231

శా. కట్టించె న్పురతాగ్రజన్మునకుఁ బ్రాకారావళు ల్గోపురం
బొట్టించె న్రఘునేతకుం బడితరం బొప్పంగ ధాన్యాదులం
బెట్టించెన్ ద్విజకోటికి న్రఘుపతి ప్రీత్యర్థమై సత్రముల్
ధట్టించె న్బలి బాదరాయణులఁ దద్భక్తుండు తత్త్వంబునన్. 232

గీ. ఔర శ్రీరామకైంకర్యహార్యవార్య, చర్య యెట్టిదొ గాని యయ్యార్యతనయ
పుంగవుం డాయురారోగ్య భోగ్యభాగ్య, పుత్రపౌత్రాభివృద్ధిచేఁ బొలుపుఁ గనియె. 233

క. మొదలఁ గలానిధిచరితముఁ, జదివిన వ్రాసినను వినినఁ జతురుం డతిసం
పదఁ జెందు న్ముదమొందు, న్మదియందుం దురితమునకు మఱి చొరఁ డెందున్.

వ. అని శుకయోగీంద్రుం డానతిచ్చిన బహుళాశ్వచరిత్రంబుఁ బరీక్షించి పరీక్షిన్నరేం
ద్రుండు పరమానందకందళిత హృదయారవిందుం డయ్యె. 235

శా. రాజీవాయతలోచనాజననవప్రద్యుమ్న ప్రద్యుమ్న వి
భ్రాజన్మందిర బాంధవాళినళినీపద్మాప్త పద్మాప్తవీ
క్షాజాగ్రత్కరుణాప్త సప్తవిధసత్సంతాన సంతానధా
త్రీజాలామితవిస్ఫురద్వితరణశ్రీవాస శ్రీవాసవా. 236

క. దామరలవంశసోమా, సోమధనుర్విజితధైర్య సుస్థిరధామా
ధామ విజృంభణభీమా, భీమాగ్రజరాజమాన్య పృథుగుణధామా. 237

ఉత్సాహము వాసవాంబరాంఘ్రిభక్తవశమనోజ్ఞ భాసురా!
భాసురారి వరతురంగ భారికీర్తి వాసవా!
వాసవాదిశోభితగుణవారసుమహిమాసమా!
మాసమాజవిభవదీప్త మాననీయవాసవా! 238

## గద్య

ఇది శ్రీమద్వేంకటేశ్వర సమగ్రకరుణానుగ్రహశాశ్వతైశ్వర్య ధుర్యతామహేశ్వర రూప
రేఖావిజితరతీశ్వర సరససంగీతసాహిత్యసకలకలావిచక్షణ సమాశ్రితవిద్వత్కవి
రక్షణదక్షవీక్షణ యినిగెలగోత్రపావన పరిపంథిరాజకల్పితపాదసేవన
దామరల వేంకటాధీశపుత్ర చెన్నభూపాలకలితసౌభ్రాత్ర గురువమాంబా
గర్భశుక్తిముక్తాఫల గురువనజసంభవభవ శేషభాషామనీషాబల
ప్రతిదినాగతార్థిజనవరప్రదాయక వేంగళనాయక ప్రణీతం
బైన బహుళాశ్వచరిత్రంబను మహాప్రబంధంబున సర్వంబును
బంచమాశ్వాసము సమాప్తము.

